LitQuiz No. 19 — Rs. 25000 — FAMINE RELIEF FUND: Rs. 1,000 — FIRST PRIZE: Rs. 12,500 — TRANSISTOR MINIQUIZ For Every All-Correct Winner — RUNNERS-UP:- UPTO 4 ERRORS + MINIQUIZ:- UPTO 2 ERRORS — THESE WINNERS WILL SHARE THE BALANCE PROPORTIONATELY.

Final Closing Date: 27-7-67
Solution in Bharat Jyoti: 30-7-67
Result in Bharat Jyoti: 13-8-67

*Send with your entries a self-addressed 6 Paise post card to receive Solution immediately.
*You can post your Entries even on 26 7-67. But send them by Express Delivery.

## Official Entry Form of Litquiz No. 19

LITQUIZ No.19, ALANKAR, BALARAM ST. BOMBAY-7 (WB)

Note:—(1) Strike out with ink in each column the word you have rejected. (2) Cancel the second coupon if you send only one coupon. (3) If you send Entry fee by M O. you MUST enclose with this Entry Form the M.O. Receipt you get from post office. Entries without M. O. Receipt will be disqualified. (4) Do not Cross I. P. O. Make it payable to Litquiz No. 19 at Bombay.7

| 1 | Re. 1 | | 2 | Re. 1 | |
|---|---|---|---|---|---|
| 1 | ACTIVITY | VARIETY | 1 | ACTIVITY | VARIETY |
| 2 | CHEAP | COMPLETE | 2 | CHEAP | COMPLETE |
| 3 | CONCLUSIVE | INCLUSIVE | 3 | CONCLUSIVE | INCLUSIVE |
| 4 | CULTURAL | NATIONAL | 4 | CULTURAL | NATIONAL |
| 5 | DEBT | PAST | 5 | DEBT | PAST |
| 6 | DELIGHT | DIVINE | 6 | DELIGHT | DIVINE |
| 7 | DUTY | MORALITY | 7 | DUTY | MORALITY |
| 8 | ECONOMY | STABILITY | 8 | ECONOMY | STABILITY |
| 9 | ENMITY | ENVY | 9 | ENMITY | ENVY |
| 10 | EVOLUTION | NATION | 10 | EVOLUTION | NATION |
| 11 | FAITH | LOVE | 11 | FAITH | LOVE |
| 12 | GODLINESS | GOODNESS | 12 | GODLINESS | GOODNESS |
| 13 | HAPPINESS | SELFLESSNESS | 13 | HAPPINESS | SELFLESSNESS |
| 14 | MORAL | SOCIAL | 14 | MORAL | SOCIAL |
| 15 | PERFECTION | TEMPTATION | 15 | PERFECTION | TEMPTATION |
| 16 | POET | SAINT | 16 | POET | SAINT |
| 17 | RESTLESS | SELFLESS | 17 | RESTLESS | SELFLESS |

19 SEND THESE 2 COUPONS & ENTER MiniQuiz FREE

MiniQuiz — 10 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| ACTIVITY | VARIETY | EVOLUTION | NATION |
| CHEAP | COMPLETE | FAITH | LOVE |
| CULTURAL | NATIONAL | MORAL | SOCIAL |
| DUTY | MORALITY | POET | SAINT |
| ECONOMY | STABILITY | RESTLESS | SELFLESS |

19 (ASVP)

In entering this Quiz I agree to abide by the Rules & Conditions and accept Competition Editor's decision as final and legally binding. Entry fee for each one coupon is Re 1. Entry fee for this complete Entry Form (of 2 coupons) is Rs. 2. I enclose M O. Receipt/I.P.O./Litquiz Cash Receipt/Prize Card and its number is...

CAPITAL LETTERS

NAME ........................................

ADDRESS ........................................

........................................

Cut out and send this complete Form

## 17 CLUES

1. Activity/Variety is the very soul of life. 2. Human life is not, and can never be Cheap/Complete. 3. The religious philosophy of life is Conclusive/Inclusive and universal. 4. The task in bringing about the social and economic progress which we desire for India is that of establishing Cultural/National unity in the country. 5. If you intend to move forward, it is evidently not good sense to have the burden of your Debt/Past right on your head all the time. 6. Every form of life, every beat of life is Delight/Divine. 7. Duty/Morality is not relative; it is absolute. 8. Just as brevity is the soul of wit, Economy/Stability is the soul of a State. 9. Enmity/Envy is indeed the bane of social life 10. A distinctive feature of our Evolution/Nation is unity within diversity. 11. The Cross of Jesus is the classic instance of Faith/Love resisting evil and overcoming it. 12. To conquer evil and suffering one has to cultivate Godliness/Goodness. 13. Desires and fears are the two enemies of true Happiness/Selflessness. 14. The dependence of man upon men has grown. This common dependence gives rise to Moral/Social relationships. 15 The problem of Perfection/Temptation is the pragmatic argument for the existence of God and man's need for Him. 16. A Poet/Saint can afford to look at the sky and the moon and stars and forget his surroundings. A scientist cannot. 17. A little meditation is not good. God cannot be realized through such lukewarm moods One must yearn deeply, one must become Restless/Selfless.

NOTE: The above clues are quotations reproduced from the works of authors and writers. They are complete sentences and are also independently complete in sense. Names of Authors/Writers and their Works will be published along with the official solution in Litquiz Weekly.

# ఉత్తరాలు

### కథలు

వారంవారం మీ పత్రిక చదువుతునే ఉన్నాను చాలా కాలంగా.

కాని ఈ వారం (23.6.1967) పత్రికలోని ''రచయిత్రి జీవితం అన్న కథ నన్నెంతో ఆకర్షించింది. అది వ్రాసింది రచయిత్రి అయినా, అహంకార పూరితలై తనపై ఆశలతో ఉండి, తనను కోరి తనవలనే సుఖపడ వలసిన భర్తనే తృణీకరించే రచయిత్రినిగా నీరజను వర్ణించటం నాకాశ్చర్యాన్ని కలిగించింది. అంతేకాక శేఖర్ జీవితం నాకెంతో సన్నిహితం. ఆశించినవి అందనినాడు, తన 'సహధర్మచారిణి తనను తృణీకరించిననాడు, తన భార్యపై, భార్యవలన తనకున్న కోరికలు తీరనినాడు శేఖర్‌లాంటి భర్తపడే బాధను రచయిత్రి రాజ్యలక్ష్మిగారు 75% వర్ణించారు. శేఖర్, నేనూ సన్నిహితులమంటే మా జీవితాల సన్నిహితసంబంధం 99%

స్త్రీకి సహజమైనవి—క్షమ, అహంకారం, అసూయ, ఈ మూటిలో మొదటిది కొరవడినది. మూడవది వదలమన్నా వదలనిది. మధ్యది గర్వించదగినది. కాని సాధారణంగా చివరి రెండు ఎక్కువగాను, మొదటిది అరుదుగాను కనిపిస్తుంటాయి వారిలో. (మెజారిటీనాదృష్టిలో)

నీరజలోని నిర్లక్ష్యాన్ని శేఖర్ మాన్పలేక పోలేదు. అదిచేతకాని తనంగాదు నీరజపట్ల జాలి. అనవసరంగా గడబిడ చేసుకొని బజార్న పడి తన పరువు పోగొట్టుకొన్నదానికన్నా, తనొక్కడూ బాధపడి తన దురదృష్టానికి చింతిస్తుంటాడు. అంతకన్నా వేరు దగింది లేక.

రచయిత్రి రాజ్యలక్ష్మిగారికి, ధన్యవాదాలు.

ఎస్. ఎస్. (శ్రీ, హైదరాబాద్.)

* * *

16—6—67 సంచికలో ప్రచురించిన అడివి శివసుబ్రహ్మణ్యం గారి 'ఎలా నీకు చెప్పేది?' అను కథ చదివినాను. చాలా సహజంగా ఉన్నది. ముఖ్యముగా రాజారావు పాత్ర చిత్రీకరణ బాగుంది. పతాక సన్నివేశంలోని రాజారావు మనస్సును వర్ణించుట బాగుంది.

ఇంత మంచికథను రచించిన రచయితకూ, ప్రచురించిన మీకు నా ధన్యవాదములు.

ఎం. శంకర్‌ప్రసాద్ (మద్రాస్).

* * *

మీరు ప్రచురించిన ''గోల్డ్ ఫింగర్'' (బొమ్మల కథ) చాలా బాగున్నది. ఇప్పుడు మీరు ప్రచురిస్తున్న ''లివ్ అండ్ లెట్ డయ్ కూడా బాగుంటుందని తలుస్తాను. ముఖచిత్రం (30.6.67) సంచిక బాగున్నప్పటికీ ఇదివరకు చూచిన చిత్రం కాబట్టి అంతగా బాగులేదు.

ప్రకాష్, తుని.

### సీరియల్

సీరియల్స్ ''మట్టి బొమ్మలు పూర్వసంధ్య ప్రవర్తతే రెండు చదువరులను బాగా ఆకర్షించు కొనుచున్నవి. ''మట్టిబొమ్మలు'' సీరియల్‌లో ''ఇక్కడున్న మన గుంటూరులకి నాలుగు కాలేజీలు తగలబడ్డాయిగదా'' అని మధు ఊర్మిళతో అంటాడు లేదు, గుంటూరులో మూడు కాలేజీలే ఉన్నవని కొత్త నాగేశ్వరరావు వ్రాసిన ఉత్తరమును 23—6—67 సంచికలో పబ్లిష్ చేశారు. గుంటూరులో హిందూ, ఎ. సి., ఉమెన్స్, మెడికల్ కాలేజి లున్నవి.

కె. కె. రాజు (మద్రాసు)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శుక్రవారం : 28—7—'67
ప్లవంగనామ సం॥ ఆషాఢబహుళ సప్తమి
సంపుటము : 59 సంచిక : 46
స్థాపితము :
1908
ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'మరపురాని కథ'లో కాంచన

కథలు :

శిరి గుణేని నిశ్చయం — 36
సుఖజీవితం — 48

సీరియల్ నవలలు :

మట్టిబొమ్మలు — 24
పూర్వాసంధ్యా ప్రవర్తతే... — 40

శీర్షికలు, వ్యాసాలు సినిమా.

ఉత్తరాలు—4, ఉమెన్-కార్టూన్ — 5, అన్నప్పని మరణం—6, లివ్ అండ్ లెట్ డయ్—8, ప్రశ్నావళి—14, శిక్షాపథం—16, ఉద్యోగినుల సమస్యలు—డాక్టర్ కనుర్తి—17, వంటలు—18, నీటమునిగినమానవుడు-అభియోగాలలో వింతలు-20, వెంగడుకిమేత — 21, బాలసాహితి — 22, వారఫలం — 30, మరణం: కొన్నిసమస్యలు— 31, మద్రాసులో అగ్నిప్రమాదాలు-32, సిగిరియ-34, జూనియర్ల ప్రోగ్రామ్... —55, జయలలితతో ఇంటర్వ్యూ —56, లోకంపోకడ — 57, చిత్ర సమీక్ష-చిత్రలహరి-58, పుస్తకాలు—64.



విలియం మాంచెస్టర్

# అధ్యక్షుని మరణం

## 9

అసలు వాస్తవానికి అతిదగ్గరంగా ఉండిపోయినవారు అక్కడి గుమాస్తాలు. వారికి కాగితంతో వ్యవహారం బాగా అలవాటు. ఈ హఠాత్తు ప్రమాదంతో ఆ వ్యవహారాలలో తలదాచుకున్నారు.

'కెన్నెడీ, జాన్ ఎఫ్' అని శుభ్రంగా రాశారు. 12.38 కి రికార్డులో. 'తెల్లజాతి పురుషుడు, ఎమర్జెన్సీ రూమ్ 24740 కేటాయించబడినది' అని రాశారు. చీఫ్ కంప్లెయింటుకింద 'జి. ఎస్. డబుల్యు లేక 'గన్‌షాట్ వూండ్' అని రాశారు—'తుపాకిదెబ్బ'! 'కాన్నలీ, జాన్' నెం. 24743 కి కూడా ఇదే కంప్లెయింటు రాశారు. ఈ ఇద్దరి మధ్యా నోటి వెంబడి నెత్తురు కారుతున్న ఒక తెల్లజాతి స్త్రీ, కడుపునొప్పిగాఉన్న ఒక నీగ్రో స్త్రీలపేర్లు రాశారు. (నిజానికి గవర్నర్ కాన్నలీని వీరందరికన్నా ముందే ఎడిట్ చేశారు)

మధ్యాహ్నమంతా దానితో సరిపోయింది. ప్రయిస్ ఒక గుమాస్తాని డిస్మిస్ చెయిస్తానన్నాడు. దీనివల్ల కలిగిన లాభమేమీలేదు. అన్నీ రికార్డు చెయ్యాలి. ఫయిలుచెయ్యాలి. ఎవరి విషయంలోనూ ఇది వదలటానికి వీలులేదు. వోబ్రయన్ ఆస్పత్రిలోకి వచ్చాడు. పొరపాటున తప్పుచోటుకి వెళ్ళాడు. బల్లవెనుకకూర్చున్నకళ్ళజోడు ఆవిడఎదురయింది. 'ఆగండి!' అని ఒక ఫారమ్, బాల్‌పాయింటు కలం ఇచ్చింది. అతనుచేసేది లేక ఆ ఫారమ్‌ని నింపడం మొదలుపెట్టాడు. 'వోబ్రయన్ లారెన్స్ ఎఫ్' అని రాయటం మొదలుపెట్టాడు హఠాత్తుగా అతనికి తను చేసే పని ఎంత అర్థం లేనిదో అర్థమయింది. కలం, కాగితం పడవేసి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

జాన్ ఎఫ్ కెన్నెడీ కళేబరం ఈ తుఫాను మధ్య ప్రశాంతంగా పడుకుని ఉంది. 'ట్రౌమారూమ్ నెం 1'లోని వారికి ఉత్తప్పుడు అనవసరం. తమ కర్తవ్యం ఏమిటో వారికి తెలుసు. క్రమశిక్షణ వారికొక ప్రశాంతత ప్రసాదించింది. కత్తులు, సూదులు, చేతి తొడుగులు చకచక వాడారు; టెలిఫోన్‌లు చేశారు; డయల్లు తిప్పారు...

గొంతుక మీద గాయం చిన్నది. నెమ్మదిగా రక్తం కారుతోంది. కాని తల వెనుక భాగం బాగా దెబ్బతిన్నది. కారిన నెత్తురంతా అక్కడిదే. ఇంకా రక్తస్రావం ఆగలేదు. మొత్తం 1500 సి. సి (ఒకటిన్నర లీటర్లు)ల నెత్తురు ఆస్పత్రిలో మాత్రం చిందిందని అంచనా వేశారు. నెత్తురుతో బాటు మెదడుకి సంబంధించిన వివిధ మాంస పదార్థాలు కూడా అక్కడక్కడ పడ్డాయి. ఇంచుమించు నగ్నంగా ఉన్న అతని దీర్ఘదేహం సోలు పరుపుమీద వెల్లకిల్లా పడుకోపెట్టారు. కళ్ళు తెరుచుకుని ఉన్నాయి. గుడ్లగా తెరుచుకుని పయిన దీపం వయిపుకి తిప్పి ఉన్నాయి.

మొదటి వయిద్యుడు వచ్చాడు. చార్లెస్ కారికో రెండవ సంవత్సరం 'సర్జరీ' చేస్తున్న యువకుడు. త్వరత్వరగా పరీక్షచేశాడు. నాడి ఆగిపోయింది. రక్తపుపోటు అసలే లేదు. అయినా ఇంకా ప్రాణం పూర్తిగా పోలేదు. దేహం ఊపిరి తియ్యటానికి అతి ప్రయాసపడ్తోంది. గుండె, అప్పుడప్పుడు, ఇంకా కొట్టుకుంటూనే ఉంది. కారికో 'ఎమర్జెన్సీ ట్రీట్‌మెంట్' ప్రారంభించాడు. నోటిద్వారా ఒక ట్యూబు పెట్టాడు. రింగర్స్ ద్రావకం (ఒక రకమయిన సెలయిన్ సొల్యూషన్)లో పాలు కలిపి కుడి కాలులోకి ఒక రక్తనాళం ద్వారా ఎక్కించాడు. తర్వాత అధ్యక్షుడి రక్తం రకంగురించి అడిగాడు. ఒక నర్సు బయటికి పరిగెత్తింది. 'అధ్యక్షుడి నెత్తురు రకం ఏది?' అని అడిగింది హిల్, కెల్లర్‌మాన్‌లని. క్లింట్ తన పర్సుకోసం చెయ్యిజాపాడు. రాయ్, 'వో, ఆర్‌హెచ్, పాసిటివ్!' అన్నాడు. చివరికి అధ్యక్షుడికి 'వో ఆర్. హెచ్. నెగెటివ్' ఇచ్చారు. ఇది అతనికి ఎటువంటి ఇబ్బందీ కలుగచెయ్యలేదు.

శవం తీసుకుని వెళ్ళేబండి చుట్టూ పధ్నాలుగుమంది డాక్టర్లు మూగుతున్నారు. ఇది మరీ ఎక్కువ: అది చాలా చిన్నగది. ముగ్గురు వైద్యులకన్నా అనవసరం. కారికో బదులు పనిచెయ్యటానికి మాల్కమ్ పెర్రీ అనే 34 సంవత్సరాల వైద్యుడు (అప్పుడే హడావుడిగా ఆస్పత్రి కాంటీన్‌నుంచి పరిగెత్తుకుని వచ్చాడు); పాత డాక్టరు, పేషంటు చరిత్ర తెలిసినవాడు కాబట్టి డా. బర్క్‌లీ; ఆస్పత్రిమత్తుమందు డిపార్ట్‌మెంట్ హెడ్ మారియన్ టి. జెన్కిన్స్.

డా. పెర్రీ గాయంకింద ఒక చిన్న ద్వారం తెరిచాడు. ఇది ఊపిరితియ్యటానికి చేసిన ద్వారం. ఈ ఆపరేషన్ చెయ్యటానికి అయిదునిముషాలు పట్టింది. ఇంతలో నోటిలోని గొట్టానికి 'ఊపిరితీసే యంత్రం' ఒకటి తగిలించారు. ఆ సమయానికి జాక్వెలీన్ కెన్నెడీ గదిలోకి రావటానికి నిశ్చయించుకున్నది. బయట హాలులో పది నిముషాలు కాచుకుని కూర్చున్న ఆమె ఇక ఆగలేకపోయింది. డోరిస్ నెల్సన్ అనే నర్సు ఆమెచేతి గ్లవ్స్ తీసివెయ్యటానికి ప్రయత్నించింది; ఒక ఆర్డర్లీ ఆమెని పక్కనేఉన్న చిన్న గదిలో విశ్రాంతి తీసుకొనమని చెప్పిపోయాడు. అప్పుడప్పుడే శ్రీమతి కెన్నెడీకి తనకి జరిగిన ఘోరప్రమాదం ఎటువంటిదో అర్థం కాసాగింది. అక్కడినుంచి కదలరాదని ఆమె నిశ్చయించుకున్నది.

ఆస్పత్రి 'స్టాఫ్'కి ఆమె పట్టుదల గురించి తెలియదు. ఆమె గురించి విన్నారు. రాబర్టు కెన్నెడీ వలెనే ఆమె కూడా అందరూ అనుకున్నటువంటి వ్యక్తి కాదు. ఆమె కీర్తి ఒక రకం, ఆమె స్వభావం మరొకరకం, అతను చాలా నెమ్మది మనిషి— గట్టిగా కనిపిస్తాడు. ఈమె అందరూ అనుకున్నంత మెతక కాదు. ఎంతో పట్టుదల కలది. ఇద్దరూ జాన్ ఎఫ్. కెన్నెడీ అప్తులు కాబట్టి అతని నీడలో కలిసిపోయారు. ఆ నీడలో వారి వ్యక్తిత్వం సరిగ్గా కనిపించేది కాదు. ఇప్పుడు ఏర్పడిన శూన్యంలో వారి

నిజస్వభావాలలోని బలం బయటపడుతుంది. జాక్వెలీన్ కెన్నెడీ నిర్ణయం క్రమంగా గట్టిపడింది. మొదటి అయిదునిముషాలూ పరిస్థితిని పరిశీలిస్తూ ఉండింది. ఇందరు డాక్టర్లు ఎందుకు లోపలికి పరిగెత్తుతున్నారో ఆమెకి అర్థంకాలేదు. తన భర్త చనిపోయి ఉంటాడని ఆమె అనుకున్నది. తర్వాత 'దేహంలోని ద్రావకాల'ని గురించి ప్రసక్తిరాగా విన్నది. ఎందరో డాక్టర్లు మామూలు మనుష్యులు డాక్టర్ల పరిభాష విని హడిలి పోతారనుకుంటారు. ఇది కొంత దాకా నిజమే కాని శ్రీమతి కెన్నెడీ భర్త వివాహం అయినప్పటి నుంచీ అనారోగ్యంగా ఉన్నవాడే. ఆస్పత్రులూ, వెయిటింగ్ గదులూ బాగా అలవాటే. 'సెలయిన్ సొల్యూషన్' 'రిసస్కిటేషన్' అనే మాటలు వినగానే ఆమె మనస్సులో పెద్ద కల్లోలం చెలరేగింది. 'బ్రతికే ఉన్నాడు!', అనుకుంది ఆశ్చర్యంతో. ఆమెకి అర్థంకాలేదు. తన భర్త మరణించాడని ఆమె నమ్మింది. 'అతను బతికే అవకాశం ఏదయినా ఉందా? భగవంతుడా బతికితే నా జీవితం అంతా అతని కోసం ఏదయినా చేస్తాను...' అనుకున్నది జాకీ కొన్ని అడుగుల దూరంలో ఉన్న లారీ కెన్‌ల వంక చూస్తింది — 'అయితే మీరు...' అన్నది నెమ్మదిగా.

వారేమీ చెప్పలేదు. చెప్పటానికి ఏదీ లేదు. 'లోపలికి వెడుతున్నాను,' అన్నది ఆమె. డోరిస్ నెల్సన్‌కి ఈ మాటలు వినిపించాయి. ఆమె నర్సు. నర్సులుకి నూరిపోసే సిద్ధాంతాలలో ఒకటి— పేషంట్ల బంధువులని ఎప్పుడూ వారికి దూరంగా ఉంచాలి. అంతేకాక, శ్రీమతి కెన్నెడీకి నిరాధారమయిన ఆశ కలిగించరాదని ఆమె అభిప్రాయం. 'లోపలికి రావటానికి వీలులేదు అన్నది గట్టిగా. జాకీ చెక్కుచెదరలేదు 'వెడుతున్నాను, అక్కడే ఉండబోతున్నాను,' అన్నది. బలవంతంగా లోపలికి తోసుకువెళ్ళిపోయింది. డోరిస్ ఆమెకన్నా బలవంతురాలు. అడ్డుతగిలింది, జాక్వెలీన్ కెన్నెడీకి ఈ రకం అవరోధం కొత్తకాదు. ఆపరేషన్ జరిగిన తనభర్త ఒకసారి తనకోసం కేకలు వెయ్యగా విన్నది. (అప్పుడు కెన్నెడీకి వీపు ఆపరేషన్ జరిగింది) లోపలికి వెళ్ళటానికి ప్రయత్నించింది. డాక్టర్లు వదలలేదు. తర్వాత, స్పెషలిస్టు ఒకతని ట్రీట్‌మెంట్ పని చెయ్యనప్పుడు మరొక నిపుణుడిని పిలుచుకు వద్దామనుకుని అక్కడివారు వారించగా ఆ ప్రయత్నం మానుకున్నది. అధ్యక్షుడు కొన్ని నెలలు వీపునొప్పితో బాధపడ్డాడు.

అంతదాకా ఆమె వైద్యుల సలహాని పాటించింది. కాని, పరిస్థితులు మారాయి. మునుపటిలాగ వదిలి లాభంలేదు, తను తన భర్త పక్కనే ఉండాలి అనుకున్నది. ఇక ఏ డాక్టరు, నర్సు బెదిరింపులకీ లొంగటం పనికిరాదు, అని అనుకున్నది. డోరిస్ నెల్సన్‌తో పెనుగులాడుతూ, 'నేను ఆ గది లోకివెళ్ళి తీరుతాను' అన్నది.

డా. బర్క్లీ ఈ సందడివిని అక్కడికి వచ్చాడు. 'మిసెస్ కెన్నెడీ మీరు మత్తుమందేదయినా పుచ్చుకుంటే మంచిది,'

(10 వ పేజీ చూడండి)



కెన్నెడీకి రెండవ ప్రపంచయుద్ధంలో తగిలిన గాయానికి 1954 లో వెన్ను ఆపరేషన్ చేయాల్సి వచ్చినప్పుడు హాస్పిటల్‌లో అతనిప్రక్కనే కనిపెట్టుకునిఉన్న శ్రీమతి జాక్విలిన్ కెన్నడీ.










మిస్టర్ బిగ్ దగ్గిర 'అప్పు' తీసుకున్న కారుని న్యూయార్క్ వీధుల వెంబడి వేగంగా తోలుకుంటూ వెళ్లిపోయాను.

'ఫెలిక్స్ ఇక్కడ నువ్వుండటం మంచిదయింది. ఏమయింది?'

'తలమీద బాదారు. ఫరవాలేదు. నీ సంగతేమిటి?

'వేలొకటి విరిగింది. ఒకమ్మాయిని కలిశాను.'










మిస్టర్ బిగ్ వెంట వెళ్లటానికి బయలుదేరాను. జడుసుకున్న అమ్మాయి ఒకామెకి టెలిఫోన్ చేసే అవకాశం చిక్కింది.

'మిస్టర్ బిగ్ బారినుంచి ఎలాగయినా తప్పించుకోవాలి. నన్ను తీసికెళ్లి పో. అతని రహస్యాలు చాలా తెలుసు నాకు. కాని తొందరగా రావాలి!'

'సొలిటెయిర్ విను! ఇది మోసమయితే నిన్ను ఎలాగో అలా చంపేసే తీరుతాను.'

'నన్ను నమ్ము! నమ్మి తీరాలి!'










'పెన్సిల్వేనియా స్టేషన్ తొందరగా!' దక్షిణం వయిపు సొలిటెయిర్‌ని తీసుకు వెళ్లటానికి ఒప్పుకున్నాను.

'కంపార్ట్‌మెంట్ హెచ్ రిసర్వ్ చేసుకున్నాను. నాతో ఒకావిడ వస్తుంది.'

'ఆవిడప్పుడే వచ్చేశారు!'

'వాళ్లు కార్ 245 లో ఉన్నారని మిస్టర్ బిగ్‌కి చెప్పు.'

కాని మమ్మల్ని కనిపెట్టేశారు.




'నన్ను నమ్మినందుకు చాలా థాంక్స్.'

'నాకూ సంతోషంగానే వుంది. నా ప్రాణం కాపాడావుకదా, మిస్టర్ బిగ్ నన్ను పట్టుకున్నప్పుడు నీకు నిజంగా దివ్యదృష్టి ఉన్నట్లయితే...!'

'అవును, ఉంది. కనీసం అటువంటిదేదో ఉన్న దాన్ని మరికాస్త అల్లి చెప్పాను, నా తమాషా ప్రదర్శన కోసం—అప్పుడే మిస్టర్ బిగ్ నన్ను చూసి తన ఉద్యోగంలోకి తీసుకున్నాడు గడుసుగా—'

'నువ్విలా పారిపోవటం అతని కిష్టం ఉండదు—ఏమాత్రం!'




'పక్కలు వెయ్యాలి సార్! ఇవి మీవి—'

'ఏమిటివి!'

'ఇదంతా నే చెప్పకూడదు కాని, మీ తలుపు కివి అడ్డంగా పెట్టండి—మీకు కష్టం కలిగించా లనుకునేవారు చాలామంది ఉన్నారీ రయిల్లో—'




దక్షిణం వెడుతున్న ఆ రయిల్లో నేనూ సాలి టెయిర్ వెళ్ళిపోతున్నాము.

'నువ్వు అందగత్తెవి. మనం ఒంటరిగా ఉన్నాము.'

'కాని, కొన్ని విషయాలు వాయిదా వెయ్యాలి సిందే! ఎవరికీ తెలీకుండా ఈ రయిలు బండి వది లెయ్యాలి—

(ఇంకా ఉంది)

*

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా [illegible]" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి. సం||

# అధ్యక్షుని మరణం

(7-వ పేజీ తరువాయి)

అన్నాడు.

'అతను పోయేప్పుడు నేను లోపల ఉండాలి!' అన్నది ఆమె.

డా. బర్క్లీకి ఆమె పరిస్థితి అర్థం అయింది. సరేనన్నట్లు తల ఆడించి, నర్సుతో, 'అది ఆమె హక్కు! ఆమె హక్కు!' అన్నాడు. నర్సు అతనిమాట కాదనకలేకపోయింది. అయిష్టంగా పక్కకి తప్పుకుంది. నిజానికి ఆమెకి బర్క్లీ డాక్టరు అని తెలియదు. అతనూ సీక్రెట్ సర్వీస్ ఏజెంటు అను కున్నది.

1 గంటకి పర్క్లన్ కెంప్ క్లార్క్ బరువుగా అన్నాడు, 'ఇక లాభంలేదు మాక్!' అని. షెర్రీ చేతులు అపజయంతో ముడుచు కున్నాయి. వాటిని నెమ్మదిగా వాలిపోయిన కెన్నెడీ వక్షస్థలం మీదనుంచి ఎత్తి, గుడ్డిగా గదిలోనుంచి బయటికి నడిచివెళ్ళిపోయాడు. వెళ్ళి ఒక కుర్చీలో ఎక్కడో కూలబడ్డాడు. పరధ్యాన్నంగా ఎటో చూస్తూ చిటికిన వేలి గోరు కొరుక్కుంటూ కూర్చున్నాడు. ఆస్పత్రి శవం బండి దగ్గరే నుంచుని ఉన్న ఒక డాక్టరు అధ్యక్షుడి ముఖంమీద దుప్పటి కప్పాడు. క్లార్క్ జాక్వెలీన్ కెన్నెడీ వయిపు తిరిగి, 'మీ భర్తగారి గాయం మరణ కారణం అయింది,' అన్నాడు. ఆవిడ పెదిమలు 'నాకు తెలుసు' అన్నట్లు కదిలాయి కాని మాట పెగల్లేదు.

*  *  *

జస్టిస్ డిపార్ట్‌మెంట్ కట్టడంలో అయిదవ అంతస్తు. వాషింగ్టన్‌లోని పెన్సిల్వేనియా, నయిన్త్ స్ట్రీట్‌లు కలిసే చోట ఉంది. జె. ఎడ్గార్ హూవర్ ఎటార్నీ జనరల్ ఆఫీసుకి ఫోన్ చేశాడు. అవతల వయిపు ఆంజీనోవెల్లో రిసీవర్ ఎత్తాడు. అతని ఎదురుగా కన్నీరు కారుతున్న ఒక పత్రికా కార్యదర్శి, నలిగి, చిరిగిపోయిన యు. పి. అయి. వార్తా పత్రం ఒకటి అతనికి కనిపించేట్లు ఎత్తిపట్టుకుని ఉంది.

'నేను జె. ఎడ్గార్ హూవర్‌ని' అన్నాడు ఎప్పటిలాగే త్వరత్వరగా, కొంచెం కీచుగా యాంత్రికంగా. 'మీరు వార్త విన్నారా?'

'విన్నాను మిస్టర్ హూవర్! కాని ఆయనకి నేను చెప్పను.'

'అధ్యక్షుడిని కాల్చి చంపారు. అతన్ని పిలుస్తాను.'

ఒక వైట్‌హౌస్ ఆపరేటర్ అతనికి ఎక్స్‌టెన్షన్ 163 ఇచ్చింది. ఈ ఫోను వర్జీనియా రకం బంగళా వెనక ఈత కొలను దగ్గర ఉంది. దాని గంట విని ఎథెల్ కెన్నెడీ మగవారిని వదిలి వచ్చింది. ఆపరేటర్ ఆమెతో, 'డయిరెక్టర్ పిలుస్తున్నారు!' అన్నది. ఏ డయిరెక్టరో ఎథెల్ అడగనవసరంలేదు. వాషింగ్టన్ అధికారవర్గాలలో ఎందరో ఉన్నారు కాని ఒకడే డయిరెక్టర్. 'ఎటార్నీ జనరల్ భోజనం చేస్తున్నారు,' అన్నది.

కొలను అవతలవయిపు ఆమె భర్త అప్పుడే చేతిగడియారం చూసుకున్నాడు. 1.45 అయింది. (డల్లాస్‌లో 12.45. అమెరికా చాలా పెద్ద దేశం కాబట్టి వివిధ ప్రాంతాలలో వివిధ కాలాలు ఉంటాయి.) చేపముక్క ఉన్న ఒక శాండ్విచ్ ఒకటి తిని అతిథితో, 'త్వరగా తినటం ముగించి ఈతకెళితే మంచిది,' అన్నాడు.

'ఇది చాలా అర్జెంటు,' అన్నది ఆపరేటర్ ఎథెల్‌తో. ఎథెల్, 'జె. ఎడ్గార్ హూవర్ పిలుస్తున్నారు.' అని కేకవేసింది. రాబర్ట్ కెన్నెడీ ఏదో విపరీతం జరిగి ఉంటుందని పసికట్టాడు. 'డయిరెక్టర్' ఎప్పుడూ తనని ఇంటికి పిలవడు. ఫోన్ వయిపు నడిచివెళ్ళాడు. అతను రిసీవర్ తీసుకుంటూ ఉండగా ఇంటి మూల ఏదో పనిచేస్తూ ట్రాన్సిస్టర్ వింటూ ఉన్న ఒకతను పిచ్చిగా మాటాడుతూ అతని వయిపు పరిగెత్తాడు.

ఎటార్నీ జనరల్ తను మాటాడుతున్నట్లు చెప్పాడు. 'మీకు వార్త చెప్పాలి,' అన్నాడు హూవర్ నిర్వికారంగా. 'అధ్యక్షులు తుపాకి దెబ్బకి గురి అయ్యారు.'

'సీరియస్‌గానా,' అని అడిగాడు కెన్నెడీ.

'సీరియస్ అనుకుంటాను. వివరాలకోసం ప్రయత్నిస్తున్నాను,' అన్నాడు హూవర్. 'ఇంకా తెలియగానే పిలుస్తాను,' డయిరెక్టర్ ఫోను పెట్టేశాడు. అటార్నీ జనరల్ కూడా ఫోను పెట్టేశాడు. తన భార్య, ఇదేమిటో అర్థంకాని ఇద్దరి అతిథుల వయిపుగా నడిచాడు. అప్పుడే వారు పరిగెత్తుకుని వచ్చిన కార్మికుడి 'పిచ్చిమాట' ఆ వెనుక ఏదో అర్థం ఉందని గ్రహించారు. కెన్నెడీ మధ్యలోనే ఆగిపోయాడు. అప్పటికిగాని ఆతనిక్ష

తను విన్న వార్త అర్థం తెలియలేదు. దవడ జారిపోయింది. 'జాన్‌ని కాల్చేశారు!' అన్నాడు. మాట సరిగ్గా రాలేదు. ముఖాన్ని చేతో కప్పుకున్నాడు.

అధ్యక్షుడివలెనే బాబ్ కెన్నెడీ కూడా బహిరంగ భావావేశ ప్రదర్శనలంటే ఇష్టపడే మనిషి కాదు. ఆ తర్వాత అక్కడ చేరుకున్న అతని స్నేహితులెవరూ అతను లొంగిపోవటం చూడలేదు. ఎప్పుడయినా ఎటో తిరిగి స్నానాలగది, టెన్నిస్‌కోర్ట్, వంకర వంకరగా కనిపించే చెట్లు, వనగృహం— వీటిని చూసేవాడు. అవి అతని వంక కళ్ళతో తిరిగి చూడలేవు. ముందు గాయపడిన తన అన్న దగ్గరికి వెళ్ళిపోదామనుకున్నాడు. వెంటనే వాహనం ఏర్పాటు చెయ్యమని రాబర్ట్ మెక్నమారాతో చెప్పి బట్టలు మార్చుకొనటానికి పయికి పరిగెత్తాడు.

కారోలిన్ కెన్నెడీ లిజ్ పోసెన్ కారు జట్టులో ఉంది. లిజ్ కూతురు అగాతాతో అర్ధరాత్రి వాళ్ళింట్లో గడపబోతున్నది. ఇల్లు వదిలి ఉండటం కారోలిన్‌కి అదే మొదటి సారి. లిజ్ రేడియో పెట్టింది. వార్తలు వచ్చాయి. '...తలకి తుపాకిదెబ్బ, భార్య జాకీ...' అనే మాటలు వినిపించాయి. ఆమె వెంటనే రేడియో మూసివేసింది. చిన్నపిల్లలకి ఇవి వినపడలేదని ఆమె అనుకున్నది.

కారోలిన్‌కి ఏదో వినిపించింది. ఏదో జరిగిందని ఆమెకి చూచాయగా అనిపించింది. ఇది తర్వాత ఆ చిన్నపిల్ల సీక్రెట్ సర్వీస్ ఏజెంట్లతో అన్న మాటలనిబట్టి తెలుస్తుంది. అసలు మొట్టమొదటి వార్తాప్రసారాలన్నీ అర్థం అయీ అవనట్లే ఉన్నాయి.

లిజ్ పోసెన్ కారు వెనుక వెల్స్ తన ఫోర్డ్ కారులో వస్తున్నాడు. అతను కూడా అస్పష్టంగా ఉన్న వార్త ఒకటి విన్నాడు. ముందు స్టేషన్ వాగన్‌వంక పరీక్షగా చూశాడు. చిన్నపిల్లలు సీటుయెత్తు వెనుక మునిగిపోయి కనిపించటంలేదు. లిజ్ పోసెన్ పొట్టిమనిషి. సరిగ్గా కనిపించటంలేదు. ఆ కారు తనంతట తానే వెళ్ళిపోతున్నదా, అన్నట్లున్నది...

లిజ్ ధ్యాస ఎక్కడో ఉన్నది. మళ్ళీ రేడియో వెయ్యటం అసంభవం. అటు వెళ్ళే కారువారెవరయినా వార్తలు విన్ని,

కారొలిన్‌ని చూసి గుర్తుపట్టి తొందరపడి ఏదో అనవచ్చు

వెనుక వెల్స్ కారులో వార్తలు విని పిస్తూనే ఉన్నాయి. అధ్యక్షుడు కెన్నెడీకే దెబ్బతగిలిందని అనుకుంటున్నారని చదివే అతను అన్నాడు. ఏదీ స్పష్టంగా తెలియటం లేదని అనుకుంటున్నారుట...

లిజ్‌కి తను ఆగి వెడదామని తట్ట లేదు. వెల్స్‌కి ఆమెని ఎలా ఆపాలో తెలియక వెన్నాడుతూనే ఉన్నాడు. ఇంతలో ట్రాఫిక్ లైట్లు మారాయి. కార్ల వరుస ఆగిపోయింది. ఇద్దరూ బ్రేకులువేసి హడావుడిగా బయటికి దిగారు.

'ప్రసారం విన్నారా?' అని అడిగాడు.

ఆమె తల ఊపింది.

'రేడియో మూసివెయ్యండి!'

'ఆ పని ఎప్పుడో చేశాను!' ఆమె అతని వంక పరీక్షగా చూసి, 'ఏం చేద్దాము?'

'ఇది ఎంత సీరియస్ వ్యవహారమో ఎవరికీ తెలియటంలేదు వెడుతూనే ఉండాలి...'

ట్రాఫిక్ సిగ్నల్లు మారాయి. ఇద్దరూ ప్రయాణం కొనసాగించారు. వెల్స్ తన సాంకేతిక భాష ఉపయోగించి రేడియోలో మాట్లాడాడు. 'క్రవున్, క్రవున్! డషర్ మాట్లాడుతున్నాను డల్లాస్‌లోని పరిస్థితి దృష్ట్యా 'లిరిక్' విషయమయి ఏమి చెయ్యాలో చెప్పాలి. అంతే!'

'క్రవున్' వెంటనే సమాధానం ఇవ్వలేదు. తర్వాత, 'ఉండు చెప్తాను!' అన్నాడు.

యు. పి. ఐ. వార్తాసంస్థ వార్తని అతివేగంగా ప్రసారించటం చేత లిజ్ పోసెన్, టామ్‌వెల్స్‌కి తమపయి అధికారులకన్నా ముందే అధిక సమాచారం తెలిసింది. వైట్ హౌస్‌లోని జెర్రీబెహ్న్ రాయ్‌కెల్లర్‌మాన్‌తో మాట్లాడుతున్నాడు. ఇప్పుడు వీరిద్దరూ ఏమిచెయ్యాలి? ఆజ్ఞ ఏదీ రాలేదు కాబట్టి తమ ప్రయాణాన్ని కొనసాగించటమే మంచిదని అనుకున్నారు. కాని, వెల్స్ ఒక నిర్ణయానికి వస్తున్నాడు, క్రమంగా. ఇదంతా ఒక పెద్ద కుట్ర అయితే కారొలిన్ పోసెన్‌ల ఇంటికి వెళ్ళక పోవటమే మంచిది. అందుచేత తన పయి అధికారికి మళ్ళీ ఫోన్‌చేశాడు. 'డ్రెస్సర్— నేను డషర్‌ని. ప్రమాదం పెరిగిందని పిస్తోంది. ఇదంతా ఒక పెద్ద పన్నాగమో, కేవలం ఒక సంఘటన మాత్రమేనో తెలి

# అధ్యక్షుని మరణం

యటం లేదు. ఇదంతా వాషింగ్టన్‌లో అధికార పతనం కుట్రలో భాగమయితే లిరిక్‌ని సురక్షితంగా ఉంచే ప్రయత్నం మీద స్థలం మార్చారి, ఎవరయినా ఎత్తుకుపోగలరేమో... మీరు వద్దంటే తప్ప లిరిక్‌ని తిరిగి క్రవున్ వద్దకి తీసుకుపోతాను!'

ఇది తేలికగా తీసుకున్న నిర్ణయంకాదు దానిని చూసి ఎందరో హర్షించక పోవచ్చు కాని వైట్‌హౌస్‌లోని ఏజెంటు జాన్ ఫాస్టర్‌కి అది నచ్చింది. 'కుటుంబాన్నంతా చంపేద్దామని చూస్తున్నారేమో,' అని పిల్లల నర్సు మాడ్‌షాకి దీని సంగతి చెప్పాడు ఆమె దానిని నమ్మలేదు.

లిజ్‌పోసెన్ అందరికన్నా ఎక్కువ పేచీ పెడుతుందేమోనని భయపడ్డాడు వెల్స్ అతని భయం నిజమయింది. 'కారొలిన్‌ని ఎందుకు తీసుకుపోతున్నా'రని అడిగింది ఆమె. 'రక్షణకోసం' అన్నాడు అతను. 'ట్రాఫిక్ తగ్గింది కదా, ఇక ఫరవాలేదు,' అన్నది లిజ్. అనవసరంగా కారొలిన్‌ని కంగారుపెట్టడం ఆమెకి ఇష్టంలేదు.

'నేనేం చెయ్యను, ఆర్డర్స్ అలా ఉన్నాయి!' అని వెల్స్ ఆమె కారు కిటికీ ద్వారా తల లోపలికి పెట్టి, 'కారొలిన్, ఇంటికి వెళ్ళిపోవటం మంచిది. నీ సంచీ కూడా తెచ్చుకో. వీలుంటే మళ్ళీ తిరిగి వచ్చేద్దాము,' అన్నాడు, కెన్నెడీ చిన్నకూతురితో. అతను కొంచెం విసురుగామాట్లాడా డనుకున్నది లిజ్. కారొలిన్ వెనక్కితగ్గి, 'నాకు రావాలనిలేదు,' అన్నది.

'ఏం చేస్తాము? వెళ్ళితీరాలిసిందే. మిస్ షా కూడా నాకు చెపుతుంది,' అంటూ వెల్స్ సూట్‌కేసు తీసుకున్నాడు.

'ఏమిటో నాకూ తెలుసు,' అన్నది కారొలిన్. తన ఎలుగుబంటి బొమ్మని అక్కున చేర్చుకుంటూ, వచ్చే కన్నీరు ఆపుకుని కారొలిన్ అతనివెంట వచ్చింది. లిజ్ ఆపిల్లని ముద్దుపెట్టుకుని పంపింది. వెల్స్ కారొలిన్‌ని తన పక్కనే ముందు సీటులో కూర్చోపెట్టుకున్నాడు. రెండు ఫర్లాంగులు దాటినతర్వాత కారొలిన్, 'ఇంటికెందుకెళ్ళిపోతున్నాము?' అని అడిగింది. వెల్స్ జవాబు చెప్పేముందే, 'ఫరవాలేదు, నాకూ తెలుసులే!' అన్నది.

'అమ్మ రాత్రికే ఇంటికివస్తే రావచ్చు. మమ్మా, జాన్ ఇంటిదగ్గరే ఉంటే మంచిదన్నది,' అన్నాడు వెల్స్. కారొలిన్ మాట్లాడలేదు.

ఇంతలో లిజ్‌పోసెన్ ఎదురుచూసిన ప్రమాదం రానేవచ్చింది. అటు వెడుతున్న మరొక కారుడ్రయివరు కారొలిన్‌ని గుర్తుపట్టాడు. అది ఒక లేత ఆకుపచ్చరంగు కారు. అతను సుమారు ఏభయి ఏళ్ళ వయసు కలవాడిలా కనిపించాడు కారొలిన్‌ని చూసి ముందు అదిరిపడ్డట్లు కనిపించాడు. తర్వాత వెల్స్‌ని వెంటాడ ప్రారంభించాడు. వెల్స్ అతన్ని తప్పించుకొనటానికి ప్రయత్నించాడు. వెన్నాడుతున్న వ్యక్తి తను ఎటువంటి ప్రమాదంలో ఉన్నాడో గుర్తించలేదు! టామ్‌వెల్స్ మంచి తుపాకిగురి ఉన్నవాడు. చాలా చిరాకుగా ఉన్నాడు. అయితే, అతన్ని తరిమే అనామకుడు కూడా పాపం తన కర్తవ్యం నెరవేరుద్దామనే అనుకున్నాడు. అంతకిముందే అధ్యక్షుడిని కాల్చారనే వార్తలు వెలువడ్డాయి. ఇప్పుడేమో అతని ఆరేళ్ల చిన్న కూతురు ప్రభుత్వం కారు అని తెలిపే గుర్తులు ఏవీలేని ఒక బండిలో ఎవరితోనో ఒంటరిగా వెడుతోంది! మంచి ధైర్యం కలవాడు కాబట్టి వదల్లేదు. వెల్స్ చిరాకు మరింత అధికం అయింది. తనకి ఈ గుర్తులు తెలుపని కారు ఎందుకు ఇచ్చారా అని తిట్టుకున్నాడు. పోనీ, గుర్తులు లేక పోయినా ఒక పిడి లాగితే 'పోలీస్' అనే అక్షరాలు వెలిగే రకం బండి కూడా ఇవ్వలేదే తనకి! ఇప్పుడు అనవసరపు గొడవ, తప్పించుకోవాలంటే పలాయనమే శరణ్యం! వేగం హెచ్చించాడు. ఎలాగయితేనేమి తనని వెన్నాడే వ్యక్తిని తప్పించుకున్నాడు. వాషింగ్టన్‌లో 2:13 అయ్యేసరికి (అంటే కాల్పులు జరిగిన 46నిముషాల తర్వాత) టామ్‌వెల్స్ కారొలిన్‌ని వైట్‌హౌస్ ఆవరణలోకి చేర్చాడు.

* * *

డల్లాస్: ఆ ఉదయం పడిన ప్రకటనలో సంతకం పెట్టినారిలో డేవిడ్ బెయిన్‌మాన్ ఒకడు. అతను 'సేల్స్‌మన్' ఉద్యోగం చేస్తున్నాడు. వామపక్షవాది. కారులో వెడుతూ వార్త విన్నాడు. తన మీద ఏమి ఆరోపణ వస్తుందో అని ఒక 'బార్'లోకి

వెళ్ళి అక్కడ నాలుగు గంటలు ఉండి పోయాడు. 'హంతకుడు వాకర్ వర్గంవాడు కాదని కోరుకుంటున్నాను — వాకర్ శిష్యుల్లో ఒకడు కాదుకదా!' అన్నాడుట.

*    *    *

ఇర్వింగ్ (టెక్సాస్): టెలివిషన్ చూస్తున్న రూత్ పెయిన్, మరీనా అస్వాల్డ్ లకి వార్త తెలిసింది. రూత్, మరీనాకి ఇంగ్లీషువార్త వివరాలు అనువాదం చేసి చెప్పింది. తర్వాత ఒక కొవ్వువత్తి వెలిగించింది. 'అదొక రకం ప్రార్థనా?' అని అడిగింది మరీనా.

'అవును, నా ప్రార్థన ఇంతే,' అన్నది రూత్.

మరీనా దొడ్లో బట్టలు ఆరెయ్యటానికి వెళ్ళింది. ఇంతలో వార్తా ప్రసారంలో తుపాకి పేలుడులు 'టెక్సాస్ బుక్ డిపాసిటరీ' నయిపునుంచి వచ్చాయని చెప్పారు. రూత్ దొడ్లోకివెళ్ళి మరీనాతో ఈసంగతి చెప్పింది. మరీనా మాట్లాడకుండావెళ్ళి బొట్టు షెడ్డులో కంబళీచుట్ట ఉందా లేదా అని చూసింది. అది అక్కడే ఉందికాని లోపల తుపాకిలేదని ఆమెకి తెలియదు. 'తాంక్‌గాడ్!' అనుకున్నది.

*    *    *

పార్క్‌లాండ్ ఆస్పత్రి: ఒక ఫాదరీ రాకటంతో ఇంచుమించు అందరికీ అంతా తెలిసిపోయింది. మరణం వారికి సన్నిహితం అయింది...

'పోయినట్టు కనిపిస్తోంది,' అన్నాడు మెక్ కిల్టఫ్ అల్బర్ట్ థామస్‌తో రహస్యంగా.

ఫాదరీని గమనించనిది మెక్‌హ్యూ ఒకడే పక్కనుంచే నడిచివెళ్ళినా అతన్ని చూడలేదు. అలిసిపోయిన ఆ డాక్టరు తన ముందు గోడవయిపు అలా చూస్తూ నిలబడి ఉన్నాడు.

'వెరీ రెవరెండ్' ఆస్కార్ హూబర్ (ఫాదరీ) నేరుగా జాక్వెలిన్ కెన్నెడీ దగ్గరికి వెళ్ళాడు. సానుభూతి మాటలు పలికాడు. కష్టంతో ఊపిరి తీస్తున్నాడు. ఆమె పక్కనే నుంచున్నాడు. హటాత్తుగా మరణించినవారి అంత్యక్రియలు కొంచెం 'తగ్గించి' చెయ్యడం అతని అలవాటు, ఇక్కడా అదే పద్ధతి అనుసరించాడు. ఒక సారి కూడా పుస్తకం తియ్యలేదు. ఈ విసురు పద్ధతి డా. బర్క్‌లీకి నచ్చలేదు, అంతకి ముందు ఎప్పుడూ అడగని ప్రశ్న అడిగాడు—'అంతేనా?' నర్సులు కూడా ఇంత అశ్రద్ధ చూపరనిపించింది. డా. బర్క్‌లీకి.

అధ్యక్షుడు ఒకడు మరణిస్తే ఇంత తేలికగా అంతా జరిపించడం భావ్యంగా తోచ లేదు బర్క్‌లీకి. 'చనిపోయిన వారి తరఫున ప్రార్థించటం అంటూ లేదా?' అని అడిగాడు. ఫాదర్ హ్యూబర్ అవసరంగా కొన్ని ప్రార్థనలు ఇంగ్లీషులో చదివాడు. సాధారణంగా అయితే ఇవి మోకరిల్లి చదివేవాడు, కాని, అక్కడ నేలంతా రక్తం! అంతకి ముందే జాక్వెలిన్ కెన్నెడీ అక్కడ మోకరిల్లిందని అతనికి తెలియదు. తలవంచి, చేతులు కట్టుకుని 'లార్డ్స్ ప్రేయర్' చదవటం ప్రారంభించాడు. విధవ అయిపోయిన అధ్యక్షుని సతీమణి, డాక్టరు — వారిద్దరే తక్కిన వారిలో కాథలిక్కులు. ఫాదరీ మొదటి సగం చదవగానే రెండవ సగం పూర్తి చేశారు. నర్సులు మౌనంగా తలలు వంచారు...

సీక్రెట్ సర్విస్ ఏజెంట్లు రూఫస్ యంగ్‌బ్లడ్, ఎమరీ రాబర్ట్స్‌లు పెద్ద కుట్రని అనుమానించి పార్క్‌లాండ్ ఆస్పత్రిలోని ప్రతిగదిలోనూ ప్రమాదం ఉందని భయపడటం మొదలు పెట్టారు. ఉపాధ్యక్షుడూ, అతని సతీమణి—వీరిద్దరికీ సురక్షితంగా, ఏకాంతంగాఉండే గది ఒకటి కావాలన్నారు. ఒక నర్సు వారిని 'మైనర్ మెడిసిన్' గదిలోకి తీసుకువెళ్ళింది. శ్రీమతి జాన్సన్‌కి చాలా భయంగాఉంది. ఇంతదాకా తన భర్తకి పెద్ద రక్షణ ఏర్పాట్లు చెయ్యవసరం లేకపోయింది. ఇప్పుడు పరిస్థితి హటాత్తుగా మారిపోయింది. అంతా ఆందోళనకరంగా ఉంది. వారు ఆస్పత్రిలో ఎక్కడెక్కడికో వెళ్ళిపోతున్నారు. ఒక వ్యూహంతో నడిచినట్లుంది. అక్కడనుంచి బయటపడాలన్నా కష్టమే! యంగ్‌బ్లడ్ తన రక్షణ ఏర్పాట్లకోసం కొన్ని కొండ గుర్తులని కూడా తీసివేయించేస్తున్నాడు. ఒక నీగ్రో పురుషుడు పడుకుని ఉన్నాడు. 'అతన్ని ఇక్కడినుంచి మరొకచోటికి మార్చండి!' అన్నాడు. 'కిటికీ రెక్కలు అన్నిటినీ మూసివెయ్యండి!'

ఒకవార్డు దాటారు. ఆస్పత్రి నడిగర్భంలోకి వచ్చామనుకున్నారు జాన్సన్ దంపతులు. కాని, వారికి తెలియకుండానే ఆస్పత్రి బయటివయిపు నడుస్తున్నారు. కిటికీలు అన్నీ మూయించి వెయ్యటంవల్ల బయటి దృశ్యాలు కనిపించక దారి తెలియటంలేదు వారికి...

'మైనర్ మెడిసిన్' గది నెం 13 ఖాళీగాఉంది. దానికి కారణం ఏదయినా యంగ్‌బ్లడ్ దృష్టిలోఉన్న సురక్షితమయిన గదిమాత్రం కాదు. హంతకుడు తేలికగా లోపలికివచ్చి — అధ్యక్షుడి కారు ఊరేగింపు వారితోవచ్చి ఉండవచ్చు. ఉపాధ్యక్షుడిని కాల్చివేసి ఉండవచ్చు. ఆ అంతస్తులో మైనర్ మెడిసిన్ గదులు నెం. 12, 13 మాత్రమే కిటికీ రెక్కలు వేసిఉన్నాయి. కొంచెం ఊహాశక్తి ఉపయోగించి లోపల ఎవరో ప్రముఖులు ఉన్నారని గ్రహించి జాన్ కెన్నెడీ వారసుడిని సునాయాసంగా తుపాకికి బలిచేసి ఉండగలిగేవాడు.

(ఇంకా వుంది)






**ఆర్. సీతాబ్రహ్మాం, బాపట్ల**

మగవారికొరకు ప్రత్యేకంగా లేవుగాని మరి స్త్రీలకు ఈ వనితావాణి లాంటి ప్రత్యేక శీర్షికలు, ప్రత్యేక పత్రికలు ఎందుకండీ?

స్త్రీలకు ప్రత్యేకం అన్నప్పుడే మీ పురుషులు ఎక్కువ ఆసక్తితో చదువుతారని మా ఉద్దేశ్యం. ఇదే దానిలోని చిదంబర రహస్యం. !

**కె. అరుణజ్యోతి, విజయనగరం**

వివాహం పెళ్ళి అయినదా అని అడుగుతారు. వారికొందరు పిల్లలు ఎంతమంది అని అడుగుతున్నారు అసలు నాకు పెళ్ళే చేసుకోవాలని లేదు...

ఆ సంగతి వాళ్ళకెలా తెలుస్తుంది చెప్పండి? ఇష్టమైనంతసేపు అడిగినవారికి సమాధానం చెప్పాలేగాని ఊరుకోకూడదు. సమాధానం చెప్పడం ఇష్టం లేకపోతే నేర్పుగా మాట మార్చాలి. మౌనం వహించాలి.

**కె. సీతారాములు, హుజూర్‌నగర్**

లక్షాధికారికి లాటరీలో లక్షలు రావడం నిరుపేదకు ఇళ్ళు కాలడం ఎందువల్ల అక్కయ్యా?

దేవుని లీలలు తమ్ముడూ! అవి అలాగే ఉంటాయి.

**ఉ. దుర్గాప్రసాద్, గుంటూరు**

భర్తనుండి భార్య కోరే సుఖం మానసికంగానా? శారీరకంగానా? ఏది లభించినప్పుడామె నిజమైన మనోతృప్తి పొందుతుంది? నేను ఎంతోమందికి ఈ ప్రశ్న పంపాను. ఎవరూ జవాబు ఇవ్వలేదు. ఈ ప్రశ్నలోని అసభ్యత ఏమిటో నాకు అర్థం కాలేదు.

భాషాప్రవీణ గారికి నమస్కారం. మీ ప్రశ్నలో అసభ్యత ఉందనీ, ఎవరూ జవాబు ఇవ్వలేదని ఎందుకు అనుకుంటున్నారు? ఆ అసభ్యత ఏదైనా ఉంటే అడిగినవారి మనస్సులో ఉండాలి. స్త్రీ జీవితం మూడు పూవులు ఆరు కాయలుగా సాగిపోవాలంటే రెండూ అవసరమే. వీటిలో ఏ ఒకటి కుంటువడినా హిస్టీరియా రోగులుగా మారే స్త్రీలు చాలామంది ఉన్నారు. లతకి ఎండకావాలా? నీళ్ళుకావాలా? అన్నట్లుంది మీ ప్రశ్న.

**కె. హరనాథ్, అలమూరు**

మనిషి ఛస్తే అందరూ ఏడుస్తారు. కాని అతడు అన్ని బంధాలనుంచి విముక్తుడయ్యాడని నా భావం—

ఆసంగతి ఏడిచేవారికీ తెలుసు. కాని వారు శోకించడం చనిపోయిన వ్యక్తి తిరిగి వస్తాడనికాదు. ముగిసిపోయిన అనుబంధాన్ని జ్ఞాపకం తెచ్చుకొని.

**కె. విమలాసత్యం, కొల్లాపురం**

నాకు ఉద్యోగములో చేరాలని ఉంది. మావారికిమాత్రం ఇష్టంలేదు. చేరడమా? వద్దా? అని అనిపిస్తోంది. ఏంచెయ్యను?

మీవారికి ఇష్టంలేని పని మానడానికి ఇంత ఆలోచన ఎందుకో అర్థం కావడం లేదు సోదరీ.

**బి. మాధవి, గుంటకల్**

పెళ్ళిమాట విన్నప్పటినుంచి ప్రాణ స్నేహితులతో కూడా మాట్లాడలేక పోతున్నాను. ఏం చెయ్యాలక్కా?

పెళ్ళిమాట అంత చెడ్డమాటగానూ, పెళ్ళిచేసుకోవడం అంత ఖిన్నపడవలసిన విషయంగానూ, తోచే నీలో ఏదో పిరికితనం ఉంది చెల్లాయీ, తీరుబడిగా కూర్చుని ఆత్మపరీక్ష చేసి చూసుకో.

**గిరిశ్రీ, అనంతపురం**

కేవలం ఉద్యోగాలపై ఆధారపడిన మధ్య తరగతివారికి నిరుద్యోగ సమస్య మరీ అధికం అవుతున్న ఈ తరుణంలో పెద్ద చదువులు సాగించడంవల్ల ఏమిటి ప్రయోజనం?

యజ్ఞపశువుని ఎందుకు బలవపెడతారను ట్టుంది. మీ ప్రశ్న! మధ్యతరగతి తల్లిదండ్రులు కట్నాల ఆశతో అబ్బాయిలకి పెద్దచదువులు; పెళ్ళి అయేదాకా ఉద్యోగంచేస్తుంది. పెళ్ళికాకపోతే ఉద్యోగంచేసి సంపాదించి యిస్తూనే ఉంటుందన్న నమ్మకంతో అమ్మాయిలకి చదువులూ చెప్పించాలని తాపత్రయపడుతున్నారనడం సాహసమే కావచ్చును. గాని అసత్యం మటుకు కాదు.

**ఎస్. అఫజల్ ఉన్నిసాబీగం, తంబళ్ళపల్లె**

కన్యలు ఎన్నో మధుర స్వప్నాలు ఈస్ట్‌మన్ కలర్‌లలో కంటూ ఏవేవో సుందర దృశ్యాలను ఊహించడం...ఎందుకు?

అది కన్యలజన్మహక్కు కనుక.

**టి. ఉమామహేశ్వర్, ఆలూరు**

భక్తుని రక్షణభారం భగవంతునిదే అనుట మూర్ఖత్వము. అదే తల్లిని నోరారా పిలిచినంతమాత్రమున మేలు కలుగజేయును. ఏం అక్కయ్యా?

తల్లి ప్రత్యక్ష దైవం తమ్ముడూ, ఇష్టంలేని కోరిక విని దేవునిలాగవూరుకోదు. నాలుగంటించివాంటించవచ్చును. అదే 'నోరారా పిలిస్తే పలికే దైవంతోవచ్చిన గట్టి చిక్కు!

**ఏ. లీలావతి, ఒంగోలు**

ఈ రోజులలో ప్రజలు ఎందుకు చదువు కన్న ధనమునే ఎక్కువగా ప్రేమించుచున్నారు?

మనస్సుకు ప్రీతినిచ్చేదాన్ని ప్రజలు ప్రేమించడంలో తప్పేముంది లీలావతిగారూ. కలియుగంలో డబ్బే దైవం.

**ఎస్. నాగయ్య. ఖమ్మం**

నేటి నాగరికసమాజంలో ప్రేమించి పెండ్లిచేసుకొనేవారిని మీరు సమర్థిస్తారా?

మన సమర్థన అక్కరలేనివే కదండీ ప్రేమవివాహాలు!

**శ్రీమతి అరుణా సుబ్రహ్మణ్యం, వేట్లపాలెం**

స్త్రీ ఎంత చదువున్నా ఆమెను వివాహ సమస్య బాధిస్తూనే ఉంది. అదే పురుషుని విషయంలో సహాయకారిగా పనిచేస్తున్నది. కారణం ఏమిటంటారు?

స్త్రీపట్ల చదువు కట్నం మదుపు హెచ్చిస్తోంది. పురుషునికి అది పెట్టుబడి అవుతోంది. ఒకరి విషయంలో నష్టాన్ని ఒకరివిషయంలో లాభాన్ని పెంపొందించేది 'సమస్య' అయి బాధించడంలో వింత లేదు. చదువుకీ పెళ్ళికీ, కట్నానికీ ముడిలేనిరోజు ఈ బాధ కొంత తప్పవచ్చును.

**బి. లలితారావు, భిలాయి**

నవ్వే వాళ్ళను నవ్విస్తారు. ఏడ్చేవాళ్ళను ఏడిపిస్తారు. ఎందుకు?

'అన్నం తిన్నవాడికి అన్నం పెట్ట వేడుక. బోడితలవాడికి తలంటు వేడుక అన్నారు—వినలేదా?

**వి. కుటుంబరావు, బెల్లంపల్లి**

భగవంతుణ్ణి చూడాలనీ, ఆయనతో మాట్లాడాలనీ ఉంది నాకు. అసలతడు ఉన్నాడో లేదో?

వెనకటికి 'జగదీశ్వరు డతడెవడో కపటిడై బాగుండును. నిందిస్తే, అడిగేస్తే, కడిగేస్తే అన్నాడో మహాకవి. వారితో కలం స్నేహం చేస్తేనేమిటి?

**పి. విజయలక్ష్మి, అనంతపురం**

ఈ నవయుగంలో మగవారు ఆడవారి పేర్లు పెట్టుకొని రచనలు చేస్తున్నారుకదా. మరి ఆడవాళ్ళు మగపేర్లు పెట్టుకొని రచనలు చేసే కాలం ఎప్పుడు వస్తుంది?

సుదూర భవిష్యత్తులోనే! నిజం ఆడ రచయితలకి ఆగతి పడుతుంది—తప్పదు.

**ఏ. బి. అన్సారి, టిట్లాఘర్**

కథలు వ్రాయడం విషయంలో రాణించ కల్గినంతగా కవిత్వ విషయంలో రాణించలేక పోతున్నారు స్త్రీలు. ఎందుచేతనో?

గట్టిగా పట్టుపట్టలేదింకా. అంతే.

**తాడేపల్లి వెంకటసుబ్బలక్ష్మి, పొడిగిట్లపల్లి**

మన భారతదేశంలో పురుషుడు ఎన్ని వివాహాలు చేసుకున్నా చేసుకోవచ్చు. కాని స్త్రీకి సంసారమంటే ఏమిటో తెలియక మునుపే భర్తపోయినా మరల వివాహము చేసుకోకూడదు అంటారు మన పెద్దలు. ఎందుచేత?

అని ఏ పెద్దలు చెప్పగ విన్నారు? బహు భార్యా నిషేధ చట్టరీత్యా ఒక్క ముస్లిములుతప్ప మిగిలిన ఇతర జాతులువారు ఏకపత్నీవ్రతం అవలంబించ వలసినదే. అలా కాకుండా రెండో భార్య కలవారి పందరినీ దొంగపెళ్లిళ్లే. ఇకపోతే వీరేశలింగం పంతులు గారి ధర్మమా అంటూ స్త్రీ పునర్వివాహం అన్నది ఎప్పటినుంచో ఉందన్న సంగతి మరిచారా?

**యం. ఆర్. మోహన్, చిత్తూరు**

బాల వితంతువులై గొప్ప ధనవంతులైన వారి కుమార్తెలు గుణశీలములు కల్గి, తిరిగి వివాహములు చేసికొనక సంఘంలో నలుగుతున్నారు. నా ఆశయం అటువంటి వారిని వివాహము చేసుకోవాలని. మీ అభిప్రాయం ఏమిటి?

మీ ఆశయం అమోఘంగా ఉంది తమ్ముడూ! డబ్బూ దస్కం ఉంటే అంటూ సంటూ లేదన్నాట్ట! వెనకటి కో కుర్రాడు. మీ రొక్కరే ఏమిటి? 'యంగ్, రిచ్, విడో' ను వివాహం చేసుకుని సంఘ సంస్కరణ చేసినట్లు మురిసిపోవాలని తలపోసే యువకులు—'గిరీశాలు' ఈరోజుల్లో చాలామంది ఉంటారు. ఓ సంఘం స్థాపించి హితోధిక కృషి ప్రారంభించండి

**పెన్మత్స లక్ష్మి, పెదపుల్లేరు**

నాకు వివాహం అయి 5 సంవత్సరాలు అయింది. సంతానం కల్గలేదు. డాక్టరు సలహాతీసుకోమంటున్నారు. భగవంతుడు ఇవ్వని దానికి డాక్టర్లు ఏం చేస్తారు? అందుకు డాక్టరు పరీక్షకు ఒప్పుకోవడం లేదు...

వైద్యోనారాయణోహరి అన్నారు పెద్దలు. వైద్యుడు ప్రత్యక్ష దైవం. మూర్ఖత్వం విడిచి డాక్టరుని సంప్రదించండి.

**శ్రీకోట శ్రీమంతం, పోచమ్మవాడ**

మా ఇద్దరిమధ్య అరణ్య ప్రాంతంలో ఉండి ఉద్యోగం చేయడం అడ్డువస్తూంది. పెద్దవాళ్ళు నన్నా ప్రాంతాలకు పంపడానికి ఇష్టపడ్డం లేదు.

పగలు కాకిఅరుస్తే భయపడే వనిత రాత్రి ఏరుదాటి వెళ్లేదట ప్రియుని కలుసుకొందుకు! అరణ్యప్రాంతంలో అయినవారు ఉండగా లేనిది మీ కేమిటి అభ్యంతరం. సత్వరంగా ప్రయాణం కట్టండి.

**మంగు కమలకుమారి, బారువ**

నమ్మించి ద్రోహం తలపెట్టేవారిని ఏమనాలి?

చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుని ఏం ప్రయోజనం? మరీ అంత గుడ్డిగా నమ్మక పోవడమే విరుగుడు.

**బెండి లోకవీర్, సీతాపురం**

నేను ఇంటివారిపై కోపముతో ఆర్మీలో జాయినయిపోయాను. ప్రస్తుతము ఇందులో ఉండుటకు మనసు ఒప్పడంలేదు. డిస్చార్జి అడిగితే ఇవ్వడం లేదు. ఏన్నేం చెయ్యమంటారు?

అలిగి ఆర్మీలో చేరడం మొదటి తప్పు. తీరా చేరిన తరువాత తిరిగి వచ్చేయాలని బెంగ పెట్టుకోవడం మరీ దారుణం. దేశ రక్షణ భారంలో పాలు పంచుకుంటూ ధైర్యం తెచ్చుకోవాలని సైనికులైన మీకు చెప్పవలసిరావడమా లోక వీరా?!

**కె. జ్యోతి, కర్నూలు**

మా పిల్లలకి వయస్సులో వ్యత్యాసం ఒక సంవత్సరమే. ఆడుకోటానికి పంపిస్తే చాలు గుప్పెడుమట్టి నోట్లో వేసుకు వస్తారు. ఎన్నిరకాలుగా మరిపిద్దామన్నా ఈ అలవాటు పోవడంలేదు. ఈ దురలవాటు పోవడం ఎలాగ?

కాల్షియంలాంటివి తక్కువ అయితే ఇలా మట్టి సున్నం, బలపం లాంటివి తినాలనే ఆసక్తి చూపుతారు పిల్లలు అని వైద్యులంటారు. డాక్టరును సలహా అడగండి.

**ఎన్. యమ్. పర్వీన్‌షాద్, సికింద్రాబాదు**

నాకు వివాహం అయిరెండు సంవత్సరాలైంది. మెట్రిక్‌కి కడదామంటే ఘోషా అంటారు. నేనేం చెయ్యను?

పరీక్షలకి కట్టితేనే చదవాలా? కాలక్షేపానికి చదవకూడదా? హాయిగా ఇంట్లోనే కూర్చుని చదువు కొనసాగించండి. ఆ చదువు వృధాకాదు.

**జన్నేల సాయికుమార్, భువనేశ్వర్**

మానవుడు పరిస్థితులను పాలిస్తున్నాడా? పరిస్థితులచే పాలింపబడుతున్నాడా?

నెయ్యికి గిన్ని ఆధారమా? గిన్నెకి నెయ్యి ఆధారమా? అన్న పరమానందయ్య శిష్యుని ప్రశ్న జ్ఞాపకం వస్తూంది మీ ప్రశ్న చదివితే. రెండూ పరస్పరాధారములే. పరిస్థితులంటూ ఉన్నప్పుడు కదా—పాలితుడా? పాలికుడా అన్న అనుమానానికి ఆస్కారం?

**దారా నాగమణి, విజయనగరం**

కట్నం ఇచ్చేవారిని, పుచ్చుకునే వారిని కూడా శిక్షించాలనే ప్రభుత్వం శ్రద్ధ పోతోందా?

గుడ్డికన్నుతో చూస్తూవేస్తుంది పోదరీ. ఆ గుడ్డికన్ను మూసినా, తెరచినా ఒకటేకదా.






■ భగవంతునికి రూపంలేదు; ఆయన గుణాతీతుడు; సర్వాంతర్యామి, ఒక్కచోటనే స్థిరనివాసం ఏర్పరచుకుని ఆయన కూర్చుంటాడా?

రూపంలేని భగవంతుని స్వరూపాన్ని నిరయించడం సాధ్యం కాని పనికదా! అలాంటప్పుడు ఆయన స్వరూపాన్ని ఒక విగ్రహంగా నిర్మించి గుడిలో ప్రతిష్ఠించడం ఎంత ఉచితంగా ఉంటుంది? ఉచితమే అంటారు పెద్దలు!

భగవంతుణి విగ్రహంలో ఆవాహనచేసి, అందులోనే దేవుడున్నట్లు నిశ్చయించేవారు కోట్లకొద్దీ ఉన్నారు. ఆ దేవుళ్లను ప్రార్థించి, తమ సంకల్పాలు నెరవేర్చుకుని మొక్కుబడులు చెల్లించేవారు ఇందరూ అందరూ అని లెక్కించలేము!

విగ్రహపూజ అవిచ్ఛిన్నంగా జరుగుతూనే ఉన్నది.

అయినా—విగ్రహారాధనను వ్యతిరేకించిన వారూ లేకపోలేదు, విద్యావంతులలోనే!

రాజా — రామమోహనరాయలు, స్వామి దయానంద సరస్వతి—ఇత్యాదులు ఈ తెగకు చెంది ఉన్నారు.

దయానంద సరస్వతికి మొదట్లో మంచి నమ్మకమే ఉండేది. ఒక శివరాత్రినాడు రాత్రి అందరూ నిద్రపోతున్నా, ఆయనమాత్రం శివలింగం యెదుట తదేక ధ్యానంతో మేలుకొనే ఉన్నాడు. అప్పుడొక యెలుక శివలింగం మీదనుంచేవచ్చి, దేవుడికి నైవేద్యం పెట్టిన పదార్థాలను తింటూ వుండడం ఆయన కళ్లారా చూశాడు. ఆ లింగంలోనే దేవుడుంటే ఎలుకను శిక్షించకుండా ఎందుకు ఉపేక్షిస్తాడు? అని ఆయనకు ఆలోచన పట్టింది. తర్వాత — విగ్రహంలో దేవుడు లేడనీ, విగ్రహారాధన అనవసరమనీ అతడు నిశ్చయించుకున్నాడు.

స్వరూపం లేని దేవుడికి విగ్రహం ఏమిటని రామమోహనరాయల అభిప్రాయం.

సనాతన వైదిక మతానికి చెందినవారు మాత్రం దీనికి సమ్మతింపరు. వారికి విగ్రహారాధన అతిముఖ్యమైనది.

వివేకానందస్వామికి ఈ విషయంలో పట్టుదల ఎక్కువ.

ఆయన భారతదేశ సంచారం చేస్తూ వేదాంతోపన్యాసాలిచ్చి అందర్నీ ఆకర్షించేవాడు.

ఐశ్వర్యవంతులు ఆయనకు దాసానుదాసులైనారు. మహారాజులాతని అడుగులకు మడుగులొత్తినారు.

ఈయన ఉపదేశాలన్నీ ఖేత్రీ మహారాజు మనస్సుకు బాగా హత్తుకున్నవి. భగవత్తత్త్వమును గురించిన సందేహాలన్నీ తీరినవి. కాని, ఒక్క సందేహం ఉండిపోయింది.




అంతటా వ్యాపించి వుండే దేవుడు విగ్రహంలో ఉన్నాడని ఎలా నమ్మడం? అట్టి విగ్రహాన్ని పూజించడం ఎందుకు? అనేదే ఆయన సందేహం.

విగ్రహారాధన విషయంలో తనకు నమ్మిక కుదరకుండా ఉన్నదంటూ ఆయన స్వామితో చెప్పివేశాడు.

కేవలం మాటలతో నచ్చజెప్పడం కుదరదని వివేకానందుని గ్రహించి ఒక ఉపాయం పన్నాడు.

సభలో అందరూ ఉండగా స్వామి ముఖ్యుడైన మంత్రిని పిలిచి, గోడకు వేలాడుతూ ఉన్న మహారాజావారి చిత్రపటాన్ని తీసుకురావాలని కోరాడు.

మంత్రి అలాగేతెచ్చి స్వామి దగ్గర ఉంచాడు.

స్వామి, ఆయనతో 'దయచేసి యీ పటంమీద ఉమ్మివెయ్యండి' అని అన్నాడు.

మంత్రి నిశ్చేష్టుడైపోయాడు. రాజాగారితోపాటు సభ్యులంతా ఆశ్చర్యచకితులయ్యారు.

'నేను చెప్పినట్లు చెయ్యరేమిటా?' అని స్వామి ప్రశ్న.

'అయ్యా! మీ అభిప్రాయం ఏమిటో నాకు బోధపడడంలేదు, ఇది మా ప్రభువు వారి చిత్రపటం. దీనిపైని ఎలా ఉమ్మగలను.' అని మంత్రి సమాధానం.

'అయ్యా! మీకు సంకోచందేనికి? ఈ పటం చట్రంతోను, అద్దంతోనూ, కాగితంతోనూ తయారైంది. ఇందులో మీ ప్రభువులులేరు. వారు అరుగో—అక్కడఉన్నారు. మీరు వారిపైని ఉమ్మడంలేదు. ఈ అద్దంపైని ఉమ్మితే తప్పేమి?' అన్నారు స్వామి.

ఒక నిమిషందాకా నిశ్శబ్దం.

స్వామి అందుకున్నారు.

'ఈ పటంలో మీ ప్రభువులు లేకపోయినా, ఆయన ప్రతికృతి ఉంది. ఆ ప్రతికృతినే మీరు ప్రభువుగా గౌరవిస్తున్నారు. అందువల్ల దీనిపైని ఉమ్మితే ప్రభువును


(64వ పేజీ చూడండి)

శ్రీమతి పరిమళా సోమేశ్వర్

# ఉద్యోగినుల సమస్యలు

చదువుకున్న స్త్రీని చోద్యంగా చూసే రోజులు పోయినయ్ మనదేశంలో. కాని యీ నాటికీ—యీ యిరవయ్యో శతాబ్దపు ఉత్తరార్థంలో కూడా చదువుకున్న స్త్రీ ఉద్యోగం చెయ్యాలా అక్కర్లేదా అన్న విషయం చర్చనీయాంశంగానే ఉండిపోయింది. ఆ సంగతటుంచి హాబీకోసమో, అవసరం కొద్దినో పురుషులతోపాటు శ్రమకోర్చి డబ్బు సంపాదిస్తున్న యీనాటి స్త్రీలు ఎదుర్కొనే సమస్యలనేకం.

ముఖ్యంగా దేశంలో నేటి ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా మధ్యతరగతి కుటుంబాల్లో లక్షరజ్ఞానం ఉన్న ప్రతి స్త్రీ కూడా ఉద్యోగం చెయ్యటం తప్పనిసరి అవుతోంది. ఫాషన్‌కోసం, హాబీకోసం కాకుండా అవసరం కొద్దీ పొట్టచేతొ పట్టుకుని పురుషుడితో పాటు గడపదాటి వచ్చిన నేటి భారత మహిళ సాంఘికంగా, నైతికంగా ఎన్నో సవాళ్లను ఎదుర్కోవలసి వస్తోంది. ఈ సవాళ్లనన్నిటిని ఎదుర్కొని నిలబడాలంటే ఆమె చుట్టూ ఉన్న వ్యక్తుల సహకారం ఎంతైనా అవసరం.

ముఖ్యంగా ఉద్యోగస్థురాలైన స్త్రీకి యింట్లోవారి సహకారం ఎంతో అవసరం. ఈ విషయం విని కొందరాశ్చర్యపోవచ్చు—యింట్లో వారివ్వగల సహకారమేమిటా అని. కాని నిజానికి నేడు ఉద్యోగినికి కావలసిందీ, లేనిదీ కూడా యీ రకమైన సహకారమే.

నేను చెప్తున్నది పెళ్లికాని అమ్మాయిలను గూర్చికాదు. ఎందుకంటె ఆలాటి వారిని ఎటూపడీ యింట్లోని వారంతా అపురూపంగా చూసుకుంటూ తగు ప్రోత్సాహొన్నిస్తూనే ఉంటారామెకు. ఎటొచ్చీ వివాహమై అత్తవారింట్లో నలుగురు మధ్య జీవించే బాధ్యతలుగల గృహిణికే సమస్యలన్నీను.

ఆడదంటే కేవలం వంటయింటి పనికోసం ప్రత్యేకింపబడిన ప్రాణి అని మన దేశ ప్రజలలో బాగా జీర్ణించుకుపోయిన ఓ తప్పు అభిప్రాయం ఉంది. అలాగని వంటచెయ్యటం చదువుకున్న స్త్రీ 'డిగ్నిటీ'కి భంగమని నేననటంలేదు. కొన్ని శతాబ్దాలకు పూర్వం వరకు,—స్త్రీలు ధనార్జన చెయ్యవలసిన అగత్యం మన దేశానికింక పట్టని ఆరోజుల్లో మగవాడు సంపాదించటం, ఆడది వండిపెట్టటం ఆచారంగా ఉండేది. అది కేవలం 'డివిజనాఫ్ లేబర్' తప్ప అంత మాత్రాన ఆడదే వండిపెట్టాలని, మగవాడే సంపాదించాలి అనీ శిలాశాసనమేం లేదు:

కాని రోజులు మారినయ్. స్త్రీలు కూడా సంపాదిస్తున్న యీ రోజుల్లో అటు ఉద్యోగ ధర్మం, యిటు గృహ నిర్వహణ యీ రెండూ కూడా నిర్వర్తించాలంటే జోడు గుర్రాల సవారీయే అవుతోంది. ఇటు అత్తలు, ఆడబడుచులు కూడా యింటి కోడలు కాలాన్ననుసరించి, ఉద్యోగమూ చెయ్యాలి పైగా, తు. చ. తప్పకుండా తమ సేవలు కూడా చెయ్యాలీ అనుకోవటం అన్యాయమే కాదు—అమానుషం కూడా అవుతుంది.

అంతేకాక కేవలం భార్యా భర్తలు మాత్రమే వేరింటికాపురం పెట్టిన సంసారాల్లో కూడా ఉద్యోగినికీ బాధలు తప్పటం లేదు. స్త్రీలకు చదువులు చెప్పించి, తమతో పాటు ఉద్యోగాలు కూడా చెయ్యనిస్తున్నందువల్ల స్త్రీకి సమానహక్కులు యిచ్చేసేమంటూ గర్వంగా చెప్పుకుంటున్నారు పురుషులు. కాని నిజానికి యీ 'సమాన హక్కులు' వచ్చిన తరువాతే స్త్రీ యొక్క స్థితి మరీ అధ్వాన్నం అయిపోయింది. చక్కగా యింటిపట్టున ఉండి సంసారాన్ని

---

డాక్టర్ కబుర్లు

## మనస్సు బాగా ఉండకపోతే?

ఎటువంటివారికయినా అప్పుడప్పుడూ మనస్సు చెడిపోతూ ఉంటుంది. ఇందులో ప్రత్యేకత ఏమీలేదు! కాని, తరచూ మనస్సు చెడిపోతే మంచిది కాదు.

ఒకప్పుడు ప్రతి చిన్న ఆందోళనని మనస్తత్వశాస్త్రజ్ఞులు చూడాలనేవారు. ఈనాడు అది అవసరంలేదు. విచారాన్ని పోగొట్టి మనసుకి ఆహ్లాదం కలిగించే మందులు ఎన్నో ఉన్నాయి. ఇవి పుచ్చుకుని, ఈ రకం మనోవేదనకి లోనయ్యే మనుషులు తమ మామూలు మానసిక స్థితిని పొందవచ్చు.

ఎలెక్ట్రిక్ షాక్ వైద్యం ఉంది. ఇవి త్వరగా ఫలితాలని ఇస్తాయి. ఆత్మహత్య, ఆకలి క్షీణించుకపోవటం వంటి ప్రమాదాలని అరికడ్తాయి. సాధారణంగా 10 షాక్ ట్రీట్‌మెంట్లు కనీసం ఇస్తారు. వీటిని డాక్టర్ల ఆఫీసు గదుల్లో కూడా ఇవ్వవచ్చు—పేషంటుని అక్కడికి తీసుకు



రావటం వీలయితే.

హెచ్. ఎల్. హెర్మన్‌సోన్
(కాపీరయిటు)

విద్దుకునే ఆ నాటి స్త్రీయే శారీరకంగా, మానసికంగా ఎంతో ఆరోగ్యంగా ఉండేది. కాని యీనాడు పగలల్లా ఆఫీసు పనిచేసి సాయంత్రంనుండి మరల రాత్రి పదిగంటల అరకు యిల్లు చక్క బెట్టుకోవాలంటే ప్రెస్టేజ్‌కి యావరేజ్ స్త్రీ తట్టుకోవటం కష్టం. పోనీ ఏ వంట మనిషినో పెట్టుకోవాలన్నా మధ్యతరగతి కుటుంబీకులు ఆ ఖర్చుకు తట్టుకోవటం కష్టం.

సాయంత్రం ఆఫీసునుండి తన యింటికి వచ్చేసరికి యిల్లాలు 'కాఫీ కప్పుతో, ఫొటోజెనిక్‌గా నవ్వుతూ ఎదురవాలని కోరుకునే పురుషుడికి తనతో పాటు శ్రమించి యింటికి వచ్చిన భార్యకు వంట పనిలో కాస్త సాయం చెయ్యాలంటే నామోషీ! తనకన్నా భార్య ఆఫీసునుండి ఓ అరగంట ఆలస్యంగావస్తే ఓ కప్పు కాఫీ కలపటానికి అతని 'డిగ్నిటీ'కి భంగం! వేషభాషల్లో పాశ్చాత్యుల ననుసరించే భారతీయులు భార్యవిషయం వచ్చేసరికి నూరు నయాపైసల భారతీయత ప్రదర్శింప జూస్తారు.

శారీరకంగా స్త్రీ కన్నా బలవంతుడైన పురుషుడు ఆఫీసుపనితో అలసిపోయి భార్య చేసేచల్లని సేవకోసం పరితపిస్తాడే అలాంటిది కోమలత్వానికి మారుపేరయిన స్త్రీ యింట్లోను, బయటాకూడా చేసే యీ 'చాకిరీ'కి ఎలా తట్టుకోగలదు? సౌందర్యానికి, సౌకుమార్యానికి ప్రతినిధి అయిన స్త్రీ నేటి ఆర్థిక పరిస్థితులవల్ల యీ రెంటినీ కోల్పోవటమేకాక అటు పురుషుల అజ్ఞానానికి, అహం భావానికి కూడా బలి

# ఉద్యోగినుల సమస్యలు

ఆవటంవలన మానసికారోగ్యానికి కూడా దూరమవుతోంది. కాబట్టి మధ్య తరగతి కుటుంబాల్లో ఆరోగ్యం, ఆనందం విలసిల్లాలంటే పురుషులలో—విశాల హృదయం లాంటి పెద్దమాటలు కాకపోయినా—కనీసపు మానవత్వం, సానుభూతి ఉండటం ఎంతో అవసరం. ఇంటి యిల్లాలు ఆరోగ్యంగా ఉన్నప్పుడే పిల్లలు కూడా ఆరోగ్యంగా ఉంటారు; ఇంటిలో ఆనందం తాండవిస్తూ ఉంటుంది.

ఇక యిదేకాక భార్య భర్త లిద్దరూ ఉద్యోగించేసే సంసారాల్లో అనవసరమైన ఖర్చులు చాలా చెయ్యవలసి ఉంటుంది. ఉదాహరణకి— పనిమనిషి మిగతా యిళ్లలో ఐదురూపాయలకు చేసేది వారింటికిరాగనే పదిరూపాయలు అడుగుతుంది. ఇద్దరూ సంపాదిస్తున్నారు కనుక ఆ మాత్రం యివ్వటం వారి కనీస ధర్మమని, అడగటం తమ జన్మ హక్కని వారి భావన. అలాగే యింటి అద్దె, చాకలి ఖర్చు యివన్నీ వారికి మిగతావారికన్నా ఓ రూపాయెక్కువే అవుతుంది. ఆఖరికి రిక్షావాడికి కూడా భార్యా భర్త లిద్దరూ కలసి ఆఫీసుకు వెళ్తున్నారంటే చులకనే. అరమైలు దూరమయినా 'అణా'కి తగ్గనంటాడు.

బయట కూడా ఉద్యోగిని తన తోటి ఉద్యోగస్థుల విమర్శలకు, అసూయకు గురి అవుతూనే ఉంటుంది. వేలకు వేలు కట్నం తీసుకుని పెళ్లిచేసికొన్నవాడికి కూడా నెలజీతం తెస్తున్న భార్యగల తోటి ఉద్యోగస్తుణ్ణి చూస్తే అసూయే.

మన దేశంలోనే కాక మనమెంతో అభివృద్ధి చెందిన దేశమనుకుంటున్న ఇంగ్లండులో కూడా ఉద్యోగినులకీ సమస్య ఉండనే ఉందిట. అక్కడ స్త్రీలు 'విమెన్స్ ట్రేడ్ యూనియన్' ఒకటి మొదలెట్టబోతే వారి భర్తలంతా దానికివ్యతిరేకులై నిలిచి దానిని ఆదిలోనే త్రుంచి వేయజూస్తున్నారట!

ఇదంతా చూస్తుంటే స్త్రీ జాతి నేడెదుర్కొంటున్న సమస్యలకు మూలకారణం పురుషుడేనని తోస్తోంది. పేపరుమీద, స్టేజిమీద స్త్రీని శక్తి స్వరూపిణిగా, దేవతా మూర్తిగా స్తుతించే పురుషుడు నిజజీవితంలోకి వచ్చేసరికి ఆమెను వ్యక్తిత్వం లేని ఒక బొమ్మగా, తన మీద అన్ని విధాలా ఆధారపడిన 'పారసైట్'లా భావిస్తాడే తప్ప ఆమెను వ్యక్తిత్వం గల మనిషిగా గౌరవించలేదు. కొన్ని శతాబ్దాలుగా పురుషుల హృదయాల్లో బలంగా వ్రేళ్లు నాటుకుపోయిన యీ మనస్తత్వం పోతేకాని స్త్రీ జాతికి ముక్తిలేదు.

అంతేకాక ఉద్యోగినుల సౌకర్యం కోసం మన ప్రభుత్వం చెయ్యవలసిన కృషికూడా ఎంతైనా ఉంది. పాశ్చాత్యదేశాల్లోలా స్త్రీలు ఉద్యోగానికి వెళ్లినపుడు వారి పిల్లలను చూసేందుకుగాను 'నర్సరీ'లు ఏర్పరచాలి. మనదేశంలో ఆఖరికి పెద్ద పెద్ద పట్నాల్లో కూడా యిలాంటి నర్సరీలు లేకపోవటం శోచనీయం.

కాబట్టి గృహసౌభాగ్యానికి, దేశ సౌభాగ్యానికి కూడా నేడు పురుషులు, ప్రభుత్వం చెయ్యవలసిన కృషి, స్త్రీకి యివ్వవలసిన సహకారం యింకా చాలా ఉంది. ●



చిన్నా నాడవ మూలాన ఇద్దరూ మాట్లాడుకోడం మానేస్తే - ఆఫీసులా పనులెలా జరుగుతాయ్!!

వంటలు :

## కోడి కబాబ్

| | |
|---|---|
| కైమా చేసిన కోడి | $1\frac{1}{2}$ కప్పులు |
| ఉల్లిపాయలు | 2 |
| వెల్లుల్లి | 4 |
| అల్లం-సుమారు అంగుళం పొడుగు ముక్క | |
| పచ్చిమిరపకాయ | ఒకటి |
| మిరియం | 2 |
| జీలకర్ర | తగినంత |
| ఏలక్కాయలు | తగినన్ని |
| ఉప్పు | |

వస్తువులన్నిటినీ తరిగి కలిపిన తర్వాత ఉండలు చేసి నేతిలో వెయించాలి లేదా పుల్లలకి గుచ్చి కాల్చి తినవచ్చు. ●

స్టేట్ బ్యాంకు మరియు దాని అనుబంధ బ్యాంకులు భారతదేశమంతటా వ్యాపించియున్న తమ 2100 బ్రాంచీల ద్వారా తమ ఖాతాదారులకు ఇప్పుడు రెండు అదనపు సదుపాయములను సమకూర్చుచున్నవి. అవి ఏమనగా ప్రత్యేక చెక్కు ట్రాన్స్‌ఫర్ స్కీమ్ మరియు "టెల్లర్ సిస్టమ్". ఈ అదనపు చేర్పుతో, ఖాతాదారులకు సంపూర్ణ సంతృప్తిని కలిగించే నిమిత్తం ఎడతెగక అన్ని మార్గములను నిరంతరము అన్వేషించుచూ స్టేట్ బ్యాంకు ఇప్పుడు అయిదు క్రొత్త సేవలను సమకూర్చుచున్నది.

## స్పెషల్ చెక్ ట్రాన్స్‌ఫర్ స్కీమ్

బ్యాంకు యొక్క ఏ బ్రాంచి నుండి గాని లేక దాని అనుబంధ బ్యాంకుల నుండి గాని సొమ్మును తీసుకొనుటకు వ్రాయబడిన స్వకీయమైన చెక్కులు ఒక్కొక్కటి రూ. 2,500 వరకూ, బ్యాంకు యందలి ఏ ఎక్కౌంటునకైనా జమకట్టే నిమిత్తం (చార్జి) రుసుములేకుండా ఆ సొమ్ము వసూలు చేయబడును.

## టెల్లర్ సిస్టమ్

ప్రస్తుతం కొద్ది ఎన్నికైన స్థానములందు పరీక్షించి చూచుచున్న ఈ పద్ధతి క్రింద రూ. 1000/-ల వరకూ టెల్లర్స్ కౌంటర్ల వద్ద చెల్లింపులూ, డిపోజిట్లు అత్యల్ప వ్యవధిలో జరుపబడుచున్నవి. ఈ పద్ధతి ఎక్కువ బ్రాంచీలయందు విస్తారంగా హెచ్చింపబడుచున్నది.

## క్రెడిట్ ట్రాన్స్‌ఫర్ సిస్టమ్

మా స్పెషల్ క్రెడిట్ ట్రాన్స్‌ఫర్ సిస్టమ్ క్రింద రోజుకు రూ. 2,500/-ల వరకూ బ్యాంకు యొక్క ఏ బ్రాంచీ ఆఫీసు నుండియైనా మీ స్వంత ఎక్కౌంటునకు...రుసుము (చార్జీ) లేకుండా మీరు ట్రాన్స్‌ఫర్ చేయవచ్చును. ఈ పథకము స్వకీయమైన ఎక్కౌంట్లు అన్నిటికీ అనువర్తించుతుంది. మీరు స్వయంగా బ్యాంకునకు వెళ్లనక్కరలేదు...మీ ప్రతినిధితో సొమ్మును పంపవచ్చును.

## కరెన్సీ కార్డ్సు

ఆమోదిత ఖాతాదారులకు కరెన్సీ కార్డులు ఇవ్వబడును. ఈ కార్డును చూపుటవల్ల స్టేట్ బ్యాంకు యొక్క ఏ బ్రాంచి ఆఫీసు నందైనా లేక దాని అనుబంధ బ్యాంకులయందైనా ఏ ఒక్క రోజునైనా మీ చెక్కునకు నియమిత మొత్తం వరకూ మీరు రొక్కం తీసుకోవచ్చును.

## ప్రయాణీకుల చెక్కులు కమీషన్ లేకుండా ఇవ్వబడును.

స్టేట్ బ్యాంకు ట్రావెలర్స్ చెక్కులు రూ. 50/-లు మరియు రూ. 100/-లు విలువైనవి ఇవ్వబడును. బ్యాంకు యొక్క ఏ బ్రాంచీ ఆఫీసునందైననూ లేక దాని అనుబంధ బ్యాంకులయందైననూ లేదా విమానాశ్రయములయందు, హోటెల్స్ మరియు షాపులయందును గల రొక్కమును చెల్లించే ఏజెంట్ల వద్దను వాటి రొక్కమును తీసుకోవచ్చును.

**స్టేట్ బ్యాంకుయొక్క**

# ఐదు ప్రక్కల విస్తరిల్లిన సేవలు



ప్రతీదీ ఒక విశేషమైన ప్రత్యేక సమస్యను పరిష్కరించే నిమిత్తం సృష్టించబడింది. బహుశా మీదే కావచ్చు!

**స్టేట్ బ్యాంక్**
**సేవ నిమిత్తం**

LPE Aiyars S. 265 TL

# నీటమునిగిన మానవుడు

జీసస్ పుట్టటానికి వెయ్యేళ్ళ ముందు. ఒక యువతికి చక్కటి కొడుకు పుట్టాడు. కాని, ఆమె ఆ బిడ్డని దాచవలసి వచ్చింది. మూడునెలలు రహస్యంగా పెంచింది. చివరికి ఇక దాచలేక పాపని ఒక జెల్లు బుట్టలో ఉంచి నైల్‌నది తీరంలో పొదల వెనుక వదిలి వచ్చేసింది. ఇదంతా ఆ శిశువు సోదరి గమనిస్తూనే ఉంది. ఇంతలో ఫారో (ఈజిప్టు రాజు) కూతురు అక్కడికి స్నానానికి వచ్చి బుట్టని చూసింది. కుతూహలంతో తన పరిచారిక ఒకామెని అది ఏమిటో చూసి రమ్మంది. బుట్ట తెరవగా అందులో చక్కని బిడ్డ! 'ఇది ఒక హెబ్రూ శిశువులాగ ఉంది!' అంది రాజకుమారి. కాని ఆమెకి దాని మీద జాలి కలిగింది.

ఇదంతా చూస్తున్న ఆ బిడ్డ అక్క ధైర్యంచేసి రాజకుమారిని సమీపించి, 'ఈ బిడ్డని సాకటానికి ఒక హెబ్రూ స్త్రీని పిలుచుకురానా?' అని అడిగింది.

రాజకుమారి 'సరే' అంది. పిల్ల వెళ్ళి తన తల్లినే పిలుచుకు వచ్చింది. ఆమెని చూసి రాజకుమారి, 'ఈ శిశువుని సాకావంటే నీకు వేతనం ఇస్తాను,' అంది. ఆమె వెంటనే అంగీకరించింది.

బిడ్డ ఎదిగి పెద్దవాడయ్యాడు. పెద్దవాడయిన తర్వాత అతనిని ఫారో కుమార్తె వద్దకి తీసుకువచ్చారు. ఆమె అతనిని తన కొడుకుగా స్వీకరించింది. అతనికి 'మోసెస్' అని పేరు పెట్టింది. మోసెస్ అంటే 'నీటి నుంచి రక్షింపబడినవాడు,' అని అర్థం.

అప్పుడు హెబ్రూ జాతివారు తమ స్వదేశమయిన పాలస్తీనా వదిలి ఈజిప్టుకి వచ్చేశారు. అక్కడ వారిసంఖ్య అతివేగంగా పెరగటం చూసి ఫారో ఒక శాసనం విధించాడు—'హెబ్రూ కుటుంబాలలో పుట్టిన మగపిల్లలందరినీ నదిలో వెయ్యాల'ని.

మోసెస్ తల్లి ఆ శాసనాన్ని ఉల్లంఘించలేదు. కాని తన కొడుకుని రక్షించుకుంది. మోసెస్ ఫారో ఆస్థానంలో చాలా పయికి వచ్చాడు. తన జాతివారు అక్కడ ఎంత కష్టపడుతున్నారో చూశాడు. వారికి సహాయం చెయ్యాలనుకున్నాడు. అంతేకా వారు కష్టాలలో ఉంటే తను దుష్టుడయిన ఫారో కింద ఉద్యోగం చేస్తూ ఇష్ట సుఖాలు అనుభవించటం పాపం అనుకున్నాడు. ఉద్యోగం వదులుకుని రాజు విధానాలని ఖండించాడు. ఫారో అతనిని చంపించబోయాడు కాని మోసెస్ తప్పించుకుని ఈజిప్టు ఎల్లల వద్ద ఉన్న ఒక ప్రదేశానికి పారిపోయాడు.

భగవంతుడి మీద విశ్వాసం, ప్రేమ ఇవి రెండూ మోసెస్ గుణాలలో ముఖ్యమయినవి. ఒకనాడు దేవుడే అతనికి కనిపించి, 'ఫారోవద్దకి వెళ్ళి ఇస్రాయిల్ సంతతిని విడిపించమని కోర' మన్నాడు. మోసెస్ దైవశాసనాన్ని అనుసరించాడు కాని ఫారోమాత్రం ఈ అభ్యర్థని లెక్కచెయ్యకపోగా ఇస్రాయిల్ వారిని మరింత హింసించమని తన కింది అధికారులతో చెప్పాడు. ఇది కొంతకాలం సాగినా మోసెస్ దివ్యశక్తులని ప్రత్యక్షంగా చూసిన ఫారో చివరికి భయపడి 'మీ జాతివారిని తీసుకుని ఇక్కడినుంచి పొ'మ్మని మోసెస్‌ని కోరాడు.

మోసెస్ అరులక్షలమంది ఇస్రాయిలీలతో తన స్వదేశానికి ప్రయాణం కట్టాడు. మూడునెలల తర్వాత వారు సినాయి ద్వీపకల్పం చేరుకున్నారు. అక్కడ ఒకనాడు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో మోసెస్ ఒక కొండమీదికి ఎక్కివెళ్ళాడు. అక్కడ భగవంతుడు ప్రత్యక్షమయి తన శాసనాలని పాటిస్తే వారు తనకి ఇష్టమయిన ప్రజలు అవుతారని చెప్పాడు. అప్పుడే దేవుడు మోసెస్‌కి పది ధర్మసూత్రాలనీ ఉపదేశించాడు. ఈ పది సూత్రాలూ బైబిలు గ్రంథంలో ఉన్నాయి. ఇవి ఉన్న 'ఓల్డ్ టెస్టమెంట్' యూదులకీ, క్రైస్తవులకీ, మహమ్మదీయులకీ కూడా పవిత్ర గ్రంథం.

—ఎస్.

## అభియోగాలలో వింతలు

# ఖాళీగా ఉన్న పడకగది

తను అద్దెకు ఉంటున్న వాటాలో ఖాళీగా ఉన్న పడక గదిలో ఇంటి యజమాని కూతురు నిద్రించడానికి అనుమతించ వలసినదిగా స్టాన్లీ పేట్లీని ఒక న్యాయమూర్తి ఆదేశించాడు!

శ్రీ పేట్లీ ఇట్లా అన్నారు: 'ఇదేమి తీర్పు? లార్డ్ ఛాన్సెలర్‌కు అప్పీలు చేస్తాను. ఆ అమ్మాయి వయస్సు 20 సంవత్సరాల లోపు. మా వాటాలోని పడక గదిలో ఆమె పడుకుంటే ఇక మా సంసారానికి గుట్టేమి ఉంటుంది? మేము బయటికి వెళ్ళవలసి వచ్చినప్పుడల్లా గదులన్నింటికీ తాళం వేసుకోవలసి వస్తుంది.'

ఈ భవనం బ్రెంట్‌వుడ్, వెస్ట్‌బరీ రోడ్‌లో ఉన్నది. పై అంతస్థులో పేట్లీ దంపతులు కాపురముంటున్నారు. ఇంటి యజమాని శ్రీ డోన్లీ కింద వాటాలో ఉంటున్నాడు. చోటు చాలక తన కుటుంబం అవస్థ పడుతున్నదనీ, పేట్లీ దంపతులకు సరిపోయే చోటు కంటే చాలా ఎక్కువ ఉన్నదనీ డోన్లీ వాదన.

డోన్లీ కుమార్తె వయస్సు 16 సంవత్సరాలు. ఆమె కోసం పేట్లీ వాటాలోని ఖాళీ పడక గదిని 14రోజులలోగా డోన్లీ స్వాధీనం చేసుకోవచ్చునని న్యాయమూర్తి హెన్రీ ఒక తీర్పుచెప్పారు.

— వి. ఎస్. అవధాని.

# వజ్రాల దొంగ



(క) వజ్రాల దొంగ:

ఒక షావుకారుగారి భార్య ముచ్చటపడి 25 వజ్రాలు పొదిగిన బంగారపు పమిట పిన్ను చేయించుకుంది. ప్రతిరోజూ నిద్రపోయే ముందు, నిద్ర లేచినప్పుడు, అతిథులు ఉన్నప్పుడు, జ్ఞాపకం వచ్చినప్పుడూ... ఆ పిన్నులోని వజ్రాలు సరిగ్గా ఉన్నాయో లేవో



లెక్కపెట్టుకోవడం ఆమెకి అలవాటు. పైనున్న వజ్రంతో మొదలుపెట్టి. ఒకటి, రెండు, మూడు, నాలుగు...అంటూ మధ్యనున్న వజ్రం దాకా వచ్చి, కుడివైపుకి, ఎడమవైపుకి, కిందికి వేరువేరుగా లెక్కపెడుతుంది. ఎటు లెక్కపెట్టినా సరిగ్గా 13 వజ్రాలుండాలి.

ఒక రోజున ఆ నగలో ఒక వజ్రం వదులుగా ఉండడం గమనించి, వెంటనే బాగు చేయించడానికని నిశ్చయించి, ఒక పేరు మోసిన కంసాలిని ఇంటికి పిలిపించింది. చెయ్యవలసినపని, మజూరీ వగైరాలన్నీ మాట్లాడుకున్నాక, 'వజ్రాలు జాగ్రత్త సుమా!' అని హెచ్చరించింది. 'ఆ మాట నాకు వేరే చెప్పాలా?' అన్నాడు కంసాలి.

అతడి ముందరే ఒకసారి వజ్రాలు అన్నీ ఎటు చూచినా 13 ఉన్నాయో లేదో లెక్కపెట్టుకుని, నగ ఇచ్చింది.

సరిగ్గా అన్నవేళకి నగ బాగుచేసి తీసుకు వచ్చి ఇచ్చేశాడు కంసాలి. తన మామూలు పద్ధతిలో అతడి ముందరే వజ్రాలు లెక్కపెట్టుకుంది ఆ ఇల్లాలు. ఎడమకీ, కుడికీ, కిందికీ ఎటు లెక్కపెట్టినా 13 ఉన్నాయి, మళ్ళీ యధాప్రకారంగా జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఆమె వజ్రాలను లెక్కపెట్టుకుంటూనే ఉంది కాని, ఆ కంసాలి అతి తెలివిగా రెండు వజ్రాలను అపహరించేశాడన్న విషయం మాత్రం ఆమెకు తెలియనే లేదు!

ఇంతకీ కంసాలి ఆ పని ఎల్లా చేయగలిగేడు!

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీ మోహన్




(చ) అరటిపళ్ల బేరం:

ముద్దుల కొడుకు స్కూలు ఫైనల్ పరీక్ష రెండవ ప్రయత్నంలోనే పాస్ అయిపోయినందుకు బ్రహ్మానందపడిపోయిన పరమానందయ్య ఒకడజను అరటిపళ్ళు పంచిపెట్టదలచాడు. తండ్రీ కొడుకూ బజారుకి వెళ్ళేరు. పచ్చ చక్కెరకేళీ, ఎర్ర చక్కెరకేళీ పళ్లగెలలు కన్నులపండువుగా ఉన్నాయి. పచ్చవి అయితే పండు 5 పైసలు, ఎర్రవి అయితే పండు 7 పైసలూనూ.

అరటిపళ్ళకి ఇంత డబ్బు ఖర్చుచేయాలని ముందరే కేటాయించుకున్నాడు పరమానందయ్య.

'అవీ, ఇవీ చెరి సమానంగా కొందాం' అన్నాడు కొడుకు.

'కాదు. అదే డబ్బును సగం పచ్చపళ్ళకీ, సగం ఎర్రపళ్ళకీ ఖర్చుపెడితే రెండు డజన్లపళ్లు అదనంగా వస్తాయి. అన్నాడు తండ్రి. 'అపునవును' అని కొడుకు తల ఆడించాడు తన గణిత పరిజ్ఞానాన్ని తండ్రి దగ్గర ప్రదర్శించడం ఇష్టంలేక.

ఇంతకీ వాళ్ళు అరటిపళ్ళకు కేటాయించిన డబ్బు ఎంత?




(ఛ) మేరీ వయస్సు:

జాన్ తన స్నేహితురాలు మేరీకి పెళ్లి ప్రపోజలు చేయడానికి నిశ్చయించుకున్నాడు ఆ రోజున. మేరీతో మాట్లాడుతూ మంచి అవకాశం కోసం ఎదురుచూస్తూన్న సమయంలో ఆ పిల్ల తమ్ముడు తన కుక్కతో సహా ఆ గదిలోకి వచ్చారు. జాన్ చెప్పదలుచుకున్న మాట కాస్తా గొంతుకలోనే ఉండిపోయింది. మాట మార్చడానికి మేరీ తమ్ముడిని పలకరించాడు.

(64వ పేజీ చూడండి)

# కాకాభా



మల్లన్న మంత్రిగా ఉన్న రాజ్యానికి కొంతదూరంలో ఒక జమీందారు వుండేవాడు. ఇతరులను యేదో ఒక విధంగా అవమానించడం అతనికి సరదా. తాను పెట్టే మూడు పరీక్షల్లో నెగ్గిన వారికి పదివేల వరహాలు బహుమానం యిస్తానని ప్రకటించాడు జమీందారు. బహుమానం మీద ఆశకొద్దీ యెవరైనా వస్తే వాళ్లను ఆ జమీందారు మోసంచేసి ఓడించి అవమానించేవాడు.

ఈ సంగతి చారులద్వారా మల్లన్న మంత్రికి తెలిసింది. జమీందారుకు తగిన పాఠాన్ని నేర్పాలనుకొన్నాడు. వెంటనే అతను మారువేషంలో జమీందారు సభకు వెళ్లేడు.

తాను అవమానించడానికి మనిషి దొరికేడని జమీందారు సంతోషించి మొదటి పరీక్షను యేర్పాటు చేసేడు. జమీందారు ఆజ్ఞ ప్రకారం భటులు సభలోనికి రెండు చీట్లు ఉన్న ఒక పెట్టెను తీసికొని వచ్చేరు. మొదటి పరీక్ష షరతులను జమీందారు మల్లన్న మంత్రికి యీ విధంగా వివరించేడు.

'మడత పెట్టిన చీట్లు రెండు యీ పెట్టెలో ఉన్నాయి. ఒకదాని మీద 'నేను అర్హుడను' రెండవదాని మీద 'నేను అనర్హుడను' అని వ్రాయబడి ఉంది. 'నేను అర్హుడను' అనే చీటిని విప్పకుండా నీవు తీయగలిగినట్లయితే యీ పరీక్షలో నీవు గెలిచినట్లుగా భావించబడుతుంది. 'నేను అనర్హుడను' అనే చీటిని తీసినట్లయితే నీవు ఓడిపోయినట్లే'

రెండు చీట్లమీద కూడా 'నేను అనర్హుడను అని వ్రాయడం జమీందారుకు అలవాటు. అందుచేత పోటీలో పాల్గొనేవారు యే చీటి తీసినా కూడా వారు ఓడిపోతారు. ఈ విధంగానే జమీందారు అందర్నీ ఓడించేడు.

మొదటి పరీక్షలోనే అందరూ ఓడిపోతున్నారని చారులు చెప్పిన మాటలు వల్ల మంత్రికి గుర్తు ఉన్నాయి. మల్లన్న మంత్రి వెంటనే ఒక చీటి తీసి, దానిని విప్పి చూడకుండానే నోట్లో వేసికొని మింగివేసేడు. దానిని చూసి జమీందారు నిర్ఘాంతపోయి, అలాగ చీటిని ఎందుకు మింగివేశావని ప్రశ్నించేడు.

## మల్లన్న మంత్రి

## కౌటిల్య

'నేను అర్హుడను' అనే చీటినే నీవు తీసేవు. అందుచేత నీవు దానిని చూడనక్కరలేదు!! వెంటనే ఆ చీటీని మింగివేయమని నా అంతర్వాణి చెప్పింది. దానికి రుజువు కావాలంటే ఉండిపోయిన చీటీని చూడండి. దానిమీద 'నేను అనర్హుడను' అని వ్రాయబడి ఉంటుం'దని చెబుతూ మల్లన్న మంత్రి ఉండిపోయిన రెండవ చీటీని తీసి సభలో ఉన్న వారందరికీ చూపించేడు. దానిమీద 'నేను అనర్హుడను' అని ఉంది.

సభలోని వారందరూ మల్లన్న మంత్రి గెలిచేడన్నారు. దానికి మారు చెప్పడానికి జమీందారుకు అవకాశం లేకపోయింది.

'కాకాభా యెంత?' అని రెండవ పరీక్షగా జమీందారు మల్లన్న మంత్రిని ప్రశ్నించేడు. కాకాభా అనే దానికి యే అర్థమూ లేదు కాబట్టి మల్లన్న మంత్రి ఓడిపోతాడని జమీందారు అనుకొన్నాడు. ఇది కేవలం కొంటె ప్రశ్న కాబట్టి దబాయించడమే మంచిదనుకొన్నాడు మల్లన్న మంత్రి.

జనాభా అంటే జనుల సంఖ్య అన్నట్లుగా కాకాభా అంటే కాకుల సంఖ్య. ఈ దేశంలో సరిగ్గా యీ సమయానికి ఒక కోటీ మూడు లక్షల తొమ్మిదివేల నూట తొమ్మిది కాకులు ఉన్నాయి. మీకు అనుమానం ఉన్నట్లయితే లెక్క పెట్టించవచ్చును. అయితే యిప్పటి నుంచి లెక్కబెట్టే లోపున పుట్టే కాకుల సంఖ్యను, మరణించే కాకుల సంఖ్యను కూడా పకడ్బందీగా లెక్కలోనికి తీసికోవాలి. అంతేకాదు యీ దేశం నుంచి కాకులు యితరదేశాలకు వెళ్లకుండాను, యితర

దేశాల నుంచి కాకులు యీ దేశం రాకుండాను కాపలా యేర్పాటు చేయించాలన్నాడు మల్లన్న మంత్రి.

ఈ సమాధానం వినగానే మల్లన్న మంత్రి యీ పరీక్షలో కూడా గెలిచేడని, సభ్యులందరూ యేకగ్రీవంగా అన్నారు. ఆ సమాధానం కాదని చెప్పడానికి జమీందారుకు యేమీ అవకాశం లేకపోయింది. కనుక మూడవ పరీక్షను యింకా కఠినంగా ఉండేటట్లు యేర్పాటు చేసేడు.

ఊరి బయట ఒక చెట్టుకు పదిహేను గజాల గొలుసుతో బాగా ఆకలితో ఉన్న ఒక సింహాన్ని కట్టి వేసేరు. ఈ పరీక్షలో గెలిచినట్లుగా జమీందారు వ్రాసి యిచ్చిన విజయపత్రాన్ని ఒక చిన్న పెట్టెలో పెట్టి చెట్టుకు అయిదు గజాల దూరంలో ఉంచేరు. సింహానికి యేవిధమైన హానీ చేయకుండా, సింహం వల్ల నీవు గాయపడకుండా కర్రా, త్రాడూ వగైరా యేమీ ఉపయోగించకుండా పెట్టెను సింహం బారి నుండి బయటకు తేవాలి. ఒక గంట సేపట్లో అలాగ నీవు పెట్టెను తేలేకపోయినట్లయితే నీవు వోడిపోయినట్లుగా మేము భావిస్తామని మూడవ పరీక్ష షరతులను జమీందారు మల్లన్న మంత్రికి వివరించేడు.

మల్లన్న మంత్రి ఒకసారి చెట్టువైపు చూసేడు. ఆ చెట్టు మొదలు చుట్టుకొలత రమారమి ఒక గజం ఉంది. అప్పుడు మల్లన్న మంత్రి సింహానికి అందీ అందకుండా చెట్టు చుట్టూ పరుగెత్తడం ప్రారంభించేడు. సింహం కూడా అతన్ని పట్టుకోవడానికి చెట్టు చుట్టూ తిరగడం ప్రారంభించింది. సింహం ఒకసారి చెట్టు చుట్టూ తిరగగానే ఒక గజం పొడవు గలిగిన గొలుసు చెట్టుకు చుట్టుకొని పోయింది. అలాగ మల్లన్న మంత్రి పన్నెండుసార్లు చెట్టుచుట్టూ పరిగెత్తేసరికి సింహానికి కట్టిన గొలుసులో పన్నెండుగజాలు చెట్టుకు చుట్టుకొని పోయింది. అందుచేత సింహం అప్పుడు చెట్టునుంచి మూడు గజాల దూరం మాత్రం తిరగగలిగింది.

మల్లన్నమంత్రి అప్పుడు సింహము, జమీందారు, సభ్యులు చూస్తుండగా విజయపత్రాన్ని తీసికొన్నాడు.

మూడు పరీక్షల్లోను మల్లన్న మంత్రి నెగ్గేడని జమీందారు అంగీకరించి అతనికి పదివేల వరహాలను బహూకరించేడు. మల్లన్న మంత్రి తాను యెవరైనదీ జమీందారుకు తెలియజేసి అటుపైన యెవరికీ అటువంటి పరీక్షలను పెట్టవలదని హెచ్చరించేడు. పదివేల వరహాలను అక్కడ వుండే పేదలకు పంచిపెట్టి తన రాజ్యానికి బయలుదేరేడు మల్లన్న మంత్రి. ●





సీరియల్

తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారు వో హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాస్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. మధు, కామయ్యమాస్టారి కూతురు శారదను ప్రేమిస్తాడు. శారద అంగీకరించదు. ప్రసాద్‌మీద శారదకు ఎంతో అభిమానం. తప్పించుకు తిరుగుతుంటాడు ప్రసాద్. తర్వాత అతనంటే ఆమెకు అశాంతి ఎక్కువయ్యింది. స్కూలు హైస్కూలు కావడంతో కామయ్య మాస్టారు పదవీ విరమణ చేయాల్సివస్తుంది. వేసవి సెలవులకి అందరూ గూళ్లకి చేరుకుంటారు. మధులో ఇదివరకటి హుషారులేదు. ప్రసాద్‌మీద అతనికి అభిమానం ఏర్పడింది.

## 16

ప్రసాద్‌ను గూర్చి ఆమె ఆవిధంగా మాట్లాడుతుందని తను ఊహించలేదు. ప్రసాదంటే ఆమెకు ఎంత అభిమానమో తనంటే ఎంత నిరసనో ఆలోచించుకొన్నాడు. ప్రసాద్‌పట్ల కేవలం తన వైఖరిని తెలిసికోడానికై ఈ విధంగా తిరస్కార భావంతో మాట్లాడుతుందేమోనని అనుమానం కల్గింది.

'ఒక చిన్న విషయాన్ని పురస్కరించుకొని మనిషి పూర్తి వ్యక్తిత్వాన్ని అలా అంచనా వెయ్యకూడదు. 'లాల్చీ'లంటే తన కిష్టమేమో ... ఎలా చెప్పగలం? ... పెద్ద మనిషిలా కన్పించటం కోసమని ఎందుకనుకోవాలి...పోయిన దసరా శెలవులప్పుడు మీ ఇంటి ప్రసాద్...తన రాజకీయాలూ చరిత్రా ఎలా గొప్పవో నీతో వాదించాడు ... ఆ మాట్లాడిన విధానం నేను శ్రద్ధగా గమనించాను...సునిశిత పరిహాసంతోకూడిన ఆ ముచ్చట్లూ—వ్యాఖ్యానాలూ నాకు కొత్తనిపించాయి...నేను మద్రాసులోఉన్నప్పుడు నా చుట్టూ తిరిగిన మిత్రులెవరికీ ఇలాటి అభిరుచులూ ఆసక్తులూ లేవు. అందుకనే విషయాలు తెలిసికొని విజ్ఞానం పెంపొందించుకోవాలనుకొంటున్నాను. అతని సహచర్యంలో నేనిప్పుడే మానసికంగా ఎదుగుతున్నాను. ప్రసాద్‌ను గూర్చి మీకు తెలియకనా?...ఏదో నానుంచి వినాలని...' అంటూ ఆమెకేసి చూసి దరహాసం చేశాడు.

ఆ కన్నుల కాంతిలో నిష్కల్మషమైన అతని హృదయం -- ఏదో నైరాశ్యం కనిపించింది. ఆ నైరాశ్యానికిగల కారణమేదో ఆమె స్త్రీహృదయం చప్పున అవగతం చేసికొంది— దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది. వెంటనే ఏమీ సమాధానమివ్వక కిటికీనుండి కనిపిస్తూన్న కొండల బారును చూసింది. ఆమె కళ్లలో ఎన్నోనాళ్ల క్రిందట మరుగున బడిపోయిన సంఘటన మెరసింది. ఆవేళ ఊర్మిళ వాళ్ళ ఇంటివద్ద జరిగిన విషయాలన్నీ కళ్లముందు కనిపించసాగాయి. ఆ నిస్సారమైన చూపు — వాడిపోయిన ముఖం—తన్ను వ్యథిత హృదయంతో క్షమాపణ కోరటం అన్నీ స్మృతిలో కదిలి గుండె తరుక్కుపోయింది. తన మాటలు తనకే కటువుగా వినిపించాయి. ఆ వేళ అంత కటువుగా సమాధానం చెప్పటం బాగు లేదని పశ్చాత్తాప పడసాగింది. కానీ తన పశ్చాత్తాపాన్ని ఏ విధంగా వ్యక్తపర్చుదామా — ఎలా మాట్లాడుదామా అని మాటలు వెతుక్కోసాగింది. ఓ నిముషమయ్యాక అతని కేసి తిరిగి.

'మీ కన్న నేను వయస్సులో చిన్నదాన్ని...ఎందుకూ మీరు—'అండీ' అని పిలుస్తారు...నా పేరు చివర 'గారూ' — 'గీరూ' తగిలించకండి.'...ప్రాధేయ పూర్వకంగా అడిగింది. ఆ కంఠం అతనికి కొత్తగా వినిపించింది.

'అయితే వాళ్ళూ అలానే లేనిపోని గౌరవాభిమానాలు కట్టిపెట్టి నన్ను మరింత దూరం చెయ్యకండి... 'ప్రసాద్'ను పిలిచినట్లే పిలవండి...ఒరేయ్—నీవూ మనం— అన్నమాటల్లో ఉన్న ఆత్మీయత గౌరవవాక్యాల్లో ఉండదు'... అని ప్రశాంతంగా అన్నాడు. మళ్ళీ వెంటనే ఏదో శంక కల్గినట్లు ఆమెకేసి చూశాడు. తన మాటలు ఎలా అర్థం చేసికొందోనని కళవళ పడుతూన్న ముఖంతో... 'దగ్గరిగా రావటమంటే ... మీకు మరింత సన్నిహితంగా వచ్చి...మళ్ళీ విసిగిస్తానని బాధపడకండి.. జరిగినవన్నీమరచిపోండి...ఆవేళ రాత్రి అది జరిగాక మళ్ళీ మీరు నా ముఖం చూస్తారనుకోలేదు ... కానీ ఉత్తమ సంస్కారం నీలో ఉంది కాబట్టి నన్ను క్షమించి నాతో మాట్లాడుతున్నావ్... అదే మళ్ళీ చెబుతున్నాను...ఆవేళ రాత్రి నాలో ఏ దుర్బుద్ధీ లేదు శారదా! ... నన్ను నమ్ము ... అదొక్కటే నిన్ను వేడుకొంటున్నాను...అంటే నేను సత్ప్రవర్తనుడనని నమ్మించటానికి ప్రయత్నించటం లేదు.'

ఆమె మాట్లాడాలని కోరుకొన్న అంశం అతని నోటి ద్వారా వెలువడటం విని ఆమె మనసు కొద్దిగా తేలికపడింది.

'అంతకు ముందు నీ కోసమై వెర్రిమొర్రి వేషాలు వెయ్యటం...ఫొటోలు తీస్తానని మీ ఇంటికి రావటం—ఇవన్నీ చూశాక నీకు నా పై అలాటి అభిప్రాయం ఏర్పడటం సహజమే...కానీ అలా ఎందుకు చేశానంటే నేను మద్రాసులో అనేక మంది అమ్మాయిలను చూశాను ... సినిమాలకనీ షికార్లకనీ విచ్చలవిడిగా తిరుగుతారు...వాళ్ళు నా స్నేహం కోసమై పరితపించి పొయ్యేవాళ్ళు. ఏదో ఒక వంకతో నన్ను పలకరించటానికి ప్రయత్నించేవాళ్ళు...వాళ్ల నా కొరిగించిందేమంటే — 'నేనొక మన్మథరూపుణ్ణని— స్థితిమంతుడననే' ఆత్మతృప్తి

శయం కల్పించారు...కానీ నా అందం ... సంపద ఏవీ నిన్ను నావైపు ఆకర్షించలేక పొయ్యాయి. నీ అంత మనోనిగ్రహమున్న 'స్త్రీ'ని నేను నా అనుభవంలో నిన్నే చూశాను. ఇదే నీ ప్రత్యేకత...నీలో శారీరక సౌందర్యమూ — మానసిక సౌందర్యమూ రెండూ మూర్తీభవించాయి ... అలాటిది నూటికి కోటికి ఎక్కడో కనిపిస్తుంది...' కొద్దిసేపాగి...'స్త్రీపట్ల నాలో కొత్త వైఖరిని కలిగించావ్...ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే... నేను మళ్ళీ సన్నిహితత్వం వలన నీకే ద్రోహమూ చెయ్యను ... లోగడ అనేకసార్లు—ఎప్పుడైనా ఒంటరిగా కలిసికొని క్షమాపణ చెప్పుకోవాలను కొన్నాను... కానీ ఆలాటి అవకాశం నీవు నాకు కల్పించలేదు'

కంఠంలో అగాధమైన స్నేహమూ — ప్రేమా నింపుకొని ఉద్వేగరహితమైన నిర్మలమైన చూపుంతో అన్నాడు. గుండెలపై పేరుకొన్న భారం దిగిపోయినట్లు నిట్టూర్చాడు.

ఆమె ముఖంలోగానీ...కళ్లలోగానీ కదలిక అనేదిలేదు. ఎలా చూస్తున్న ఆమె అలాగే చూస్తుండి పోయింది. గాలి జోరుగా వీచి ఆమె ముంగురులను కదిలించసాగింది.

అతను మాటలాపి అప్రయత్నంగా అతని చేతిలోనున్న పుస్తకంలోకి తలవంచుకొన్నాడు.

అతని మానసిన ప్రవృత్తులను చూసి ఆమె దిగ్భ్రమచెంది శిలాప్రతిమలా కూర్చుండిపోయింది ఒకే భంగిమలో. క్షణమయ్యాక తేరుకొంది.

తనకోసం తపించిపోయి — తన కటాక్ష వీక్షణాలకై తహతహలాడిన ఆరాధకుడు ఇప్పుడీ విధంగా తన మార్గంనుండి శాశ్వతంగా తొలగిపోవటం ఆమెకేదో వెలితిగా కనిపించినా అతను తన హృదయసౌందర్యాన్ని గూర్చిచేసిన ప్రశంసతో కొద్దికాలం మైమరచిపోయింది. కన్నుల్లో గర్వం తళుక్కుమంది కాని తన సమక్షంలో తననలా పొగడటం ఎవ్వంత సిగ్గును కలిగించింది. సిగ్గుతో ముడుచుకుపోయింది మాటా పలుకూలేకుండ. ఆవహించిన నిశ్శబ్దత ఆమెను ఇబ్బందిపెట్టసాగింది.

'ఇన్నాళ్ళలా నీవు మా ఇంటికి రావటం లేదు...ఇందుకేనా?' ఆమె కళ్ళలో ఏదో మృదులభావం తొంగిచూసింది.

శారదలాటి స్త్రీ ఈ ప్రశ్న అడుగుతుందని అతను ఊహించలేదు. ఆమె కేవలం, తనను పరిహసించటానికో లేక ఉడికించటానికో అన్నదని భావించాడు. తను కూడ పరిహాస పూర్వకంగా సమాధానం చెప్పాలని సంకల్పించుకొని,

'అది నీ ఇల్లు కాదుగా!...అందుకని...' అన్నాడు.

'నీ ఇంటికొస్తే సన్మానంగా ఆదరిస్తారు మీరూ?' ... ఆమె భవిష్యత్ జీవితాన్ని ఊహించుకొని అతను అలా అడగటం ఆమెకు ఆశ్చర్యమనిపించింది—అతని మనసును కలతపెడ్తున్న విషయం తెలిసికోటానికి కుతూహలపడసాగింది 'మీరు' శబ్దం అతను ఎవరినుద్దేశించి పలికాడో కూడ గ్రహించి ఏదో సమాధానం చెప్ప



పోయింది.

అలనే మళ్ళీ అన్నాడు.

'అప్పుడు మీకు పిల్లలూ ... సంసారమూ ... ఆ గొడవలోపడి అప్పటికి నన్ను మరిచిపోతారు కదూ?' ... ఏదో నైరాశ్యం అతని కంఠాన్ని చుట్టివేసింది. ఎటో చూస్తూ అన్నాడు. ఎన్నో రోజులుగా మనసులో బలవంతంగా అణచుకొన్న భావాలు హృదయాన్ని ఛేదించుకొని ఒక్కొక్కటే బయటికి రాసాగింది.

'ఎప్పుడెప్పుడో జరగబొయ్యే విషయాన్ని గూర్చి ఇప్పుడే నేనెలా చెప్పను?'

'ఆమాటా నిజమే ... ఏమిటో పాడు మనసు...అలాగే కోరుకొంటుంది శారదా!...' మళ్ళీ కొండలవైపు చూస్తూ...'ఎవరినీ ఎక్కువగా ప్రేమించకూడదు. దానివలన దుఃఖమే మిగులుతుంది మనకు'...... అన్నాడు.

ఆమె సాన్నిధ్యంలో అతని మనసు ఏవేవో రానున్న భావికాలపు అనిశ్చిత విషయాలలో పయనించి దిగులుపడసాగింది.

'ఇప్పుడు నీకు అలా అనిపిస్తుంది కానీ రేపు నీకు పెళ్ళయితే ఊర్మిళ గిరి గీసి గీటులో కూర్చోబెడుతుంది— 'సిట్' అంటే 'సిట్' -- 'స్టాండ్' ... అంటే 'స్టాండ్'. నీవు మా ఇంటికి రావటం — మా ఆతిధ్యాల్ని స్వీకరించటం అన్నీ కబుర్లు' ఆవహించిన వాతావరణాన్ని ఉల్లాసపరచటంకోసమే ఆమె తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో అంది.

అతనిముఖంలో మార్పు కనిపించింది. పాలిపోయినట్లు తెల్లబడింది.

'నేను ఊర్మిళను చేసికొంటానని నీకెవరు చెప్పారు?'... కనుబొమలు పైకెత్తుకొని తన అయిష్టతను ముఖంపై తెచ్చుకొని అడిగాడు.

'ఒకళ్ళు చెప్పేదేమిటీ...ఊళ్ళో అందరికీ తెలుసు.

'అబ్బబ్బ...వీళ్ళతో వచ్చినచిక్కే ఇది... వరసయితే చాలు..ముడిపెట్టికూర్చుంటారు. ...ఆపిల్లకు లేనిపోని ఆశలు కల్పిస్తారు పనికిమాలినవాళ్ళు...వాళ్ళలా నీవూ మాట్లాడకు శారదా!... అది అసంభవం ... నేను ప్రేమించలేని అమ్మాయినిచేసికొని నాతోపాటు దాన్నిదుఃఖపెట్టడం నాకిష్టంలేదు...' అంటూ ఆగిపోయి ఆ నల్లజాజుల తీగెకేసి తీవ్రంగా చూశాడు. అతని ముఖంలో సంతోషరేఖలు కనిపించాయి.

'దానిది వెన్నలాటి మనసు... కపటమూ లేదు.. కల్మషమూలేదు ... ఎవరు దొరుకుతారో ఏమిటో?...నేను తనకొక చక్కని భర్తను వెతుకుతాను ... మంచి సంస్కార హృదయం కలవాణ్ణి' ... ఏదో ఉదాత్తమైన కార్యం తాను ముందు ముందు జరుపబోతున్నట్లు ఆనందపడసాగాడు.

'మరి ఎవరిని పెళ్ళి చేసికొందామనీ'... ఆమె సూటిగా ప్రశ్నించింది. అతను వెంటనే సమాధానం చెప్పకుండ అలానే చూశాడు ఆమెకేసి. అతనికళ్ళలో మాటలు కనిపించాయి. మళ్ళీ అవి చెరగిపోయి కన్నీళ్ళు కనిపించాయి. గిరుక కన్నీరు తిరిగి రెండు అశ్రుబిందువులు కనుకొలకులలో నిలిచాయి.

'ఇంకా నన్ను చిత్రవధ చెయ్యకు శారదా! ...జీవితంలో ముఖ్యమైన నిర్ణయాలన్నీ తీసికొన్నాను ... ఎవరినీ చేసికోను ... జీవితమంతా ఇలానే ఉండిపోతాను ...' అంటూ ముఖం ప్రక్కకు తిప్పుకొన్నాడు. తనలో చెలరేగుతూన్న భావాలను నిగ్రహించుకొంటూ... పెదవులు తడిచేసికొని మళ్ళీ అన్నాడు.

'నేను...మీకొడుకుని పెంచుకొంటాను... ఊర్మిళ కూతురుతో పెళ్ళి చేస్తాను. నా తరువాత ఈ మేడలో మనమే ప్రతిబింబంగా వాళ్ళు నా కళ్ళముందు తిరుగుతారు. అదే నాకోరిక...అదే నాకు మిగిలే సంతోషం...'అతనికంఠం రుద్ధమైపోయింది ...గత మూడునెలలనుండీ తన ఊహాప్రపంచంలో కల్పించుకొన్న అల్లిబిల్లి ఆలోచనలన్నీ ఆమెముందు వెళ్ళబోసికోవటంలో తన మనోనిబ్బరం చూపలేకపోయ్యాడు.

'మధూ ... ఎందుకు? ... అలా అయిపొయ్యావ్? ... ఏడవకు,' అంటూ లేచి ముందుకొంగి అతని కన్నీళ్ళు తుడిచింది. అతను చిన్నపిల్లవానిలా ఏడుస్తూ ఆమె చీరెలోముఖం దాచుకొన్నాడు. అతని స్పర్శ ఆమె నరనరాలను జివ్వుమనిపించింది. నూత్న యవ్వనపు పొంగుతో సతమతమైపోయి కన్నీళ్ళతో తడిసిన ఆతని ముఖాన్ని తన హృదయంమీదికి లాక్కుని అతని తలని నిమురసాగింది. అవ్యక్తమైన అనిర్వచనీయమైన అనుభూతి కల్గింది. ఆమె హృదయంలో నిగూఢంగా దాచుకొన్న ప్రేమానురాగాలు—స్త్రీత్వం పెల్లుబికాయి.

'మనిద్దరమూ ఒకేలా బాధ పడుతున్నాం మధూ!...నీవు నావాడవుకాదని నేను నిన్ను దూరంచేసికొంటున్నాను...ప్రసాద్ అంటే నాకు చాలాఇష్టమని దూరమైపొయ్యావు కదూ?' ... మరింత గాఢంగా అతనిని





జయప్రదమైన జీవితానికి చెక్కు: చిత్రవర్ణాలతో నేయబడి, మిరుమిట్లుగొలిపే చెక్కు. చమత్కారంగా, ఆకర్షణీయంగా ఉండి ప్రశ్నలను కురిపిస్తాయి. తెగువతోకూడిన తీరు, ధైర్యంగా, సాహసంతో, ధరించి బయలువెళ్ళండి. మీవంటి వారు ఇటువంటి చెక్కును ధరించి వెళ్ళుతుంటే మిమ్ములను వెంటాడే చూపులను, మెప్పులను ఊహించుకోండి!

**మఫత్‌లాల్ గ్రూప్**
**పాప్లిన్‌లు మరియు షర్టింగులు**




2X2 టెరీన్/కాటన్, ప్రింటెడ్, టెరిలైట్, మాపినైజ్ మరియు స్త్రైప్ క్వాలిటీ

న్యూ కోరక్ (కోరక్) అహమదాబాద • న్యూశోరక్, నడియాద్ • స్టాండర్డ్, బొంబాయి • స్టాండర్డ్ (న్యూ చైనా) బొంబాయి • స్టాండర్డ్ డేవాన్ • సాసూన్, బొంబాయి • సాసూన్ (న్యూ యూనియన్) బొంబాయి • సూరత్ కాటన్, సూరత్ • మఫత్‌లాల్ ఫైన్, నవసారి • మిహిర్ టెక్స్‌టైల్స్, అహమదాబాదు.

APE-Aiyars M. 192 TL

---

# బెణుకులా లేక కండరములు నొప్పా?

లోనికి 'ఐయొడెక్స్'ను రుద్దండి. నొప్పిని తుడిచి వేయండి

'ఐయొడెక్స్' లేక బాధ పడవద్దు. చాల వేగముగా స్వస్థపరచునట్టి, 'ఐయొడెక్స్' త్వరితముగా లోన ప్రవేశించి బాధనుండి 'ఐయొడెక్స్' వెంటనే దూరపర్చును. ఎల్లప్పుడు ఐయొడెక్స్‌ను చేతికి దగ్గరలో యుంచి అపాయముల నుండి దూరము కండి.

'ఐయొడెక్స్' అనువైన క్రొత్త ట్యూబ్ పేకెట్లలో యిప్పుడు లభించుచున్నది.

IODEX
c METHYL SALICYL

IODEX® cum Methyl Salicylate

**ఐయొడెక్స్®**

స్మిత్ క్లైన్ & ఫ్రెంచ్ (ఇండియా) లిమిటెడ్, బొంబాయి—1
(ఇంగ్లాండులో స్థాపితమై కొంతవరకే బాధ్యతగల సంస్థ)

SK&F

ULKA IOD-2A TEL

# మట్టిబొమ్మలు

హత్తుకొంది.

'నీవు...నన్ను... పిచ్చివాణ్ని చేశావ్!'... తన కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

ఆ కళ్లలో ఏదో ఉన్మత్త దృష్టి కనిపించింది. ఆమె సర్వాంగాలు పులకితమయ్యాయి.

'నీ హృదయం నాకు తెలుసు... నాకోసం వ్యధపడి జ్వరం తెచ్చుకొని అలానే మద్రాసు వెళ్లావ్...నేను ఆవేళ ఎంత బాధపడ్డానో తెలుసా?'... లాలిస్తూ అతని కళ్లలోకి అనునయంగా చూసింది.

మెట్లపై ఎవరిదో అడుగుల చప్పుడు వినిపించింది. తలుపులు బార్లగా తెరచి ఉన్నాయ్ తన నడుం చుట్టూ పెనవేసికొన్న అతని చేతిని గభాలున విడిపించుకొని తిరిగి తన కుర్చీలో కూర్చొని పుస్తకం కళ్లముందు పెట్టుకొంది.

* * *

నెల పొడిచింది.

నీలాకాశంలో చుక్కలు అక్కడక్కడ మిణుకు మిణుకు మంటున్నాయి. వీధుల్లో పంచాయితీ దీపాలు పొగరాజుకొని ఆరిపోతున్నాయి. బజార్లో దుమ్మునంతా పోగుచేసి ఇళ్లమీగ -- బజార్లో నడిచే జనం మీద పోస్తోంది గాలి.

తుండుగుడ్డలు మీదవేసికొని పొన్నుగర్రలు చేతబట్టి, పొగాకు పాయపొరలు తీసికొంటూ ఒకరి కోసం మరొకరు తేకతేసుకొంటూ వీధుల్లో పోగవుతున్నారు ఆ ఊళ్లో పెద్దలనే వాళ్ళందరూ. వాళ్ల సమాలోచనలూ--తీర్మానాలూ, నిర్ణయాలూ తెలిసికోటానికి అవసరమైతే సలహా ఇవ్వటానికి కుర్రకారు కూడ కదలిపోతున్నారు.

అందరూ ఆ ఉత్తరపు వీధి రాముల వారి గుడిపై చేరారు.

చెక్కిన రాతిస్తంభాలతో నిర్మితమై చర్చలకూ సమావేశాలకూ సువిశాలంగా ఉంది. పై పంచలతో నాపరాళ్ళపై దుమ్ము చెదరగొట్టి మేనులు వాల్చారు కొందరు. ఉమ్మి వేసికోటానికి వీలుగా అరుగుల అంచులపై కూలబడ్డారు కొందరు—మసకమసగ్గా ముఖాలు కనిపిస్తున్నాయి. చుట్టపొగ వెనక్కి పీల్చినప్పుడల్లా చుట్టకొనలు ఎర్రగా మండుతున్నాయ్.

'ఆ రేడియో... వివరింటున్నట్టురా ...' కట్టేయమని చెప్పండ్రా' ఒక ముసలి గొంతు వినుకొంది -- గుడి స్తంభానికి కట్టిన 'లౌడ్‌స్పీకర్' నుద్దేశించి

'ఉండనియ్యి— ఉండనియ్యి—పంచాయితీ బోర్డుకు పన్నుగట్టటంలా?' ... ఇన్నవాడు ఇంటాడు ... లేకపోతేలేదు ... శివరామయ్య వచ్చిందాకా ఉండనియ్యి...కాస్త సందడిగా ఉంది'... సంజాయిషీ చెప్పింది మరో యువకంఠం.

వాల్గయిదు జతల చెప్పులు పెద్దగా శబ్దం చేసికొంటూ ఆ ఆలయపు అరుగు లెక్కాయి. 'శివరామయ్యకదూ ఆమడిగి' అని అక్కడివాళ్ళు దృష్టి సారించి అనటం అవతలవాళ్ళు చెప్పులు విడిచి వాళ్ళమధ్యకు రావటం ఒక్కసారే జరిగిపోయ్యాయి.

'అందరూ వచ్చినట్టేనా ... కోటయ్యా మావా'...శివరామయ్య గొంతు వినిపించింది.

'అందరెందు కొత్తారూ...ఈ ఓట్లూ... నెంబరు వేసి ఇయ్యన్నీ కూటిగా — గుడ్డకా... ఎవడో ఒకడు ప్రెసిడెంటయ్యే దానికి...ఏందో మీటింగుసేత్తామని పిలిపిత్రి ... కానియ్యండి మరి ... నిద్రబొయ్యే యీాలి... వేకువజామున లేసి మట్టి దోలుకోవాల్సినోళ్ళు కూడా ఉన్నారు...' చెబుతూ చెబుతూ ఆవులించాడు కోటయ్య తలగోక్కొంటూ.

'పంతులుగారొచ్చారా?' ... కూర్చుంటూ అన్నాడు శివరామయ్యగారు.

'ఆ ... ఆయనమాట మరిసేపొయ్యా... అయన్ని రానివ్వండి ... లేకపోతే మళ్లీ యవ్వారం మొదటికొస్తుంది—నేనొచ్చేప్పుడు ఇంటికాడ కనుక్కొంటే... ఎల్లిపొయ్యాడని చెప్పింది చిన్నమ్మాయి ... మరియాడకెళ్లినట్టూ ... ఎవురొచ్చేది పంతులుగారేనా!... రండి...రండి...మాటలోనే వచ్చేత్తున్నారు...'

కామయ్యగారు 'మధు' — 'భాస్కర్'ల సమేతంగా వచ్చాడు.

శివరామయ్యగారులేచి దేవుడున్న గది వైపు—గర్భగుడికేసి నడిచాడు.

'ఇనుప చువ్వలగేటు వెనక ప్రతిష్ఠించిన దేవుడి విగ్రహాలు. రాతిలో చెక్కిన సీతారామ లక్ష్మణులు— వారిచెంత ప్రణమిల్లుతూన్న ఆంజనేయస్వామి—కొన ఊపిరితో కొట్టుకుంటూన్న ఆముదపు ప్రమిద దేవుళ్లముఖాలు

చూపటానికి ప్రయాసపడుతోంది. గబ్బిలాల కంపు—ఆముదపు వాసనతో కలిసి గుప్పు మంటోంది.

నల్లగా, నూనెపూసికొని నొసట ఎఱ్ఱ రంగు నామాలుదిద్దుకొన్న దేవుళ్ళ బొమ్మల కేసి చూసి శివరామయ్య లెంపలువేసికొని దణ్ణంపెట్టాడు.

'ఈ పంచాయితీ రాజ్యపాలనను గూర్చి బాపూజీ ఎన్నో కలలుకన్నారు - వారి కలలను మన ప్రధాని' ... వినేవాళ్ళ ప్రమేయం లేకుండ స్పీకర్ వాగుతోంది.

వారి మధ్య భయంకరమైన నిశ్శబ్దత ఆవహించింది. రెండు ముఠాల్లాగు రెండు అరుగులమీద — మెట్లకు అటూ ఇటూ ఎదురెదురుగా కూర్చున్నారు. ఆ రెండు అరుగుల మధ్యనున్న మంటపం దిమ్మెమీద కామయ్య మాష్టారు కూర్చున్నాడు.

పెదవులు విప్పటానికి సందేహిస్తూ ఎవరికి వారే నిళ్ళు నములసాగారు.

'కానియ్యండి'... అవతలి వాళ్ళు.

'మీరు కానియ్యండి'...ఇవతలి వాళ్ళు.

'మీరు— మీరనుకోవటమెందుకూ — ముసుగులో గుద్దులాట ... పంతులుగారూ మీరు మొదలెట్టండి'...కోటయ్య అన్నాడు.

'మొదలు పెట్టటానికేముంది? - మనం మనం పోయినసారి అనుకొన్నట్లే గత ఎన్నికల్లో తీర్మానం చేసుకొన్నప్రకారం ఈసారి ప్రెసిడెంటు పదవి ఎవరికి చెందాలో వాళ్ళకే చెందుతుంది...ఈ సారి అధ్యక్షపదవి చిన్నముఠాకివ్వాలని — వెంకట్రామయ్యగారు బ్రతికుండగా మనం నిర్ణయించిన సంగతి అందరికీ తెలుసు — ఏమంటారు శివరామయ్య గారూ?... ఇప్పుడు ఆ మాటప్రకారం మనం ఎటువంటి మనస్పర్థలూ లేకుండా ఏకగ్రీవంగా ఒకర్ని ఎన్నుకొంటే బాగుంటుంది'...

ఒక్క నిముషంపాటు పంచలనం ప్రారంభమై మళ్ళీ సద్దుమణిగిపోయింది.

'ఆ రోజులు వేరులెండి . వెంకట్రామయ్య గారు బతికుండగా అనుకొన్న మాట నిజమే. కాని ఇప్పుడా మాటప్రకారం నిలబడాలని ఎక్కడుందీ?... ఎందుకంటే ఆ మెంబర్లు వేరూ?... ఈ మెంబర్లు వేరూ'... శివరామయ్య కుడివైపున కూర్చున్న ఆసామి అన్నాడు.

'ఇక మీరు అంత అడ్డసుడిగా మాట్లాడితే ఇక యవ్వారమేముందీ ... పోయినసారి వెంకట్రామయ్యగారున్నప్పుడు ప్రెసిడెంటు పని మీకే ఇచ్చాంగదా ఆయనమాట మీద గవురం కొద్దీ... నిన్నటిదాకా శివరామయ్యగారు ప్రెసిడెంటు గిరీ చెలాయిస్తూనే ఉండె...మరి ఇప్పుడు న్యాయప్రకారం 'మేం చెయ్యాల్సిందేగా'...అవతలగా కూర్చున్న గుంపులోనుండి ఒక పెద్దమనిషి గొంతును అదుపులోకి తెచ్చుకోటానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

'ఇప్పుడు ప్రెసిడెంటు మాకే కావాలని మేముమాత్రం పట్టుబట్టామా?...'అసలు ఉరువుశాల్తే దొరక్క మేం ఆలోసిస్తుంటే... తెలిసిందా?...అసలు నేనుంటానని ఊళ్ళో పనులుచేపిస్తానని ముందుకొచ్చే నాధుడేడీ'... అర్ధోక్తిలో అన్నాడు శివరామయ్య.

అందరూ ఒకళ్ళముఖాలొకరు చూసికొన్నారు. గడ్డివెన్నల్లో ఎవరిభావాలూ ఎవరూ పసికట్టలేకపోయ్యారు.

అవతలనుండి సమాధాన మొచ్చింది! 'అయితే శివరామయ్యగారూ మీ ముఠానుండి ఎవర్ని పోటీపెట్టటంలేదా?... మీరిది తేల్చి చెప్పండి...తరువాత సంగతి ఆలోచిద్దాం'...

'పోటీ అనేమాటేలేదు. అర్థమయిందా? ఆముఠా ఈముఠా అనిచెప్పి రెండు పార్టీలున్నాయిని ఇప్పుడనుకోవటం పొరపాటనుకొంటాను...వెనక ఎప్పుడో అయిదారేళ్ల సంగతి అది ... ప్రస్తుతం మనం ఆలోచించాల్సినదేమిటంటే. ఊరుని పైకి తీసికు రావటానికి — నడుంకట్టి పనిచేసే వ్యక్తిని మనం ఈ మెంబర్లనుండి ఎన్నుకోవాలి... అది ముఖ్యం. ముఠా అంటే మళ్ళీ తగాదా లొస్తాయి' ... కొత్తగా రాజకీయాలలో అడుగుపెడుతున్న యువరాజకీయవేత్త ఒక డన్నాడు శివరామయ్యపార్టీ పక్షపాతంతో.

మాష్టారు అతనికేసి చూసి కొద్దిగా ఆవేశపడి మళ్ళీ నిభాయించుకొన్నాడు.

'అధికారం చేతికొస్తేనేగాని వ్యక్తియొక్క శక్తి సామర్థ్యాలు తెలిసికొనే అవకాశముండదు. అటువంటప్పుడు ఏలావ్యక్తి ఈ పదవికి అర్హుడని ముందుగా ఎలా నిర్ణయించటం'...

'ఆరేడియో కట్టెయ్యండ్రా!'...'ఊరది చెవుకాడ పోతిగలా' ... పొలికొన్నాడు ఎవరో.

'అదికాదు ప్రసాదుగారూ'...మీరు చెప్పిన మాట నిజమే ... ఊళ్లోని పనులు నిర్వహించటానికి కేవలం ఉత్సాహం, సామర్థ్యం ఉంటేనేకాదుగా... ఆర్థికపరిస్థితులు కూడ చూసుకోవాలిగా'... ఇందాకటి శివరామయ్య పక్షపాతి మళ్ళీ అన్నాడు.

'ఇక పోదాం పదండి ... రంగు తేలి పోయింది ... ' అవతల అరుగుమీదనుండి ఒకడు లేచాడు.

(ఇంకా ఉంది)



# వారఫలం

## 28-7-1967 శుక్రవారం మొదలు 3-8-1967 గురువారం వరకు.

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదంఉంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**మిధునం:** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలించగలవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుం. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం:** ఆదాయం మాట యెలాగఉన్నా అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణించగలదు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**సింహం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**కన్య:** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. వ్యాపారంలో ప్రముఖులతో పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనిపించిన అనుకూలత ఆఖరువరకు నిలవదు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. వారం మధ్యలో అనుకోని చికాకులకు గురికాగలరు. ఉద్యోగంలో యెవర్నీ విశేషంగా నమ్మడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతికూలత ఏర్పడుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగాఉంటాయి. బంధుమిత్రులనుకల్సుకొంటారు.

**వృశ్చికం:** వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాంఘిక వ్యవహారాల్లో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. పోటీ వారితో మాట పట్టింపులు తగవు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు:** మీకు ముస్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. వ్యాపారంలో కొత్త వారి పోటీని ఎదుర్కోవలసివస్తుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంద. రాజకీయ వ్యవహారాలు బాగా ఉండవు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం:** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. వారం మధ్యలో నూతన వ్యవహారాలు లాభించగలవు. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలించగలదు.

**కుంభం** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో మీ కృషిని అధికారులు గుర్తించగలరు. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం:** భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుం. మిత్రులకుసహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగ ఉంటుంది.సంతోషకరమైన వార్తలను వింటారు.

—మహేష్

# మరణం: కొన్ని సమస్యలు!

మీకు చిరంజీవిగా ఉండాలని ఉందా? మరొక 100 సంవత్సరాలలో మనుష్యులకి ఇది వీలవుతుందేమో!

ప్రమాదంలో పోతే తప్ప వార్ధక్యంవల్ల చావు రాకుండా ఏర్పాటుచేసే పరిశోధనలు జరుగుతున్నాయి. అసలు మానవులకి ముసలితనం ఎందుకు వస్తుంది? — ఈ ప్రశ్నకి జవాబు దొరికితే చాలు. మరణాన్ని సాధించవచ్చు. కాని, సాంఘిక సమస్యలు ఎన్నో వస్తాయి.

## 'సాల్క్'లో పరిశోధనలు

కాలిఫోర్నియాలోని 'సాల్క్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ బయోలాజికల్ స్టడీస్'లో ఇద్దరు శాస్త్రజ్ఞులు కొన్ని పరిశోధనలు జరుపుతున్నారు. వారిపేర్లు — డా. ఆగస్టస్ బి. కిన్జెల్ (సంయుసంస్థ అధిపతి), డా. లెస్లీ ఆర్గెల్.

'వచ్చే 100 సంవత్సరాలలో ప్రమాదం వల్ల ఏర్పడే చావులనితప్ప అన్నిటినీ సాధిస్తాము,' అంటాడు డా. కెన్జెల్. 'ముందు బాంబుపేలి చచ్చిపోతామేమోగాని దీనివల్ల వచ్చే సమస్యలని గురించి ఆలోచించండి. అనుమతిలేకుండా జన్మకారకు లయిన వారికి హత్యానేరానికి వేసేటంత పెద్ద శిక్షవెయ్యవలసివస్తుందేమో!'

మరొక 15 ఏళ్లలో 65 ఏళ్లవారు 45 ఏళ్ల వారంత చురుకుగా ఉంటారేమో.

## మాత్ర

పదిసంవత్సరాలలో ఏ రకం బిడ్డ కావలిస్తే ఆరకం బిడ్డ పుట్టేందుకు కావలసినమాత్ర కనిపెడ్తారు. మగబిడ్డ కావలిస్తే ఒకమాత్ర, ఆడపిల్ల కావలిస్తే మరొకమాత్ర!' అన్నారు కిన్జెల్.

'అందరూ 2 మగపిల్లలూ 1 ఆడపిల్లా కావాలని కోరుకుంటే ఏమి చేస్తాము? ఈ రకం విజ్ఞానం అసలు బయటపెట్టడం మంచిదా' అని ఆయనే ప్రశ్నిస్తారు:

వార్ధక్యం గురించి డా. ఆర్గెల్ చాలా పరిశోధనలు చేశారు. జీవ సృష్టి గురించి ఆయన సిద్ధాంతం ఒకటి ఉంది. దీనిని 'ఎర్రర్ ఎక్స్‌ప్లనేషన్' (లేక 'తప్పు కారణం' సిద్ధాంతం) అంటారు. దీని ప్రకారం జీవం కల ప్రతి పద్ధతిలోనూ (గడియారాలలో వలెనే) తప్పులు జరగవచ్చు: ప్రాణి మొదట ఒక బీజంగా లేక అండంగా ప్రారంభం అవుతుంది. ఈ అండం 'ప్రొటీన్' (మాంస కృతి) నిర్మాణం వల్ల పెరుగుంది. ఇది ఒక పద్ధతి ప్రకారం జరుగుతుంది. ఎన్నో ప్రొటీన్‌లు తయారు కావాలి. ఈ కార్యక్రమంలో పొరపాటు వస్తే? అసలు వృద్ధి కుంటుపడిపోయి వార్ధక్యం వచ్చి చివరికి మరణం వస్తుంది!

కొత్త ప్రొటీన్‌లు పాతవాటినే పోలి ఉండాలి. వాటి నిర్మాణంలో చిన్నచిన్న మార్పులు క్రమంగా పెద్ద 'ప్రమాదా'నికి దారి తియ్యవచ్చు. ఈ పద్ధతి రహస్యాన్ని భేదించగలిగితే ముసలితనం రహస్యం భేదించవచ్చునేమో! జబ్బుకీ, దానికీ కూడా సంబంధం ఉండవచ్చు.

శరీరంలో కొన్ని అంగాలలో జీవకణాల బదులు కొత్త కణాలు వాడటానికి వీలు కాదు — ఉదాహరణకి మెదడు. పయి సిద్ధాంతానికీ ఈ విషయానికి సంబంధం ఉండవచ్చు!

పరిశోధనలు ఇంకా జరుగుతూనే ఉన్నాయి.

(ఇన్‌ఫా)

అల్లాటప్పయ్య



గత దశాబ్దంనుంచి మద్రాసునగరం పారిశ్రామికంగా బాగా ముందడుగు వేస్తూవుంది. వ్యాపార వాణిజ్యాలకి కేంద్రంగా తయారవుతున్న నగరం, దేశం నలుమూలల ప్రజల్ని ఆకర్షిస్తోంది. ఈ అభివృద్ధి నగరనిర్మాణంలో మాత్రం లేదు. మురికివాడలు పెరుగుతున్నాయి, అడ్డూ అదుపూ లేకుండా ఎక్కడబడితే అక్కడ గుడిసెలూ లేస్తున్నాయి.

నగరంలో వుంటున్న ప్రతి అయిదుగురికీ ఒకరు గుడిసెల్లో నివసిస్తున్నారని ఒక అంచనా! గుడిసెల్లో వుంటున్న వారంతా నిరుపేదలు. రోజుకూలీ చేసుకుని ఆ పూట కాపూట పొట్టనింపుకుంటున్న తెగ. ఇందులో అధిక భాగం డి. యమ్. కె. పార్టీకి చెందినవారు.

జులై మొదటివారంలో మద్రాసు నగరం అట్టుడికినట్లు ఉడికిపోయింది. ప్రజాజీవితం దాదాపు స్తంభించినంత పనయింది. ముఖ్యంగా నగరంలోని దక్షిణ ప్రాంతంలోని ప్రజలు ఏ సమయంలో ఏ ఇల్లు తగలబడుతుందోనని భయకంపితులై పోయారు. అన్నిటికంటె ఎక్కువగా శాంతిభద్రతలు కరువైపోయాయి. ప్రజలు ప్రాణాలు అరచేతిలో పెట్టుకు కూర్చున్నారు.

**అవకాశవాదులు**

అగ్నిప్రమాదాల్ని ఆసరాచేసుకుని కొన్ని దుష్టశక్తులు రేకెత్తిపోయాయి. కట్టుకథలు కావలసినన్ని. ఇంతదాన్ని అంతదానిగా చేసి ప్రజల్లో భయాన్ని రెచ్చగొట్టారు. **ఆత్మరక్షణ**దళం పేరుతో కత్తులు కటార్లు తీసుకుని విచ్చలవిడిగా తిరిగే ఆల్లరిమూకల ఆగడాలు మితిమీరిపోయాయి. దారిన నడవడానికి భయంవేసేది. కార్లలో వెళ్ళేవాళ్ళకే రక్షణ లేకపోయింది! గుడిసెలున్న ప్రాంతాల్లో కొత్తముఖాలు కనిపిస్తే చాలు చావబొట్టి చెవులుమూశారు. ఎంతోమంది అమాయకులు వీరి దుర్జన్య కాండలకు గురయ్యారు.

సెప్టెంబరు నెలలో దక్షిణ మద్రాసు నగరంలో లోక్ సభ స్థానానికి తిరిగి ఎన్నిక జరగవలసి వుంది. అందుకు కావలసిన సరంజామా తొందర తొందరగా ముగించేశారు. అందుచేత కొందర్ని లెక్కల్లోకి తీసుకోవడం జరగలేదు. ముఖ్యంగా గుడిసెల్లో ప్రజానీకాన్ని విస్మరించడం జరిగిందని కొందరు అభిప్రాయ పడుతున్నారు. దీనితో అగ్ని ప్రమాదాల్ని ముడివేయడం కూడా జరుగుతూవుంది. ఇది ఎంతవరకు నిజమో చెప్పలేము!

ప్రజల్లో అనేక రకాలైన దురభిప్రాయాలు తలెత్తాయి. పార్టీ వైషమ్యాలు మరోసారి విజృంభించాయి. వర్గవిభేదాలు నుళ్ళి చోటుచేసుకున్నాయి. వ్యక్తిగత వైమనస్యాలకి ఇంకోమారు అవకాశం చిక్కింది. అవకాశవాదులందరూ దీనిని వినియోగించుకో జూశారు!

## సంఘ విద్రోహులు ఎవరు?

దేవతకు అపచారం జరిగిందనీ, తత్ఫలితంగా అగ్నిప్రమాదాలు సంభవించాయని ఆదిలో భావించారు. అగ్నిదేవుడు మరో ప్రాంతాన్ని వరించేసరికి అదికాదు, పార్టీలు అన్నారు. వరసగా రోజు రోజూ జరగడంతో ఇవి సంఘవిద్రోహుల దుశ్చర్య లవి రూఢిగా నిర్ధారణకు వచ్చారు.

సంఘ విద్రోహులు ఎవరు? రకరకాల పుకార్లు బయలుదేరాయి. కాకీ బట్టల్లో వున్నవాళ్లు లారీలమీద వచ్చి ఇంటి కప్పులమీద 'పవుడర్' చల్లుతున్నారని, వారు వెళ్లిన కాస్సేపటికి

ఏటా గృహదహనాల రూపే[illegible] వుంది. జననష్టం, ధననష్టం, ఆస్తినష్[illegible] న్నారు. వీటివల్ల పేదవాళ్లకు జరుగు[illegible] ఇది కరువుకాలం. కాయకష్టం చేసి పోతే మళ్లీ నిద్రొక్కుకోవడానికి మద్రాసు నగరంలో జరిగిన 'ప్రమాదా[illegible] నిరాశ్రయులయ్యారు.



అభిరామపురంలో మురికిపేట పొగలూ

# ప్రమాదాలు

ప్రజలకి ఎంతో నష్టం కలుగుతూ . ఒకమేమిటి? సర్వమూ నష్టపోతు న్న అన్యాయం ఇంతాఅంతాకాదు. కూడబెట్టుకున్నదంతా మంటకలిసి ఎంతోకాలం పడుతుంది. ఇటీవల లో (?) 20,000 మంది సుమారుగా



పొగలూ ఆకాశానికి లేస్తున్న దృశ్యం.

ఆ ఇళ్లు అగ్నికి ఆహుతి అయిపో తున్నాయని కొందరు నమ్ముతున్నారు: ఖాకీబట్టల్తో వచ్చినా, లారీల్లోవచ్చినా, ఎలావచ్చినా ఈ దురంతాలు సంఘ విద్రోహుల వల్లనే జరిగాయన్నది ఖాయం. వాటివెనక ఒక 'ముఠా' తీవ్రంగా పనిచేస్తున్నది అన్నది చాలా మంది అభిప్రాయం. ఆ 'పవుడర్' పచ్చ భాస్వరం కావచ్చు. ఇతరమైన పదార్థం ఏదైనా కావొచ్చు!

'ఫలానా సమయంలో ఫలానాస్థలం పట్టణం శ్మశానం అయిపోతుంది కాసుకోండి!' అని ఆకాశరామన్నలు హెచ్చరించడం, ఆ తర్వాత అక్షరాలా జరిగితీరడం, ప్రజల నమ్మకాన్ని బలపరుస్తూ వుంది.

సమయానికి ఆదుకోకుండా ఫైరింజ న్లను తప్పుదోవలు పట్టించడం కూడా జరుగుతూ వుంది!

కాంగ్రెసువారు ఈ కాండకి కారణమని కొందరి అపోహ. 'మామీద నమ్మకం లేక పోతే విచారణ సంఘాన్ని నియమించి నిజం తెలుసుకోండి' అంటున్నది కమ్యూనిస్టు పార్టీ! ముస్లింలీగ్ కూడా నిర్దోషిగా తప్పు కుంది.

## పోలీసుశాఖ కర్తవ్యం

పోలీసుశాఖ చాలమందిని తమ నిర్బంధం లోకి తీసుకున్నది. అందులో కొంతమంది ఆడవాళ్లు కూడా ఉన్నారు. అనుమానితుల్ని స్వాధీనం చేసుకోవడం పోలీసుశాఖ కర్తవ్యం. నిజా నిజాలు ఎరిగి ద్రోహుల్ని గట్టిగా శిక్షించడానికి సాయపడడం వారి బాధ్యత. ప్రజలు వారికి ఎప్పుడూ సహకరిస్తూనే వుంటారు!

ఇక్కడ ఒక్కవిషయం మనం గుర్తుంచుకోవలసి వుంటుంది. బిచ్చగాళ్ల మీద దాడితో — అగ్నిప్రమాదాలు నివారణ కావు. రవుడీలయినంత మాత్రాన వారు ఇళ్లకు నిప్పుపెట్టాలని లేదు. అమాయకులను హింసించి నందువల్ల ప్రయోజనం ఏమీవుండదు. ఇటీవల ఒక రిటయిర్డ్ పోలీసుఆఫీసర్ని ఇంటర్వ్యూ చేసినప్పుడు, వారు కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు.

## నేడు మద్రాసులో. తర్వాత...?

సంఘ విద్రోహుల కారణంగా పేద ప్రజానీకం బ్రతుకులు కాలిపోతున్నాయి. ఇవ్వేళ గుడిసెలు తగులబడ్డాయి. రేపొద్దున్న మేడలూ, వాడలూ. ఆతర్వాత వూళ్లకు వూళ్లూ తగ్గవడానికి అవకాశం లేక పోలేదు!

క్రిందటి సంవత్సరం విజయవాడలోను, గుంటూరులోను జరిగిన గృహదహనాలు అందరికీ తెలిసినవేకదా! నేడు మద్రాసులో. తర్వాత...?

## లోగుట్టు

భారతదేశం పరిస్థితి ఇప్పుడు ఎంతో అస్థిమితంగా వుంది. ఏవైపున చూసినా అల్లకల్లోలంగా వుంది. ఘెరావోలంట్లూ బయలుదేరాయి. నక్సల్‌బరీ సమస్య గొంతుక మీదకు వచ్చింది. పార్టీల పరిస్థితిచూస్తే ఒకదానిపొడ మరొకదానికి గిట్టడంలేదు. వ్యక్తిగత విరోధాలు, అంతకుమించిన సమస్యలూ వుండనే వున్నాయి. ఒకవైపున పాకిస్తాను, మరోవైపున చైనా క్రూరంగా వోళ్లుతెరుచుకు కూర్చున్నాయి!

ఏ చిన్న అల్లరి జరిగినా, సమగ్రంగా పరిశీలించి, లోతుగా ఆలోచించి సత్వరచర్య తీసుకోవలసిన అగత్యం ఎంతయినా ఇప్పుడు మనకు కనిపిస్తూ వుంది. దేశక్షేమం దృష్ట్యా దేనినీ తేలికగా తీసుకోవడానికి వీలు లేదు. ఈ భయాన్ని అనేకమంది వ్యక్తపరిచారు. ప్రభుత్వం పూనుకుని ప్రజలకు అభయం ఇవ్వాలి.

సి. కనకాంబరరాజు ●

# సిగిరియ



సిగిరియ కొండ

సిగిరియా (కొండ) లోకప్రసిద్ధమయినది. దీని ఆకారం సింహాన్ని పోలి ఉంటుంది కాబట్టి (సింహగిరి) 'సిగిరియ' అయింది సింహళభాషలో. ఇది కొలంబోకి సుమారు 100 మయిళ్ల దూరంలో ఉంటుంది. ఎత్తు సుమారు 600 అడుగులు, పయికి ఎక్కటానికి మెట్లు ఉన్నాయి. మెట్లకి బయట వయిపు ఇనప కటకటాలు లేక పిట్టగోడ ఉంది.

ఇంత ఎత్తు ఉంది కాబట్టే దీనికి 'ఆకాశదుర్గమనీ'. 'సిలోన్ అజంతా' అనీ పేర్లువచ్చాయి. కొండమీద సుమారు నాలుగు ఎకరాల చదును ప్రదేశం ఉంది.

క్రీ. శ., అయిదవ శతాబ్దంలో సిలోన్‌ని (అనురాధపురంనుంచి) ధాతుసేనుడనే రాజు పాలించేవాడు. అతని కూతురిని మిగాకరముడనే నాయకుడికి ఇచ్చి పెళ్లిచేశారు. ఆమెని అత్తగారు తెగ హింసలుపెట్టేది. రాజుగారికి కోపం వచ్చి ఆమెని చంపివేశాడు. మిగాకరనుడికి తల్లి హత్య దుర్భరమయిపోయి రాజుగారి కొడుకులలో ఒకడయిన కాశ్యపుడి సహాయంతో మామగారిని చంపించివేశాడు. ధాతుసేనుడి వారసుడు మొగ్గల్లన్నుడికి భయంవేసి భారతదేశానికి పారిపోయాడు. అతను తిరిగివచ్చి పగతీర్చుకుంటాడని భయపడిన కాశ్యపుడుకూడా సిగిరియమీద కోట కట్టించి అక్కడ దాక్కున్నాడు. అక్కడనుంచి 18 సంవత్సరాలు పాలించాడు. రాజధాని అనూరాధపురంనుంచి సిగిరియాకి మార్చాడు.

క్రీ. శ. 497లో మొగ్గల్లన్నుడు సెయిన్యంతో తిరిగివచ్చి సిగిరియమీద దండెత్తాడు. పెద్ద యుద్ధం జరిగింది. కాశ్యపుడు ఓడిపోతానని భయపడి ఆత్మహత్య చేసుకున్నాడు. మొగ్గల్లన్నుడు సిగిరియనుంచి అనూరాధపురానికి మార్చివేశాడు రాజధానిని...

కొండ పయిభాగంలో కొన్ని కుడ్యచిత్రాలు ఉన్నాయి. ఇవి సుమారు 1500 ఏళ్లకిందవేసినవి. ఇవి అజంతా బొమ్మల లాగ ఉంటాయి.

ఈ రకం చిత్రకళ భారతదేశంనుంచి సింహళద్వీపానికి వెళ్లిందంటారు. అయితే అజంతాబొమ్మలు మతప్రచారానికి సంబంధించినవయితే సిగిరియ చిత్రాలు కేవలం అలంకరణకోసం వేసినవనిపిస్తాయి. వీటిలో వివిధభంగిమలలో కనిపించే స్త్రీలు కాశ్యపుడి అంతఃపురస్త్రీలేనని కొందరి అభిప్రాయం. మరికొందరు వీటిలో అప్సరసల బొమ్మలుకూడా ఉన్నాయని అనుకుంటారు. ముదురురంగులలో కనిపించే స్త్రీలు మేఘాలు, లేతరంగులలో కనిపించేవారు మెరుపులు అని సాంప్రదాయం. వారిచేతిలోని పద్మాలు పూజాపుష్పాలు.

కింద కట్టడాల శిధిలాలలో ఎన్నో శాసనాలు కపిస్తాయి. మొత్తం 685 ఉన్నాయట. పయిన చదును ప్రదేశంలో ఆశ్చర్యం కలిగించే నిర్మాణాల అవశేషాలు కనిపిస్తాయి.

సిగిరియ పక్కనే చిన్న కొండ మరొకటి ఉంది. ఇక్కడా కొన్ని చిత్రాలు ఉన్నాయి. కాని అవి ఇంత అందంగా ఉండవు. అయితే ఇక్కడ సుప్రసిద్ధమయిన 'కుమారు' (సుబ్రహ్మణ్యస్వామి)డి బొమ్మ ఒకటి ఉంది. సింహళంలో కుమారస్వామి కొండ మీది దేవుడు. ఈ కొండ మీద 20అడుగుల పొడుగు ఉన్న బుద్ధ విగ్రహం ఉంది. పడుకుని ఉన్న ఈ విగ్రహం చక్కగా ఉంటుంది.

ఈ శిధిలాలన్నిటినీ సింహళ ప్రభుత్వ పురాతన వస్తుశాఖ జాగ్రత్తగా చూసుకుంటుంది.

వ్యాసం, ఫొటోలు: ఎస్. రామకృష్ణ.



సిగిరియ కుడ్యచిత్రం

# తిరుగులేని నిశ్చయం

పాలడుగు
వెంకటేశ్వరరావు



'...ఆ అమ్మాయిని నీకిస్తారుట! చేసుకుంటావా? ఆ మధ్య మాటల సందర్భంలో మీ నాన్నతో అన్నాడట, అతను.' గుమ్మం ముందు కూర్చుని బియ్యంలో బెడ్డలు ఏరుతూవున్న పార్వతమ్మ చెప్పుకుపోతున్నది.

'నాకా...!?' కళ్ళు పెద్దవిచేసి చూశాడు రాధాకృష్ణ.

మరుక్షణం అతని కళ్ళు, కుర్చీలో బార చాపుకునివున్న తన కాళ్ళమీదికి పోయాయి. ఆ కాళ్ళు సన్నగా నిర్జీవంగా వేళ్ళాడిపోయి వున్నాయి. వాటినిచూచి కాసేపు జాలిపడుతూ వుండిపోయాడు రాధాకృష్ణ.

'అవునురా! ఏం? నీకేం తక్కువనీ? కాకపోతే మన అదృష్టం బాగులేక నీ కాళ్ళకి అట్లా అయింది. అవి తిరిగి తప్పకుండా బాగుపడతాయన్న ఆశ మీ నాన్నకీ, నాకూ వుంది.'

రాధాకృష్ణ మాట్లాడలేదు.

'డాక్టరుగారు చెప్పారట! ఏదో కొత్త మందు వచ్చిందట. అది మొదలు పెడతారట, వచ్చేనెలనుంచి. దేవుడు మేలుచేస్తే వొచ్చే ఏడాది ఈపాటికి నువ్వు మళ్ళీ శుభ్రంగా నడుస్తావు.'

రాధాకృష్ణకి ఆ మాటలమీద నమ్మకం పోయింది. రెండేళ్ళనుంచీ అనేకరకాల మందులు వాడారు. 'మర్దనా'లు చేసిచూశారు. 'కరెంటు'తో కూడా చికిత్సలు చేశారు. మద్రాసూ, హైదరాబాదులలో కూడా చాలా రోజులు వుండివచ్చారు

బాగవదని చెప్పినవాళ్ళు ఎవరూ లేరు. కాని బాగయే సూచనలే మృగ్యం.

'తన కాళ్ళవొంక చూస్తూ వుండిపోయాడు రాధాకృష్ణ. పొలంనుంచి వచ్చినట్టున్నాయి. దొడ్లో పశువుల అలికిడి అయింది. పార్వతమ్మ 'పాలేర్ని' కేకేసింది. వాటిని కట్టేసి 'కుడితి' పెట్టమని పురమాయించింది. దూడలు అరుస్తూ చెంగు చెంగున గంతులువేస్తున్నాయి, సాయం సంధ్యాసమయాన.

జాలిగా వాటి వంక చూస్తూ వుండిపోయాడు రాధాకృష్ణ.

రాధాకృష్ణ బి. ఏ. వరకూ చదివాడు. తల్లిదండ్రులకి వొక్కడే కొడుకు. అతని కంటె పెద్దదయిన ఆడపడుచువుంది. ఆమె సుఖంగా అత్తవారింట కాపురం చేసుకుంటూ వుంది.

'ఈ ఆలోచన అసలు మీకెందుకు కలిగిందమ్మా...?' చాలసేపయాక రాధాకృష్ణ నోటినుంచి ఆమాటలు వెలువడ్డాయి.

పార్వతమ్మ తలెత్తి కొడుకువంకే చూసింది, కళ్ళార్పకుండా. రాధాకృష్ణ భావం ఆమెకి అర్థమయింది.

'మనమేం అడగలేదు. అతనే అడిగాడట నాన్నగారిని. చూద్దామన్నారట, ఈయన.'

'ఆ అమ్మాయి అతనికేమవుతుందట? స్వంత చెల్లెలేనా?' రాధాకృష్ణ అడిగేడు.

'ఊహూఁ. తల్లీ తండ్రీ చిన్నప్పుడే పోయారట. అప్పట్నుంచి అతనే చేరదీసి పెంచాడట. దూరపు బంధుత్వం. వాళ్ళింట్లోనే పెరిగిందట!'

'ఊహూఁ'

పార్వతమ్మ లేచి లోపలికి వెళ్ళిపోయింది. బియ్యంచేట, లోపల పెట్టి ఆమె పాలుతియ్యటానికి దొడ్లోకి వెళ్ళింది.

రాధాకృష్ణ 'ప్రక్కాల బండి'లో కూర్చుని ఆలోచనలోపడ్డాడు.

రెండేళ్ళ క్రిందట తనూ అందరిలానే ఆడుతూపాడుతూ తిరిగాడు. భవిష్యత్తు మీద ఎన్నో ఆశలు. మనస్సునిండా ఆదర్శాలు. అందమయిన అమ్మాయిలను గురించి కలలూ కన్నాడు. వూహాసుందరిని వూహించుకుని ఎన్నో మేడలు కట్టుకున్నాడు. భవిష్యత్తు ఎంతో అందంగా కనపడింది.

బి. ఏ. పరీక్షలురాసి సెలవులకి తిరిగి వచ్చాడు, ఆ ఏడాది.

కాని......

రాగానే మంచాన పడ్డాడు. తీవ్రమైన జ్వరం వచ్చింది. పదిరోజులపాటు మూసిన కన్ను తెరవకుండా పడుండిపోయాడు. అందరూ ఎంతో ఆందోళన పడ్డారు. పట్నం నుంచి డాక్టరు వచ్చి చికిత్స చేశాడు.

జ్వరం తగ్గింది. వొంట్లో సత్తువ వచ్చింది; కొన్ని రోజులయాక.

రాధాకృష్ణ మామూలు మనిషయినట్టే గాని...

రెండు కాళ్ళూ పడిపోయాయి. ఎండిపోయిన తోటకూర కాడల్లా వాడిలి, సన్నగా, వ్రేళ్ళాడాయి, కాళ్ళు. పనికి రాకుండాపోయాయి అతన్ని అవిటివాడిని చేసి. రెండేళ్ళనుంచీ ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలితం శూన్యం.

అతని అవిటితనాన్ని ఎవరూ తీసెయ్యలేక పోయారు. వాస్తవాన్ని తరిచి చూసుకున్న రాధాకృష్ణ తన వూహాసుందరికి వీడ్కోలిచ్చాడు, 'గుడ్‌బై' చెప్పి. అతని వూహాసుందరి ఎక్కిన రైలు వెళ్ళిపోయింది. రాధాకృష్ణ ఎక్కలేక పోయాడు. నేలమీద, కిందనే కూర్చుండి వున్న అతని కాళ్ళు పని చెయ్యలేదు. రైలు వెళ్ళిపోయింది.

రాధాకృష్ణకి జీవితం మీద 'విరక్తి' కలగలేదుగాని, ఉదాసీనత కలగక తప్పలేదు. ఏమిటీ జీవితం? పగలు, రాత్రి—ఒక దాని వెంట ఒకటి దొర్లిపోతున్నాయి. జీవితం యాంత్రికంగా అనాకర్షణీయంగా గడిచిపోతున్నది. ఏ ఆశా లేదు. గుండెల్లో దాచుకున్న, గతానికి సంబంధించిన, మధుర స్మృతులే అతను నిలుపుకున్న ఆస్తి. తియ్యటి అనుభవాలే, అతను నిలుపుకున్నది.

వీధిలో నుండి కలకలం వినిపించింది.

పిల్లలు ఆడుకుంటూ వున్నారు.

ఆ అమ్మాయి, గుమ్మంలో నుంచుని వాళ్ళ ఆటల్ని చూస్తూ వుంది, అప్పుడప్పుడు అమాయికంగా నవ్వులు వెదజల్లుతూ. ఆ విషయం ఆ అమ్మాయికి తెలుసో...?

పెద్ద పెద్ద కన్నులు సన్నగా ముందుకు సాగిన సంపెంగ పూవువంటి ముక్కు. ఎర్రగా అందంగా ముడుచుకున్న పెదిమలు, నవ్వితే అందంగా సొట్టలుపడే బుగ్గలు. తాచుపాము వంటి నల్లటివాల్జడ.

ఆ అమ్మాయి కనులలో కలలు ప్రతిఫలిస్తున్నాయి! ఆ కలల్ని ఆవరించిన చీకటి తెరల్లా, కాటుక రేఖలు! ఆ అమ్మాయిని చాలా రోజుల్నించీ చూస్తున్నాడు రాధాకృష్ణ.

అంతలో, చటుక్కున ఆ అమ్మాయి లోపలికి వెళ్ళిపోయింది.

'అతనూ,' అతని భార్యా గుమ్మం ఎక్కుతున్నారు.

ఆర్నెల్ల క్రితం 'అతనికి' ఈ వూరు ట్రాన్స్‌ఫరయింది. 'బ్యాంకు'లో చిన్న ఉద్యోగమట! నలుగురు పిల్లలు. చాలీ చాలని జీతం. భార్యమాట జవదాటడని అంటారు. అక్కడికీ పల్లెటూరు గనుక ఎలాగో గడుపుకొస్తున్నారట!

రాధాకృష్ణకి అతను తెలుసు. ఒకటి రెండుసార్లు ఇంటికి వచ్చి అతను రాధాకృష్ణతో కూడా మాట్లాడాడు.

సన్నగా గాలికి పడిపోయేటట్టున్న శరీరం. అదుపులేకుండా ఎదిగి జీబుగా తయారయిన జుట్టు. గారపట్టిన పళ్ళు. పేదరికం అతని వేషంలోనూ మాటల్లోనూ కొట్టొచ్చినట్టు కనబడింది.

చాలా కలివిడిగా మాట్లాడాడు. సంసార బాధ్యతలు అతని నడుం వంచేయి. అతని భుజాలు కిందికి దిగినట్టనిపించింది రాధాకృష్ణకి.

తన కున్నబాధ్యతలకి తోడు ఆ అమ్మాయికూడా అతనికి మరింత భారంగా తయారయినట్టు అనిపించింది, అతనిమాటలవల్ల! అతనిపేరు సత్యమట!

సత్యమూ, అతనిభార్యా లోపలికివెళ్ళారు.

తిరిగి వీధిలో పిల్లలు గోలగా ఆడుకుంటున్నారు.

ఇంటిముందు బండి ఆగింది.

బండిలోంచి రామలక్ష్మి ఆమె భర్తా దిగారు.

ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు రాధాకృష్ణ.

రామలక్ష్మి చిరునవ్వు నవ్వుతూ లోపలికి వచ్చింది. వెనకే తోకల్లా చిట్టిగాడూ, బుజ్జీ.

'తమ్ముడూ! ఎట్లావున్నావురా?' గారాలా పలకరించింది రామలక్ష్మి.

'బాగానేవున్నానక్కా! బావేడి?' రాధాకృష్ణ ఆనందంగా అన్నాడు.

'వీధిలో నేస్తం కనబడితే మాట్లాడుతూ వుండిపోయారు. అమ్మేక్కడ?' అంటూ లోపలికి వెళ్ళింది రామలక్ష్మి పిల్లలతో.

మర్నాడు ఉదయంవరకూ వాళ్ళెందుకొచ్చిందీ అర్థంకాలేదు రాధాకృష్ణకి.

ఆరాత్రల్లా ఆ అమ్మాయిని గురించిన ఆలోచనలు రాధాకృష్ణని కలవరపరిచాయి. కళ్ళుమూసుకుని పడుకోవటానికి ప్రయత్నించినా నిద్దరరాలేదు.

తనేమిటో, తనపరిస్థితి ఏమిటో రాధాకృష్ణకి తెలుసు. గత్యంతరంలేక ఆ అమ్మాయిని ఎవరిచేతుల్లోనయినా పెట్టి బాధ్యత వొదుల్చుకోవాలని సత్యం తాపత్రయం. కొడుకు అవిటివాడయాడు. అమ్మాయి బాగానే ఉంటుంది. సంప్రదాయకమయిన కుటుంబం. కొడుకు ఒక ఇంటివాడయితే చాలునన్న తలిదండ్రుల ఆదుర్దా — ఎవరి తాపత్రయం వారిది.

కాని...తనేమిటో తన పరిస్థితేమిటో రాధాకృష్ణకి తెలుసు. చూస్తూ చూస్తూ ఆ అమ్మాయి గొంతు కొయ్యటం అన్యాయమనిపించింది రాధాకృష్ణకి. మనస్ఫూర్తిగా తనని పెళ్ళి చేసుకోవటానికి ఆ అమ్మాయి వొప్పుకుంటుందని నమ్మపెట్టుకోవటం ఆత్మవంచనే!

అందుకే,

ఆ నిర్ణయానికి వచ్చాడు రాధాకృష్ణ. రాత్రి నిద్ర పట్టేసరికి బాగా ప్రొద్దుపోయింది. మర్నాడు రాధాకృష్ణ లేచేసరికి

ప్రొద్దెక్కింది, ఇల్లంతా సందడిగా వుంది. దొడ్లో పశువులు అరుస్తున్నాయి. దూడలు గంతులు వేస్తున్నాయి. పాలేరు కేకలు.

'తమ్ముడూ, లేచావా?'— దగ్గరకువచ్చి కూర్చుంది రామలక్ష్మి.

'ఏమోయ్! రాత్రి మేము ఇంటికివచ్చేసరికే నిద్రపోయావు. అప్పుడే పెళ్లికొడుకు కళ వచ్చేసిందే? ఎట్లా వున్నావు?' సుబ్బ రామయ్యవచ్చి మంచం పక్కనే నిలబడ్డారు.

'కూర్చోబావా!'—అన్నాడు రాధాకృష్ణ. వోరు పెగుల్చుకుని.

కాసేపు సర్దాగా మాట్లాడి సుబ్బ రామయ్యగారు వెళ్ళిపోయారు, బయట్నించి రామ్మూర్తిగారు పిలవటం వలన.

హాల్లో హడావుడిగావుంది. ఎవరెవరివో గొంతులు వినబడ్డాయి. సత్యము గొంతుని ఆనవాలుపట్టాడు రాధాకృష్ణ.

'ఏమిటది, అక్కా!' అన్నాడు రాధాకృష్ణ.

'నీకూ తెలీనట్టుగా? తాంబూలాలు పుచ్చుకుంటున్నారు. నువ్వూ మొహం కడుక్కుని, కాఫీతాగు.'

అంటూ లేవబోయింది రామలక్ష్మి.

రాధాకృష్ణ, నోటివెంట మాటరాలేదు.!

'కాసేపాగక్కా!' అని చెయ్యిపట్టుకుని ఆపాడు. రామలక్ష్మి తమ్ముడి ప్రక్కనే కూర్చుండిపోయింది.

'మనకీ ఒక చెల్లెలువుంటే ఎంతబాగుం డేది?!'

'అవును.'

# తిరుగులేని నిశ్చయం

'అదీ పద్నాలుగేళ్ళు పెరిగి, పెద్దదయితే, మంచి సంబంధం మాటాడి, ఇటాగే తాంబూలాలు పుచ్చుకుంటున్నప్పుడు, మనకీ ఎంత సంతోషంగా వుండేదో?'

'ప్చ. అవున్నా!'

'కాని..., పెళ్ళికొడుకు ఏదో 'అవకరం' ఉన్నవాడైనప్పటికీ, మనకి వేరే గత్యంతరం లేక మన చెల్లెల్ని అతనికే ఇవ్వక తప్ప నప్పుడు, మనం అంతగానూ బాధపడతాము. పైకి చెప్పలేకపోయినా —మనస్సులో—మన చెల్లెలూ ఎంతో బాధపడుతూ వుందని మనం తేలిగ్గా అర్థంచేసుకోగలము. అప్పుడు మన గుండెలు ఎంతో బరువుగా మూల్గుతాయి! కదక్కా...?'

రామలక్ష్మి ఆదుర్దాగా, ఆశ్చర్యంగా అతనివంక చూసింది!

'నువ్వనే దేమిటి?!'

రాధాకృష్ణ నవ్వాడు. 'నీకు అర్థంగాకే అడుగుతున్నావా?', అన్నాడు.

'నేన్ప్రొద్దుటే ఆ అమ్మాయిని చూశాను. ఎంతో సంతోషంగా వుంది, చక్కగా మాటాడింది. ఆ విషయమూ అడిగాను. సిగ్గుపడింది. కాని నిన్నుచేసుకోవటానికి ఆ అమ్మాయి మనస్ఫూర్తిగా వొప్పుకున్న దని నేను నిర్ధారణగా చెప్పగలను. నామాట నమ్ము.'—అంది రామలక్ష్మి వాత్సల్యంగా చూస్తూ.




'నాకు వొక సహాయం చెయ్యగలవా, అక్కా!' మౌనాన్ని భగ్నంచేశాడు రాధాకృష్ణ.

'ఏమిటది?'

'ఈ పెళ్ళి నాకిష్టంలేదు. ఏదోరకంగా ఇది కాకుండా చూడు.'

రామలక్ష్మి తెల్లపోయింది.!

'నీకు పిచ్చెక్కినట్టుంది. లేకపోతే, పిచ్చి దాన్నిచేసి నవ్వాడిస్తున్నావా?' అని గభాలున లేచిపోయింది రామలక్ష్మి.

నిస్సహాయంగా ఆమె వెళ్ళినవైపే చూసి, దంతధావనంలో పడ్డాడు రాధాకృష్ణ, తన కోసం ఆ అమ్మాయిని బలిచెయ్యలేడు రాధాకృష్ణ. కాని, తనమాట ఎవరూ నమ్మటం లేదు. ఆ అమ్మాయి వొప్పుకున్నా తను ఇష్టపడవద్దా?!!

'పెళ్ళికొడుకుగారు ఇంకా కొన్నాళ్ళు వోపికపట్టాలి. ఇప్పట్లో ముహూర్తాలు లేవట! ఇవాళకూడా అంత మంచిరోజు కాదేమోనని సందేహము వచ్చింది. రామ్మూర్తి పంతులుగారికి.. అందుకే వొచ్చేవారం గాని తాంబూలాలు పుచ్చుకో రుట! రెండ్నెల్లాగితేగాని పెళ్ళికాదు.' సుబ్బ రామయ్యగారు గాలిలాగా లోపలికి వచ్చారు.

'పోన్లెబావా! అదీ మన మంచికే జరి గింది.' తృప్తిగా అన్నాడు రాధాకృష్ణ.

'ఏం ? అప్పుడే విరహమల్లా విరక్తిగా మారిందా?!' నవ్వాడాయన.

'ఏం లేదు బావా! అన్నీ మన మంచికే అంటారుగదా! ఈలోగా వీళ్ళ మనసులూ మారవచ్చునేమో! అప్పటికయినా మీరంతా నన్నర్థం చేసుకోగలరేమో.'

'అదేమిటి? ఈ పెళ్లి నీ కిష్టం లేదా...? లేక నాతో వేళాకోళమాడు తున్నావా?' నవ్వాడాయన. రాధాకృష్ణ మాట్లాడకుండా వుండిపోయాడు. వేళా కోళంగానే అతనామాటలన్నాడనుకుని సుబ్బ రామయ్య వెళ్లిపోయాడు. రామలక్ష్మి కాఫీ తెచ్చి ఇచ్చింది. కాఫీ తాగి బయటికే చూస్తూ వుండిపోయాడు రాధాకృష్ణ. అతని దృష్టి అకస్మాత్తుగా ఆ ఇంటి గుమ్మంముందు పడింది.

గుమ్మాన్ని కడిగి, పసుపురాసి కుంకుమ అద్దుతున్నది ఆ అమ్మాయి.

రాధాకృష్ణ కిటికీలోంచి అలాగే చూస్తూ వుండిపోయాడు. ఆలోచనల్నుంచి అతను బయటపడేసరికి ఆ అమ్మాయి అక్కడ లేదు.

మనస్సు ఆ అమ్మాయి ఎడల కృతజ్ఞతతో నిండి, దీర్ఘంగా నిట్టూర్చాడు రాధాకృష్ణ. తన సంగతెల్లా తెలిసీ ఎట్లా ఇష్టపడిందా అమ్మాయి!? ఆ తరువాత వారం రోజులు ఆ అమ్మాయి బయటికి రాలేదు. రామలక్ష్మి సుబ్బరామయ్యా తిరిగి 'ఆ నాటికి' వస్తామని, ఆ రోజే వెళ్ళిపోయారు. సందడి లేక ఇల్లు బావురు మంది.

మనస్సులో వెలితిగా అనిపించింది రాధాకృష్ణకి. ఆ క్రితం రోజు మంచి డాక్టరు ఆ ఇంటికి 'జట్కా'లో వచ్చి పోతూండటం గమనించాడు రాధాకృష్ణ.

ఏమయింది?

ఎవరికన్నా జబ్బా...?

సత్యంగానీ, అతని భార్యగానీ జబ్బు పడ్డారేమో? లేక పిల్లలకేమయినా 'నలత'గా వుందేమో?!

పార్వతమ్మని అడుగుదామనిపించింది గాని అడగలేకపోయాడు రాధాకృష్ణ. పదిరోజులు గిర్రున తిరిగాయి.

ఆ అమ్మాయి కనబడక అదోకలాగు కనిపించింది రాధాకృష్ణకి.

చక్రాల బండిలో కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాడు రాధాకృష్ణ. పార్వతమ్మ గుమ్మం దగ్గర కూర్చుని వుంది.

'ఆ రోజు తాంబూలాలు పుచ్చుకోక పోవటం మంచిదయిందంటున్నారురా మీ నాన్న...' పార్వతమ్మ అంది.

'............!!' తలెత్తి చూశాడు రాధాకృష్ణ.

'నీకు ఈ సంగతి నేను చెప్పలేదా? లలితకి జ్వరం వచ్చింది, పాపం!'

'లలితా...!??'

'అదేరా. సత్యం చెల్లెలు. నీకు చేసుకుందామనుకున్నాముగదా ఈ మధ్య!'

'ఆ అమ్మాయా? పాపం! జ్వరమా? అందుకేనేమో కనబడటములేదు. ఒకసారి వెళ్ళి చూసి రాలేకపోయావా?' రాధాకృష్ణ గుండెలు అదుర్దాగా కొట్టుకున్నాయి.

'ఇవాళే వెళ్ళాను. ఇన్నాళ్ళనుంచీ వెళ్దామనుకుంటూనే వీలుపడలేదు. నాల్గురోజుల క్రితం ఆ అమ్మాయి బ్రతుకుతుందనే ఆశ కూడాలేదట! ఇప్పుడు ఫరవాలేదు. ప్రాణానికి భయంలేదు, కాని...'

'ఏంజబ్బట! ఎదురిల్లేగదా! ఇన్నాళ్ళనించీ ఎందుకు వెళ్ళలేదమ్మా...?' బాధపడ్డాడు అతను.

'భయమేసిందిరా! అందుకేగదా మంచి నీళ్ళు, కాచుకుని తాగుతున్నాము. ఈ పదిహేనురోజులూ నా ప్రాణాలు అరిచేతుల్లో పెట్టుకున్నాననుకో!'

'అదేం? ఎందుకమ్మా?'

'అవునురా. ఆ జబ్బు అట్లాంటిది! మొహమంతా భయంకరమయిన మచ్చలు. ఎర్రటి వొంటిరంగు కాస్తా నల్లబడిపోయింది! లలిత పూర్తిగా మారిపోయింది. ఆనవాలు పట్టలేము! ఎంత వికారంగా వుందంటే...' పార్వతమ్మ ఆగింది.

'పాపం!'

రాధాకృష్ణ గుండెల్లో జాలి తొణికిసలాడింది. లలిత...! అట్లా అయిపోయిందా? అట్లాంటిది వూహించటానికే వొళ్ళు 'గగుర్పాటు' చెందుతుందే...? ఆజబ్బు లలితని మానసికంగా ఎంత కృంగదీస్తోందో? పాపం. మంచివాళ్ళకేనా? కష్టాలు. చివరికి ఆ అమ్మాయికి మిగిలివున్న ఆ అందాన్ని చూసీ ఎవరికనులు కుట్టాయి? అట్లా ఎందుకయింది?'

పాపం! లలిత! తన సంగతెల్లా తెలిసీ తనని ఇష్టపడిన లలిత అట్లా అయిపోయిందా? రాధాకృష్ణ గుండెలు బరువుగా మూలిగాయ్, బాధనిండి.

'పోన్లేరా! బాధపడకు. ఇంకా నయం. ఇంటికి తెచ్చుకున్నాక అట్లా అయింది కాదు. అంతవరకూ అదృష్టమేననుకోవాలి. అమాటే మీనాన్నా అన్నారు. అంతా మనమంచికే జరిగింది.' — పార్వతమ్మ తృప్తిగా అంది. రాధాకృష్ణకి నవ్వు వచ్చింది ఆమె మాటలువిని.

'అవునమ్మా! అంతా మన మంచికే జరిగింది. లలితకి నయమయింది. అదే పదివేలు! నీ కోడల్ని నీ ఇష్టంలేకుండా 'మృత్యువూ! ఎట్లా ఎత్తుకుపోతుంది?' అన్నాడు రాధాకృష్ణ నవ్వుతూ.

'అదేమిట్రా?!' పార్వతమ్మ ఆశ్చర్యపోయింది!

'అవునమ్మా! లలిత ఆనాడే ఈ ఇంటి కోడలయింది! అందమేమయినా కొరుక్కు తింటామా? రేపు నాకే అట్లా అయితే నన్ను బయటికి పొమ్మనలేవుగదా! అమ్మా! నీకొడుకుని నాలుగుకాలాలపాటు ప్రేమగా చూసుకోగల కోడలు దొరికినందుకు సంతోషించమ్మా! లలిత నిజంగా మంచిపిల్ల. ఇవాళ అందంలేదని మనం కాదంటే రేపు ఆపిల్లగతి ఏమిటి? ఇంకొకమ్మాయిని కోడలుగా చేసుకున్నా ఆమెకీ అట్లాగే ఐతే?! లలిత మనస్సు అందమయింది! నా 'అవకారాన్ని'చూసికూడా నన్ను నిరాకరించలేదు!! అక్క ఆ విషయం అప్పుడే నిర్ధారణ చేసుకుంది. నాకు అటువంటి భార్యే కావాలి, అమ్మా! మనస్వార్థమే మనం చూసుకుంటే మనల్ని దేవుడు క్షమించడమ్మా!'

పార్వతమ్మ మాట్లాడలేదు. తిరుగులేని ఆ నిశ్చయం, రాధాకృష్ణ మొహంలో కొత్త వెలుగులు విరజిమ్మింది. ●



## జరిగిన కథ

శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన చాలవరకు మారిపోయింది. అతను అక్టోబరు క్లాసులో స్కూలు ఫైనలు పాసయ్యాడు. శంకరాన్నిపోలీసు కేసులో యిరికిద్దామని వేసిన వరదరాజులుపథకాన్ని వేణు విఫలంచేస్తాడు. వేణు అక్కయ్యజ్యోతి. ప్రాణస్నేహితులయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసుకుంటారు. పార్టీరాజకీయాలతో విరోధవర్గాలయిన కుటుంబాలు వాళ్లవి. జ్యోతి రమణ ఇంటికి వెళ్లడాన్ని జ్యోతిభర్త ఆనందరావు సహించలేక పోయాడు. మాట మాటవచ్చి జ్యోతి పుట్టింటికి వెళ్లిపోతుంది. శంకరం మాష్టారిభార్య ఆదర్శంతో జ్యోతి మళ్లీ ఆనందరావును కలుసుకుంటుంది.




## 14

పంచకళ్యాణి గుర్రంమీద వ్యాహ్యాళికి బయలుదేరిన రాజకుమారుడంత ఠీవిగానూ, విలాసంగానూ తన సరికొత్త 'ర్యాలీ' సైకిలుమీద కాలేజికి బయలుదేరాడు వేణు. కాదు వేణుగోపాల్! ... మళ్ళీ మాట్లాడితే 'మిస్టర్ వేణుగోపాల్!...'

ఎండలో చూస్తే 'గ్లేర్' కొట్టేంత తెల్లటిపాంటు, తెల్లటిషర్టు, నల్లని 'పాయింటెడ్‌బూట్', షోగ్గా ఒకే ఒక 'బౌండునోట్‌బుక్', క్యారియర్ మీద స్టూడెంట్ అని తెలుపుతూ ... వెనుకటికి 'మగువ పొలుపు తెలుపు' ఒక్కొ మారుతము వీచేదిట మన కవితాపితామహాలకాలంలో!... ఈనాటి యీ నవీనయుగంలో మగువలనీ, మగవాళ్ళనేకాకుండా, 'ఫలానా' అని పేరు కూడా తెల్పుతయి, వాళ్ళువాళ్ళు వాడే సెంట్లు. అలాగే 'యిదుగో వేణు వస్తున్నాడు సుమా' అని అల్లంత దూరానికే 'యిన్‌ఫర్‌మేషన్' యిచ్చేస్తున్నది అతడు వాడిన 'యీవెనింగ్ యిన్ పారిస్' సెంటు!...

అలా బయలుదేరిన వేణుకు కొంచెం దూరంలో వరదరాజులుగారు కన్పించారు. 'బయలుదేరుతుండగానే యీయన మొఖం కన్పించింది! ఏదో మూడింది యివ్వాళ!...' అనుకున్న వేణు చటుక్కున తోచినట్లు సైకిలుదిగి, జేబులోనుండి సిగరెట్ పెట్టె తీశాడు. ఇదివరలో వేణు ఎప్పుడన్నా తమాషాకు సిగరెట్ కాల్చేవాడు. ఇప్పుడు కాలేజీలో చేరాక 'రెగ్యులర్'గా కాలుస్తున్నాడు ... పెట్టెలో సిగరెట్ ఒకటితీసి, ఆయన చూస్తున్నాడా లేదా అనేది ఒకకంట కనిపెడుతూ, సిగరెట్ వెలిగించి గట్టిగా ఒకదమ్ములాగి ఆయనదగ్గరకు రాగానే మొహమ్మీదికి పొగవదిలాడు వేణు...

ఆయన పాపం మొఖం చిట్లించుకుని పక్కకు తిరిగాడు. అప్పటిగ్గానీ తృప్తి కలుగలేదు వేణుకు. 'స్టయిల్'గా నిలబడి, నిర్లక్ష్యంగా పొగవదులుతున్న వేణుకు మలుపుతిరుగుతున్న శంకరంగారు కన్పించారు...

ఈ మధ్య శంకరంగారు యిదివరకు పని చేస్తున్న స్కూల్లో పని చెయ్యటంలేదు. పగబట్టిన కమిటీమెంబరు, కక్షగట్టిన వరదరాజులుగారూ శంకరంగార్ని ఆ వెనుక పని చేస్తున్న స్కూల్‌నుండీ వరార్పించేదాకా నిద్రపోలేదు... శంకరంగారి సిన్సియారిటీ'ని అభిమానించే మరి కొందరు ఆయన్ను అక్కడే వుంచాలని ప్రయత్నాలు చేశారుగానీ, అటువంటి విరోధ వాతావరణంలో ఆ స్కూల్లో వుండడం కష్టమని శంకరంగారే వద్దని, వూరికి రెండు మైళ్ళ దూరంలో వున్న మరో స్కూలుకి మార్పించుకున్నారు.

తమకు ఎదురు వస్తున్న వరదరాజులుగార్ని పలుకరిస్తున్న శంకరంగార్ని చూడగానే 'వచ్చాంరా' అనుకున్న వేణు చేతిలో సిగరెట్ ఆయన చూడకుండా కాలిక్రిందవేసి నలిపేసి, 'నమస్కారం మేష్టరూ! ...' అన్నాడు...

'నమస్తే!...కాలేజికా?'

'అవునండీ...'

'వెళ్ళు...వెళ్ళు ... టైమయిందేమో...' అన్నారు శంకరంగారు.

వేణు సైకిలెక్కి వెళ్లిపొయ్యాడు. తనను చూడగానే వేణు చూపిన నిర్లక్ష్యం, శంకరంగార్ని చూడగానే చూపిన వినయవిధేయతలు చూశాక వరదరాజులు మొఖం చిన్న బుచ్చుకున్నారు. వేణు కోరింది గూడా అదే... 'నేవస్తానోయ్ శంకరం.' అంటూ ఆయన జవాబుకైనా ఎదురుచూడకుండా వెళ్లిపొయ్యారు వరదరాజులుగారు.

కాలేజి చేరుకున్న వేణు సైకిల్ షెడ్డులోపెట్టి తాళం వేశాడు. తాపీగా సిగరెట్‌తీసి ముట్టించాడు. అసలు వేణుకు యీ మధ్య తను గొప్పవాడయి పొయ్యానని పించింది. 'వేణూ!... అరె వేణాడ్!' అన్ని పిల్చే వాతావరణం నుండి ఒక్కసారి 'మిస్టర్ వేణుగోపాల్!' లోకి వచ్చేశాడు. దానికి తోడు లెక్చరర్సు కూడా 'మీరు...' అంటూ మర్యాదగా పిలవడం, అతడి అభిప్రాయాని బలపర్చినయి.

వేణు పుస్తకాన్ని తమాషాగా పట్టుకుని ఠీవిగా మేడమెట్లెక్కుతున్నాడు...'మిస్టర్!'

వేణు తిరిగి చూశాడు. ఎదుట ప్రిన్సిపాల్! ... ఎర్రగా. సన్నగా, ఖద్దరు పంచెతో గంభీరంగా వున్నారు. 'ఏం చదువుతున్నావ్?' అని అడిగారు.

'పి. యు. సి.'

ఆయన తన్నలా ఏకవచనంతో పిలవడం కష్టం కలిగించింది వేణుకు. అందుకని నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు.

'అదా కథ!...చూడబ్బాయి...ఇది కాలేజి. అంటే మీ మనస్సుల్లోని అజ్ఞానమనే చీకటిని పోగొట్టి విజ్ఞాన జ్యోతిని వెలిగించే పవిత్రమైన ఆలయం యీ కళాశాల. అంతటి భక్తి శ్రద్ధలూ, నమ్మకం యీ కాలేజి మీద నీకు లేకపోయినా, కనీసం యీ ఆవరణలో వున్నంత వరకైనా గౌరవించండి...ఈ కాలేజి 'ప్రెమిసిస్'లో ఎవ్వరూ సిగరెట్ త్రాగకూడదు.' అన్నారాయన.

అప్పటిగ్గానీ వేణుకు తన చేతిలో యింకా సిగరెట్ వెలుగుతోందన

విషయం జ్ఞాపకం రాలేదు. వెంటనే సిగరెట్ అవతలపడేశాడు వేణు. అయినా తనను పట్టుకుని చిన్న కుర్రాడికి నీతులు చెప్పినట్టు ఏమి టీయన? అని ప్రిన్సిపాలుగారిమీద కొంత కోపం కూడా వచ్చింది. సిగరెట్ విసిరేసి చకచకా వెళ్ళిపోతున్న వేణుని చూసి, 'హుఁ కనీసం క్షమాపణ చెప్పుకోవాలని గూడా అనిపించలేదు: ఎప్పటికో వీళ్ళు నేర్చుకునేది!'...అంటున్న ప్రిన్సిపాల్‌గారి మాటలు విన్పించుకోనట్లే వెళ్ళిపోయాడు వేణు. అంతమంది తోటి విద్యార్థులముందు ఆయనలా తన్ను కించబర్చడం వేణుకు కష్టం కలిగించింది.

వారం రోజులు గడిచాయి. ఆ రోజు ప్రిన్సిపాల్‌గారు క్లాసు తీసుకుంటున్నారు. వేణు అవతల వేరే మీటింగ్‌కు హాజరవాల్సి వుంది... టైము గడిచేకొద్దీ వేణుకు ఆత్రుత ఎక్కువవుతోంది...మీటింగ్ యిక ఐదు నిముషాలుందనగా యిక కూర్చోలేక పొయ్యాడు వేణు. పుస్తకాలు తీసుకుని బయటికి వచ్చేస్తున్నాడు...గుమ్మం దాటుతుండగా, 'మిస్టర్!' అన్న ప్రిన్సిపాల్‌గారి పిలుపువిని ఆగాడు.

'కమ్ హియర్.'

దగ్గరగావచ్చిన వేణు భీకరంగావున్న ప్రిన్సిపాల్‌గారి ముఖం చూసి తల దించుకున్నాడు...

'ఇవతల నేను క్లాసు తీసుకుంటున్నప్పుడు, నీ కంతగా పాఠం వినబుద్ధిపుట్టకపోతే 'నే వెళ్ళిపోతానని' నన్నడిగి వెళ్ళొచ్చుగా!...' అన్నారు గంభీరంగా.

'కాదండీ...అర్జంటు పని...వుంటే...' అంటూ నాణిగాడు వేణు:

'అవునయ్యా...నీకు క్లాసులో పాఠం వినడం కంటె అతిముఖ్యమైన పనివుంది... ఒప్పుకున్నాను...అదే నన్నడిగితే తమ గౌరవ మర్యాదలకు భంగం వాటిల్లుతుందా?... నీ యిష్టం వచ్చినప్పుడు వెళ్ళడానికి 'ఈజ్ యిట్ ఎ కాలేజి? ఆర్ ఎ ఫిష్‌మార్కెట్?...' అంటుంటే ప్రిన్సిపాల్‌గారి మొఖం కందగడ్డలా మారింది. ఆయన స్వరం సింహగర్జనలా వుంది వేణుకు...మారుమాట్లాడకుండా నిలిబడ్డాడు.

'వెళ్ళు...వెళ్ళు... ఇంకెందుకు నీతో కాలక్షేపం!...ఆఁ...నీ నెంబరెంత?...'

వేణు చెప్పాడు.

'సరే వెళ్ళు...నువు నెక్స్‌ట్ వీక్ అంతా కాలేజికి రానవసరం లేదు. నిన్ను సస్పెండ్ చేస్తున్నాను.' అన్నారు.

వేణు గుండెల్లో రాయిపడ్డది. రాయిలానే నిల్చున్నాడు ప్రిన్సిపాల్‌గారి ముందు.

'సీ దిస్ జెంటిల్‌మన్! ... ఎలా నిలబడ్డాడో చూడండయ్యా!... కనీసం క్షమాపణ చెప్పుకోడానిక్కూడా యీయనకు చిన్నతనంగా వుంది!...కాలేజిలో ఎలా ప్రవర్తించాలో తెలియనివాళ్ళు ఎందుకయ్యా మీరంతా కాలేజికి వస్తారు మా ప్రాణం తియ్యడానికి?...'

వేణు తలెత్తాడు ... అతడికి రోషం వచ్చింది. ఇంత మంది ముందు యింత చులకన చేసి యీయన గొబ్బట్లు మాట్లాడగలిగాడు! ఇదే హైస్కూల్ అయి, ఈయనే ఏ వరదరాజుల్లాంటివాడో అయితే యీ పరికి పిల్లలందరూ ఏకకంఠంతో ఎంత గొడవచేసి వుండేవాళ్ళో?...అనుకున్న వేణు యింకా ఆశచావక



# హా రాః సంధ్యా ప్రవర్తతే..

బెంచీలవైపు చూశాడు...విద్యార్థులందరి తలలూ వంగివున్నాయి. కొంతమందిమాత్రం క్షమాపణ అడగమని సైగ చేస్తున్నారు... ఇంతమంది ముందు యింత అవమానం జరిగాక యిక క్షమాపణ అడగడానికి మనసొప్పలేదు వేణుకు...'ఒక్కవారం సస్పెండ్! ...అంతేగా...అంతకంటె ఏం చెయ్యగలడేంటి యీయన?...' నిర్లక్ష్యంగా ఒక్క చూపు చూశాడు ప్రిన్సిపాల్ వైపు.

'వెళ్ళండి...వెళ్ళండి... మీపని చూసుకోండి?...' ప్రిన్సిపాల్‌గారు వ్యంగ్యంగా అనేసి పుస్తకం తీసుకుంటే, తనకేమీ సంబంధం లేనట్లు చకచకా బయటికి నడిచాడు వేణు.

మీటింగ్‌లో కూర్చున్నాడన్నమాటేగాని అతడి మనసు యిక్కడలేదు. వేణు అంటే ఏమిటో ఈయనకు కాస్త తెలియ చెప్పాలనే ఆలోచనే...మీటింగ్‌నుంచి బయటపడగానే తన 'క్లాస్ మేట్స్'ని కలుసుకున్నాడు వేణు! ఈ ప్రిన్సిపాల్ సంగతేదో కాస్త చూడాలిరా' అంటూ

'నీకేమన్నా మతిపోయిందేరా వేణూ? ... ఈమాట మాదగ్గర అంటే అన్నావ్—యింకెక్కడా అనకు. ప్రిన్సిపాల్‌గారంటే దేముడిలాంటివాడు. 'గురువు' గారి మీద యీగ వాలిందంటే యీ కాలేజీలోవున్న దరిదాపు రెండువేలమంది విద్యార్థులూ నీ పీపు చితగ్గొట్టేస్తారు. ఆయన సంగతి నీకు బాగా తెలీదు కాబోలు...విద్యార్థులకు ఆయన దగ్గర ఎంత చనువుందో అంత భక్తివుంది! అసలు నువ్వెవరితో నన్నా 'ప్రిన్సిపాల్‌గారు నన్ను సస్పెండు చేశారు' అన్నావంటే—'అంత ఘోరమైన తప్పు ఏం చేశావ్?' అంటూ ముందు విస్తే విలేస్తారు. వెళ్ళి ఆయన్ను క్షమాపణ అడుగు' అని చెప్పారు.

వేణుకు ఎటూ పాలుపోలేదు క్షమాపణ అడగడం నామోషీ అనిపించింది. ఏం చెయ్యడానికీ తోచక వూరుకున్నాడు...

మర్నాడు ఆదివారం. వేణు యింట్లోనే వున్నాడు.

'వేణూ!...'అంటూ లోపలకు వచ్చిన శంకరంగార్ని చూచి నిర్ఘాంత పొయ్యాడు వేణు.

'ఏమిటోయ్ వేణూ!...ఏమిటి విశేషాలు?' వస్తూనే ప్రశ్నించారు మేష్టారు.

'ఏమున్నాయి?...ఏంలేవండీ...'

'ఫ్రాంక్లిన్ ఏమిటో గొడవగా చెప్పాడు?...' అన్నారు శంకరంగారు ప్రశ్నార్థకంగా వేణు ముఖంలోకి చూస్తూ.

ఫ్రాంక్లిన్‌ది కూడా వేణు గ్రూపే... క్రికెట్ ఆట ద్వారా ఏర్పడ్డ పరిచయం వాళ్ళను స్నేహితుల్ని చేసింది. ఈవిషయం మేష్టారికి తెలియనివ్వ గూడదని వేణు అనుకుంటే, ఫ్రాంక్లిన్ అప్పుడే యీ వార్త ఆయనకు చేరేసినందుకు అతడిమీద కోపం గూడ వచ్చింది. అయినా మేష్టారితో అబద్ధం చెప్పలేక.

'అవునండీ ప్రిన్సిపాల్‌గారు వారంరోజులు 'సస్పెండ్' చేశారు...' అన్నాడు తలవంచుకుని.

'ప్రిన్సిపాల్‌గారు సస్పెండ్ చేశారా! !... ఆశ్చర్యంగా వుంది!.. ఆయన చాలా వుదారులు వేణూ? ... ఇంతకూ నువ్వేం చేశావేంటి?'

చివరికి శంకరం మేష్టారు కూడా యిలా మాట్లాడ్డం వేణుకు కష్టం కలిగించింది. తలవంచుకుని జరిగిందంతా చెప్పాడు వేణు...'

'ఇంకో లెక్చరరుగారి క్లాసులో నాలుగ్గురు పోర్షన్లు అడక్కుండా వెళితే ఆయనేమన లేదండీ...చాలామంది అలాగే అడక్కుండా వెళ్ళేవాళ్ళు...' అంటూ సంజాయిషీ యిచ్చుకున్నాడు.

'నేనూ ఆయన స్టూడెంట్‌నే వేణూ... సభ్యతలేకుండా ప్రవర్తిస్తే యింకెవరన్నా వొప్పుకుంటారేమోగాని, ఆయనమాత్రం సహించలేరు. అసలు వాళ్ళెవరో చేశారని నువ్వు చెయ్యడంలో అర్థంలేదు. అది హైస్కూల్‌కాదు ప్రతి చిన్న విషయం నీకు బోధపర్చేందుకు...కాలేజీలో చేరావంటే, 'యు ఆర్ ఎక్స్‌పెక్టెడ్ టు బిహేవ్ ప్రాపర్లీ.' నువ్వు సభ్యతనెరిగి ప్రవర్తిస్తావని ఆశించడంలో తప్పేమీలేదు...' అన్నారు శంకరంగారు...వేణుకు చెవులప్పగించి వినడం తప్ప మరో గత్యంతరం లేకపోయింది.

'ఆయన నీ మంచికే చెప్పారు వేణూ!... ఈనాడు నువ్వు నేర్చుకున్న సభ్యత యింతటితో పొయ్యేదికాదు. నీ జీవితాంతం, నీ మాటా, నీ నడక, నీ ప్రవర్తన, ప్రతిదాంట్లోనూ ప్రతిఫలిస్తూనే వుంటుంది. ఏమాత్రం పొరబాటుజరిగినా, 'ఏ స్కూల్ నుండి వచ్చావ్?' అని ప్రిన్సిపాల్‌గారు అడిగినట్లు, యికముందు 'ఏ కాలేజిలో



చదివావ్ ?' అని అడుగుతారు. 'ఫలానా కాలేజి, ఫలానా ప్రిన్సిపాల్‌గారిదగ్గర చదువుకున్నానని' సగర్వంగా చెప్పుకున్నట్లే, కాలేజి పరువు ప్రతిష్ట, ప్రిన్సిపాల్‌గారి పేరూ నిలబెట్టాల్సిన గురుతరమైన బాధ్యతను నువ్వు మర్చిపోతే ఎలా వేణూ ?'... అంటూ మెత్తగా చీవాట్లు వేశారు శంకరంగారు.

వంచినతల ఎత్తలేదు వేణు.

'ఇప్పుడేం చెయ్యాలనుకుంటున్నావ్ ?' శంకరంగారు మళ్ళీ అడిగారు.

'ఏం చెయ్యను?...వారం రోజులు కాలేజి పోతుంది.'

'కాలేజి పోగొట్టుకోడం ఎందుకు ?... వెళ్ళి ఆయన్ను క్షమాపణ అడుగు. పెద్దలూ గౌరవపాత్రులూ అయినవారిని క్షమాపణ అడిగినంతమాత్రాన మన విలువ పెరుగుతుంది కానీ తగ్గదు వేణూ ... తెలుగు, యింగ్లీషు, సంస్కృతి భాషల్లో ఆయన ఎటువంటి పండితుడు! ... మేం చదువుకునే రోజుల్లో ఆయన్ను 'మూవింగ్ ఎన్‌సైక్లోపిడియా' అనేవాళ్ళు. ఆయన పాండిత్యంలో సహస్రాంశం మనకొచ్చినా మనం ధన్యులమైనట్లే...'

'వెళ్ళి అడిగితే ఏమంటారోనని భయంగా వుందండి.'

'ఏవీ అనరు...నీకంత భయంగావుంటే నేనొస్తాను పద నీవెంట...ఆయనకు సహజంగా కోపమేరాదు. వచ్చినా ఎంతో సేపుండదు. ఆయన ఎంత ఉదారులనుకున్నావ్ ! ... మా క్లాస్‌మేట్ ఒకతను పరీక్ష ఫీజు కట్టుకోకపోతే, అప్పటికప్పుడు తన జేబులోనుండి డబ్బుతీసిచ్చి పరీక్ష ఫీజు కట్టించారు. లే ... నే వస్తాను పద...' అంటూ శంకరంగారు వేణును బయలుదేరతీశారు...

వాళ్ళు వెళ్ళేసరికి ఆయనకాలేజిలో లేరు. సరాసరి యింటికెళ్ళారు యిద్దరూ...తలకు మానె పెట్టుకుని తలంటి పోసుకోబోతున్న ప్రిన్సిపాల్‌గారు 'ఎవరో వచ్చారనగానే' అట్లాగే వచ్చారు. శంకరంగారిని చూడగానే 'రావోయ్!...రా...' అంటూ ఆప్యాయంగా ఆహ్వానించారు. వేణును చూసి 'ఇతడు, లుహాకుర్రాడు నీకు తెలుసేమిటి?' అని అడిగారు శంకరంగారిని.

'ఆ...నా...స్టూడెంట్ అండీ...' అలా

# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

చెబుతున్నప్పుడు శంకరంగారు కొద్దిగా సిగ్గుపడ్డారు.

'ఏమిటీ ... నీస్టూడెంటా!... ' ఆశ్చర్యంగా అంటూ వేణువైపు తిరిగి ... 'శంకరందగ్గర చదువుకున్నవాడివా అంత అసభ్యంగా ప్రవర్తించావ్?...కనీసం అతడి పరువైనా నిలపొద్దుటోయ్? ... అతడు చదువుకునేటప్పుడు అందరిచేతా ఎంత మంచివాడనిపించుకున్నాడు!...' అన్నారు.

వేణు తల వాలిపోయింది సిగ్గుతో... 'క్షమించండి మేష్టారూ!...ఇంకెప్పుడూ అలా ప్రవర్తించను' అన్నాడు వినయంగా.

'ఆఫ్‌కోర్సు...నన్ను గౌరవించకపోయినా నాకేం ఫరవాలేదు. నన్ను గౌరవించమనీ నేనడగటంలేదు. కాలేజిలో చేరినందుకు విద్యా విజ్ఞానం మాట అటుంచి, కనీసం సభ్యత అయినా నేర్చుకోకపోతే ఎందుకయ్యా వందలు వందలుపోసి మీ పెద్ద వాళ్ళు మిమ్మల్ని చదివించడం?'

'నాకు తెలియదు మేష్టారూ...' అన్నాడు వేణు పశ్చాత్తాపంతో...

'తెలియదు కాబట్టే తెలుసుకోడానికి ప్రయత్నించు. ముందు ముందు మంచి అలవాట్లు నేర్చుకో. డిగ్రీ తీసుకుని కాలేజి నుండి వెళ్ళిపోయ్యేటప్పటికి నువ్వు చాలా పెరగాలి... శారీరకంగానేకాదు మానసికంగా కూడా...స్వతంత్రంగా ఆలోచించగల శక్తి, విచక్షణాజ్ఞానం పెరగాలి. దేశానికీ, సమాజానికీ పనికివచ్చేవాడివిగా తయారుచెయ్యడానికేగా మేమిక్కడుంది! ఇవ్వాళ చిన్నవాడివని చూసీ చూడకుండా పోనిస్తే యివే అలవాట్లు నీ జీవితాంతందాకాపోవు...' అని ప్రిన్సిపాల్‌గారు చెబుతుంటే మౌనంగా వింటున్నాడు వేణు. ఆ తర్వాత శంకరంగారు ప్రిన్సిపాల్‌గారూ కొంచెంసేపు మాట్లాడుకున్నారు. 'ఇక వస్తామండీ...' అని శంకరంగారు సెలవు తీసుకుంటుంటే ప్రిన్సిపాల్‌గారు చనువుగా వేణు భుజం తట్టి 'రేపటినుండి కాలేజికి వచ్చెయి ... ముందుముందు శంకరానికి తగిన శిష్యుడి వనిపించుకోవాలి...' అన్నారు.

'థాంక్సండీ... కృతజ్ఞత మెరుస్తున్న కళ్ళతో చేతులు జోడించి సెలవు తీసుకున్నాడు, అవిధంగా ఆయన క్షమించగలరని ఆశించనివేణు!...

ఆతర్వాత అత డెప్పుడూ అవిధంగా ప్రవర్తించలేదు. అతడి ప్రవర్తనలో వచ్చిన మార్పువల్ల ప్రిన్సిపాల్‌గారి ప్రియశిష్యుడిగా ఆయన అభిమానం చూరగొన్నాడు... వేణుకు కూడా ఆయనమీద మంచి గురుభావం ఏర్పడింది. ఆ తర్వాత చాటున గూడా ఆయన్ను పన్నెత్తి ఒక్కమాట అనలేదు సరిగదా, యితరకాలేజివాళ్ళెవరన్నా ఏమన్నా అన్నా సహించేవాడుకాదు వేణు.

ఇంతలో కాలేజిఎలక్షన్సుగూడా వచ్చాయి. ...వేణు 'స్టూడెంట్స్ యూనియన్, సెక్రటరీ షిప్'కి పోటీచేశాడు...స్వయంగా హాస్టలుకి, లాడ్జీలకు వెళ్ళి పాంప్లెట్స్ పంచి, ప్రతి ఒక్కరినీ కల్సుకుని తనకు ఓటు చెయ్యమని అభ్యర్థించాడు వేణు. దానికి తోడు అతడు సభ్యుడుగా చేరిన విద్యాసంస్థ యొక్క అండదండలు కూడా బాగా లభించాయి వేణుకు. 'కామన్ డయాస్' మీద అత డిచ్చిన ఉపన్యాసం, ఆ వాగ్ధాటి విద్యార్థులను మంత్రముగ్ధులను చేసింది. చూపరులను యిట్టే ఆకర్షించే అతడి రూపం గూడా అతడికి చాలా ఓట్లు సంపాదించి పెట్టింది. సెకండ్ ఇయర్ బి. ఎస్సీ, స్టూడెంటుమీద వేణు దిగ్విజయం సాధించాడని తెలియగానే అతడి మిత్రులు పూలమాలలతో ముంచేసి, అమాంతం బంతిలా పైకెత్తేశారు...

* * *

అర్ధరాత్రి ఒంటిగంట సమయం. ఎముకలు కొరికే డిసెంబరునెల చలిలో, తలకు మఫ్లరు చుట్టుకుని, శంకరంగారు రెండవ సినిమాచూసి వస్తున్నారు... ఆయనకు యిలా మధ్యనలు తిరిగే వుంటంలేదు. తల్లి మందులకు కావలిస్తే సైకిలు గూడా అమ్మేశారాయన. తొమ్మిదిగంటల లోపుగా భోజనం చేసి బయలుదేరితే స్కూలువేళకు చేరుకుంటారు. మధ్యాహ్నం పూట అక్కడే ఓ కప్పు కాఫీత్రాగి వుంటే, సాయంత్రం స్కూలు వదిలాక, ఏ ఆరుగంటలకో యిల్లుచేరుకోడం. రానూపోనూ రోజుకు నాలుగుమైళ్ళ నడకతో ఆయన హతలాఘతలమవున్నారు. ఆదివారం వచ్చిందంటే దానికి తగ్గపని వుండనే వుంటోంది...అందుకని ఆరోజు ఓపిక చేసుకుని రెండో ఆటకు బయలుదేరారు ఆ 'పిక్చరు' బాగుందంటే ... తలవంచుకు



వస్తున్న శంకరంగారు...

'వేణూ!...ఇంకెక్కడ రాద్దామంటావ్?' అన్న ప్రశ్నవిని చుట్టూ చూశారు...

రోడ్డు పక్కయింటి గోడకువేసిన నిచ్చెనపట్టుకు నిలబడ్డతను, పైనున్న వాడితో అంటున్నాడు... పై నిచ్చెనమీదున్న కుర్రాడు, ఫుల్‌హాండ్స్ స్వెట్టరు, తల చుట్టూ మఫ్లర్‌కట్టుకుని, ఒకచేతిలో డబ్బా, ఒకచేతిలో కుంచెపట్టుకుని, నిచ్చెన మీదనుండి దిగుతున్నాడు ... ఒకమూలగా నొదిగి నిలబడ్డ శంకరంగారు స్ట్రీట్‌లైటు వెలుతురులో ఆ నిచ్చెన దిగుతున్నది వేణు అని గుర్తించారు ... వేణు నిచ్చెనదిగి, 'ఆ కాంపౌండ్ వాల్‌మీద రాద్దాం...పద...' అంటూ ముందు నడిచాడు...అతడి వెనకాలే ఆరెండో కుర్రాడుకూడా నిచ్చెన పట్టుకుని బయలుదేరాడు. శంకరంగారి దృష్టి గోడ మీదికి మళ్ళింది ... 'విద్యార్థుల ఐక్యత వర్ధిల్లాలి.' పెద్దపెద్ద అక్షరాలతో వ్రాసి వుంది. శంకరంగారికి కొంచెం కొంచెం అర్థమైంది. అర్ధరాత్రి యిలా గజగజలాడే చలిలో, వాళ్ళ కార్యదీక్షకు, పట్టుదలకూ మెచ్చుకోవాలో, చదువును అశ్రద్ధచేసి అలా రాత్రింబవళ్ళు తిరుగుతున్నందుకు కోప గించుకోవాలో తోచలేదు శంకరంగారికి...

మర్నాడు సాయంత్రం వేణు వాళ్ళ యింటికి వెళ్ళారు శంకరంగారు. ఇంట్లో లేడు వేణు... ఆ తర్వాత రెండు మూడు రోజులకు డేవిడ్, ఫ్రాంక్లిన్ కనిపించారు... శంకరంగారు వేణును గురించి అడిగారు వాళ్ళను...

'వేణుకు యిప్పుడు తీరిక ఎక్కడ దేస్తారూ?... యూనియన్ సెక్రటరీగదా... మూడురోజులనుండీ జరుగుతున్న సమ్మెను దిగ్విజయంగా నడిపించింది అతడేగదండీ... అసలు పెట్టు పురుగును కాలేజిలో కదుగు పెట్టనివ్వలేదు...స్టూడెంట్సందరూ బ్రహ్మ రథం పడుతున్నారు అతడికి... ఇవ్వాళైతే మేస్తారూ ...ఆ జయజయ ధ్వానాలతో దిక్కులు పిక్కటిల్లి పొయ్యాయనుకోండి...' అని ఫ్రాంక్లిన్ ఉత్సాహం చెప్పాడు...

'ఇంతకూ సమ్మె ముగిసిందా? ఇంకా జరుగుతోందా ఫ్రాంక్లిన్?'

'ఇవ్వాళ్టితో అయిపోయిందంటున్నారు మేస్తారూ...కాలేజి 'అధారిటీస్' రేపట్నుంచి కాలేజికి అటెండ్ అవుతే మీ గ్రీవెన్స్,

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1967 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరంకూడా "ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి కథలపోటీ" నిర్వహించపోతున్నదని తెలపటానికి సంతోషిస్తున్నాము. రచయితలందరూ ఎప్పటివలె మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

## మొదటి బహుమతి రు. 1600

## రెండవ బహుమతి రు. 900

## మూడవ బహుమతి రు. 500

### నిబంధనలు

1. కథలు స్వంత రచనలై ఉండాలి. ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంతరచనేనని దేనికీ అనువాదంకానీ, అనుసరణకానీ కాదనీ హామీ రాసి పంపాలి. ఈ హామీలు వేరే కాగితం మీద కాక కథ వ్రాతప్రతి మీదనే రాసి ఉండాలి.

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతి మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒక వైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామా కూడా వ్రాతప్రతి మీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్‌బుక్ పేజికి రెండు రెట్లు) పేజీలకు మించరాదు.

4. కవరు మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు—1' కి పంపాలి.

5. పోటీకి గడువు తేది 31—8—67. ఆ తర్వాత మా కార్యాలయం చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా 3—11—1967 తేదీకల ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7. పోటీ తుదినిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపడానికి వీలులేదు.

8. వ్రాత ప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడానికి సాధ్యంకాదు. పోటీలో పాల్గొనేవారు తమ రచనలతో తపాలాబిళ్ళలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు పంపనవసరం లేదు.

9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించే ముందు తెలుపుతాము.

# పూర్వాసంధ్యా ప్రవృత్తతే...

అన్నీ తప్పక సానుభూతితో పరిశీలిస్తామని హామీ యిచ్చారట. రేపటి నుంచీ కాలేజీలు మామూలుగా జరుగుతాయని అన్నారు.'

'హాఫ్‌యియర్లీ ఎగ్జామ్స్ ఎప్పటి నుండో?...'

'ఇంకెంత పదిహేనురోజులు కూడాలేవు మేషారూ...' అని చెప్పాడు ఫ్రాంక్లిన్...

శంకరంగారికి భయంవేసింది. 'యీ వేణు 'పాలిటిక్స్'లో పడి 'కెరియర్' పాడుచేసుకుంటాడేమో' అనుకొని, 'వేణు కన్పిస్తే సాయంత్రం ఆరుదాటాక మా యింటికి రమ్మన్నానని చెప్పు ఫ్రాంక్లిన్' అని చెప్పారు...'సరే'నని వెళ్లిపోయ్యారు ఫ్రాంక్లిన్, డేవిడ్...

ఇల్లు చేరుకున్న శంకరంగారు ఆలోచిస్తూ కూర్చున్నారు...ఏమిటీ విద్యార్థులు! ...అయిందానికీ, కానిదానికీ యీ సమ్మెలేమిటి? ఈ బెదిరింపు లేమిటి?...అసలు వీళ్ళు చదువుకోడానికి కళాశాలలకు వస్తున్నారా, లేక తమాషాకు వస్తున్నారా?...అని కూడా అనిపించింది శంకరంగారికి...కాని యీ అలజడులకు, యీ అశాంతికి ఒక్క విద్యార్థులేనా కారకులు? నిందించవలసింది కూడా ఒక్క విద్యార్థుల్నేనా?...

ఆయన యింకొంచెం లోతుగా ఆలోచించారు. విద్యార్థులు, విద్యార్థులు అంటూ నింద అంతా విద్యార్థులమీద రుద్దడం ఏమంత సమంజసం?...విద్యార్థులు నివసించేది ఎవరి మధ్య?...ఎవరిని చూచి వాళ్ళు నేర్చుకోవలసింది?...వాళ్ళచుట్టూ వున్న సమాజం పార్టీలతో, కక్షలతో, ముఠా తత్వాలతో క్రుమ్మిపోతుంటే, ఆ సమాజంయొక్క ప్రభావం పడకుండా విద్యార్థులు దూరంగా వుండగలగడం సాధ్యమేనా?...వాళ్ళను తీర్చి దిద్దవలసిన విద్యాసంస్థలలో ఎన్నో అక్రమాలు జరుగుతుంటే, వాళ్ళ భవిష్యజ్జీవితానికి పునాదులు నిర్మించవలసిన అధ్యాపకులందరూ నిష్పక్షపాత వైఖరి నవలంబించగల్గుతున్నారా? ఇక విద్యార్థులమీద వీటి ప్రభావం కన్పించకుండా ఎలా వుండగలదు?...విద్యాసంస్థలను సంప్రదించకుండా, అధ్యాపకుల సలహాలను మన్నించకుండా, రాజకీయ పెద్దలు తలదూర్చి రోజుకో చట్టాన్ని ప్రవేశపెట్టి విద్యార్థులమీద ప్రయోగాలు సల్పుతుంటే, తమకేవిూ పట్టనట్టుగా విద్యార్థులను వుండమంటే, అందులో సబబు వుందా?...విద్యార్థులు రాజకీయాలకు దూరంగా వుండాలనుకునేవాళ్ళు, వాళ్ళను దూరంగా వుంచేందుకు, వాళ్ళశక్తిని, వుత్సాహాన్ని సద్వినియోగపర్చేందుకు చేస్తున్న ఏర్పాట్లేమిటి? అనే ఆలోచన పోయింది శంకరంగారికి. విద్యార్థుల్లో విభిన్న మనస్తత్వాలుంటయి. విభిన్న అభిరుచులు,ఆశయాలూ వుంటయి ... వాళ్ళ మనస్తత్వాన్ని అర్థం చేసుకుని, వాళ్ళవాళ్ళ అభిరుచులకు అనువుగా విద్యబోధించడం జరుగుతోందా?... విద్యార్థి మానసిక, శారీరికాభివృద్ధికి, సర్వతోముఖవికాసానికి వీలుగా ఏయేర్పాట్లు జరుగుతున్నయి? ... ఎన్ని విద్యాలయాలు చక్కటి లైబ్రరీని అందివ్వగల్గుతున్నయి? ఎన్నివిద్యాలయాలకు కావలసినంత ఆటస్థలాలువుంటున్నయి?...అసలు వాళ్లవాళ్ల కోరికలను, అలజడిదాకా తీసుకుపోకుండా మంచిగా అడిగినంతకాలం, వాళ్ళసమస్యలను పరిష్కరించడానికి ఎవరన్నా పూనుకుంటున్నారా?...ఇలా ఆలోచిస్తుంటే శంకరంగారి తల తిరిగిపోతోంది. తలనొప్పివచ్చేలావుంటే పడక్కుర్చీలో వాలిపోయ్యారు. తీగె కదిపితే డొంకంతా కదిలినట్లు, తేనెతుట్టె దగ్గరికిపోతే, తేనెటీగలు మునురుకున్నట్లు శంకరంగారిని అనేక ప్రశ్నలు చుట్టుముట్టి వేధిస్తున్నయి...తలపట్టుకు పడుకున్నారు శంకరంగారు...

మర్నాడు ఆయన రమ్మన్న వేళకే వచ్చాడు వేణు ..

'ఏమిటి విశేషాలు వేణూ?...పరీక్షలు దగ్గరకొస్తున్నట్టున్నయి, చదువులోపడి మమ్మల్ని మర్చిపోయినట్లున్నావ్?...'లని అడిగారు శంకరంగారు నవ్వుతూ.

ఏం చెప్పడానికీ తోచక క్షణకాలం ఆలోచించాడు వేణు.

'కాదండీ...యీమధ్య యీ స్ట్రయికు గొడవలో పడి రావడానికి వీలుకాలేదు.' నొచ్చుకుంటూ అన్నాడు వేణు.

'సమ్మెచేశారా?...ఎవరు చేయించారు వేణూ?...ఏదన్నా పార్టీ 'యినిషియేటివ్' తీసుకుని చేయించిందా? లేక మీరే చేశారా?...' ఎరగనట్లే అడిగారు శంకరంగారు.

'లేదండీ...మేమే... ఆఁ ... అంటే ...' కొంత తడబడ్డాడు వేణు...'

'అంటే ఏ పొలిటికల్‌పార్టీ గూడా కనీసం పరోక్షంగానైనా మిమ్మల్ని ప్రోత్సహించలేదా?' శంకరంగారు గుచ్చి గుచ్చి అడిగారు.

వేణు జవాబు చెప్పడానికి తటపటాయించాడు.

'నాకు తెలుసు వేణూ!...ముందు యీ రాజకీయ పార్టీలు తమ స్వప్రయోజనాలు సాధించుకోడానికి, తమ పలుకుబడిని పెంచుకోడానికి, విద్యార్థులకు వురెక్కించి,



వాళ్లను వినియోగించుకుంటారు...ఆరాజకీయాల్లో మునిగిపోయి మీరారు 'కెరియర్' పాడుచేసుకుంటే నష్టపొయ్యేది ఎవరు?...రేపు ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా, మీ భవిష్యత్తును నిర్మించుకోవలసిన వాళ్లు మీరేకాని యింకెవరూ నిర్మించి యివ్వరు...ఈనాడు యిటువంటి వాటిల్లోపడి పాడుచేసుకున్న భవిష్యత్తు, రేపు మళ్లీ నిర్మించుకోవాలంటే సాధ్యం కాని పని...' అన్నారు శంకరంగారు.

వేణుకు నాలుక చివరదాకా వచ్చింది. 'మేమూ మా పుస్తకాలూ తప్ప యింకో విషయమే పట్టించుకోగూడదా మేష్టారూ?' అని అడుగుదామని ... కానీ అడగలేక పొయ్యాడు.

అతడి అభిప్రాయం చదువుకున్నట్టుగా మళ్లీ అన్నారు శంకరంగారు... 'కొంత మందికి అసలు ప్రపంచ జ్ఞానమేవుండదు. వాళ్లా వాళ్ళ క్లాసు పుస్తకాలూ తప్ప, ప్రపంచంలో ఏ మూల ఏం జరుగుతున్నదో కనీసం మనదేశంలో విషయాలు కూడా తెలియవు. అలావున్నా కష్టమే, బొత్తిగా లోకజ్ఞానంలేకుండా...విద్యార్థులుక్కూడా కొంత వరకూ రాజకీయ పరిజ్ఞానం తప్పకుండా వుండాల్సిందే...ఎక్కడ ఏం జరుగుతోంది, ఏఏ సంఘటనల పరిణామాలు ఎలా వుంటయ్యో మొదలైన విషయాలు విద్యార్థులు ఆకళింపుచేసుకుంటూవుండాల్సిందే... విద్యార్థిదశ అంటే—'పీరియడ్ ఆఫ్ అబ్జర్వేషన్'...ఒడ్డునవుండి గమనించడమే గాని ప్రవాహంలోకి దూకడానికి ప్రయత్నిస్తే ఒడ్డుపట్టడం కష్టం...' అన్నారు.

'ఇకనుండి యిటువంటి వాటిల్లో ఎక్కువగా జోక్యం పెట్టుకోనులెండి.' అన్నాడు హామీగా యిస్తున్నట్టు వేణు.

'అహా ... నేను నీ ఒక్కడికే విషయం చెప్పటంలేదు వేణూ!...సామాన్యంగా జరుగుతున్నది చెబుతున్నాను...ఎందుకంటే యీ వయస్సు పాలపొంగులాంటిది ... అనుభవం లేని ఆవేశం ఎక్కువ...అందుకే యీవయసులో తీసుకున్న నిర్ణయాలూ, ఏర్పడ్డ అభిప్రాయాలూ, పాక్షికంగావుంటయి తప్ప, అనుభవంతో ఏర్పడ్డవిగా వుండవు...'అంటూ విపులంగా చెప్పారు శంకరంగారు ... ఆయనలా విపులంగా చెప్పారంటే కారణం లేక పోలేదు. 'ఈపని మంచిదికాదు. చెయ్యొద్దు' అని వేణుకు చెబితే 'ఎందుకు మంచిది కాదో చేసిచూస్తానని' రకం వేణు...అందుకని అతడి మనసుకు నచ్చేలా, ఎందుకు మంచిదికాదు, కలిగే చెడు ఏమిటి? అనేవి అతడి మనసులో నాటేటట్టు చెబితే, అప్పటికి ఒప్పుకుంటాడు...అతడి స్వభావం బాగా ఎరిగినవారు కాబట్టే మళ్లీ అన్నారు.

'నువ్వు బొత్తిగా పసిపిల్లాడివి కావు వేణూ...నువ్వే ఆలోచించు...మీ అమ్మగారు నీమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నారు!... ఎంత డబ్బుపోసి చదివిస్తున్నారు! ... ఇదివరలో అయితే 'ఫస్టు యియర్ యీజ్ ది రెస్టు యియర్' అనేవాళ్లు...ఇప్పుడు నీకా భవిష్యత్తులు నిర్ణయించేదే యీ ఏటి చదువు ... ఏమాత్రం అజాగ్రత్తగావున్నా మీరాకన్న కలలన్నీ కల్లలవుతయి. అందులో నువు యింజనీర్ నవుతానంటున్నావ్!... ఇటువంటివన్నీ నీ భవిష్యత్తుకు గొడ్డలి పెట్టు అవుతాయేమోనని నా భయం...' అంటూ శంకరంగారు వేణు ముఖంలోకి చూశారు.

'లేదు మేష్టారూ! ... నేను చదువును అలక్ష్యం చెయ్యనండీ...తప్పకుండా నాకు క్లాసువస్తుంది... నేను క్లాసు తెచ్చుకుంటాను మేష్టారూ...' అన్నాడు వేణు...

'మంచిది వేణూ! బాగా చదువు ... మేమంతా నీమీద పెట్టుకున్న ఆశల్ని సఫలంచెయ్యి. ఇతర కార్యక్రమాలు ఎన్నింటిలో పాల్గొన్నా, ప్రధానమైన చదువుకు భంగం రాకుండా చూసుకో... ఎంత మంచి అలవాటయినా సరే మితిమీరితే వ్యసనమే అవుతుంది... నీ భవిష్యత్తును బాగు చేసుకున్నా పాడుచేసుకున్నా అంతా యిక నీ చేతుల్లోనే వుంది...'

ఇంతసేపూ ఓపిగ్గా విన్న వేణుకు, ఆయన మాటల్లో కొంత నిజం లేకపోలేదు అనిపించినా, యీ మాత్రం దానికి మేష్టారెందుకింత భయపడిపొయ్యారు అనుకున్నాడు... ఆ నాటి నుండి శ్రద్ధగా చదవడం మొదలెట్టాడు...పదిహేనురోజులుంది కదా, ఈ పోర్షను 'కవర్' చెయ్యలేక పోతానా అనుకున్న వేణు ఊహ ఊహగానే వుండిపోయింది...పోర్షను పూర్తిగా చదవలేదని 'హాఫ్‌యియర్లీ' పరీక్షలకు వెళ్ళని వేణు, అప్పటి నుండీ అన్ని వ్యాపకాలూ వదిలేసి రాత్రింబగళ్లు కష్టపడి చదవడం మొదలుపెట్టాడు...ఎంత తప్పించుకుందామన్నా 'యూనియన్ సెక్రటరీ'గా అతడి బాధ్యతలు తప్పటం లేదు. రాత్రి భోజనం చేశాక అలా హైరోడ్డు మీదికి వెళ్లి ఓ అరగంట తిరిగి, అరకప్పు టీ తాగివచ్చి కూర్చుంటే, రాత్రి మూడుగంటలదాకా కూర్చుని చదివేవాడు...

అనుకున్నంత కాలం పట్టలేదు. పరీక్షలు రానే వచ్చినయి. వేణుకు పరీక్షల ముందు జ్వరం పట్టుకుంది. పరీక్షకు వెళ్లొద్దని ఎవ్వరు చెప్పినా వినకుండా వెళ్లాడు వేణు. ఆ జ్వరంలో ఎలా రాసింది కూడా తెలియలేదు వేణుకు...

(ఇంకా వుంది)



వసుంధర

# సుఖ జీవితం

తమిళమూలం "మాళిగైవాసం"
ఎం. వి. వెంకట్రాం
తెలుగు అనువాదం
శివరాజన్

అద్దంలో నా రూపాన్ని చూసుకుని కంగారుపడ్డాను. ఇటువంటి మానసిక క్షోభతో ఇంకా కొంతకాలం బ్రతకాల్సి వస్తే, నా శరీరాన్ని అందాన్ని మృత్యువుకు అర్పించక తప్పదు.

ఆరునెలల క్రితం నేనూ నా 'వారు' కలిసి తీసుకున్న ఫోటోను కళ్ళార్పకుండా చూశాను. అప్పట్లో నా అందం కనుల పండుగ్గా ఎంత బావుండేది!

అప్పుడు—అంటే ఆరుమాసాల క్రితం—నేను ఒక వూహాప్రపంచంలో జీవించాను. నా అందాన్ని గురించి నాకెంతో గర్వం వుండేది.

ఎర్రగులాబి పువ్వులాంటి నా మేనుతో, యౌవ్వనాన్ని ఒలికించే పల్చటి 'పూనా' చీరను కట్టుకుని, మోకాళ్ళ వరకూ వున్న వాల్జడతో, సొంపుగా నేను బజారువెంట నడుస్తూ వుంటే, యువకుల 'పటాలం' దిగ్భ్రాంతి చెంది కళ్ళార్పకుండా నన్నే చూసేవారు! అది నాకొక తృప్తి నిచ్చేది!

నేనాశించివుంటే—నా చిటికెనువేలుని కదిలించివుంటే వేలకొద్దీ యువకులు నా కాళ్ళవద్దకు వచ్చిపడేవారు! నా 'ఒక్క చిరునవ్వుకు' ఎంతోమంది యువకులు తమ ప్రాణాల్ని త్యాగం చెయ్యడానికి సిద్ధమయ్యేవారే! కాని నేను సగర్వంగా లోకాన్ని చూసి నవ్వాను! మానవుడి మదిలో మంటలురేపి బాధపడ్డం చూస్తే నాకు సరదా!

నా తలిదండ్రులు నా పెళ్ళిప్రయత్నాల్లో నిమగ్నులయ్యారు! నాకూ పెళ్ళంటే అయిష్టంలేదు! మగువలకూ మగవాళ్ళకీ ఆ బంధం ఎంత అవసరమో నాకు తెలుసు! సరైన సమయంలో సరియైన కార్యము సక్రమంగా జరగాల్సిన అవసరాన్ని నేనూ గుర్తించేను. కాని అందుకోసం నా విలువైన అందాన్ని—దాని విలువ తెలియనివాడికో, కురూపికో దాసోహం చెయ్యడానికి నా మన—సంగీకరించలేదు!

నాకు తగినవాడితో, అతని అందం, బుద్ధి, శక్తి వీటితో నా సర్వస్వాన్నీ మిళితం చేసుకొని సుఖంగా బ్రతకాలని నా కోరిక! న్యాయమైన కోరికేగా?

నాయీ అభిప్రాయాన్ని నా తలిదండ్రులకు చెప్పాను. వాళ్ళిద్దరూ అంగీకరించారు. అమా నాన్నకి నా మనోభావం బాగాతెలును నేగాకా ఆయనకు కూడా నా 'అందం' విషయంలో కాస్త గర్వంకూడా వుండేది! కాబట్టి ఆయన నాకు తగ్గ వరుడికోసం అన్వేషణ మొదలెట్టారు!

నావద్దకు చాలామంది యువకుల ఫోటోలు వచ్చాయి! అప్సరసను తలదన్నే అందమైన అమ్మాయిని—సిరిసంపదల్తో తులికే ధనికుని ఏకైక పుత్రికను పెళ్ళి చేసుకోవాలన్న ఆశ ఎవరికి వుండదు? కాని ఆ ఫోటోల్లో ఒక్కటికూడా నాకు నచ్చలేదు!

నాకాశ్చర్యం వేసింది — యీ ఫోటోలు పంపిన దద్దమ్మలు తమ మొహాల్ని అద్దంలో ఎప్పుడూ చూసుకోలేదేమో?

చివరకు 'వారి' ఫోటో నావద్దకు వచ్చింది! దాన్ని చూచినపుడే—నా మనసును వారికి అర్పించేశాను! ఇంత అందమైన మగవాడుకూడా లోకంలో వుంటాడా అని ఆశ్చర్యపడ్డాను. రవీంద్రునిలా కేశాన్ని కత్తిరించుకుని, చాలా అందమైన దుస్తుల్లో గంభీరంగావున్న ఆయన రూపాన్ని చూసినకొద్దీ నా మనసు పులకరించింది! ఆ ఫోటోలోని రూపానికి నన్ను నేను అర్పించుకున్నాను.

ఆ రాత్రంతా ఆ ఫోటోని నా వొళ్ళో పెట్టుకున్నాను; మెలుకువ వచ్చినప్పుడల్లా దాన్ని ముద్దుపెట్టుకున్నాను. కాబోయే భర్త అందం నన్ను చలింపజేసింది!

నా 'బాధ'ను మా పెద్దలు అర్థంచేసుకున్నారు. తమ ఏకైక పుత్రిక బాగోగుల కోసం—ఆ ఫోటో స్వంతదార్లకు వ్రాసి నా పెళ్ళికి ఏర్పాట్లన్నీ చేశారు. 'వార్ని' చూసి వచ్చి మా నాన్నగారు తృప్తితో, 'సీలా! నువ్వు అదృష్టురాలివి. అబ్బాయ్ చాలా అందంగా వున్నాడు; సాత్వికుడు! అట్టే చదువుకోలేదు కాని యోగ్యుడు, గొప్ప ఆస్తిపరుడు. తండ్రిలేడు. తల్లివున్నది. ఒట్టి అమాయకురాలు! నీకే లోటు రాదు', అన్నారు.

చివరకు పెళ్ళి జరిగింది! ధనవంతుల యింటి పెళ్ళంటే మాటలా? పెళ్ళి సందడిలో ఎట్లాగో వీలుచూసుకుని దొంగ చాటుగా 'వార్ని' చూశాను! నా మనసు పరవశంతో వురకలువేసింది. గిరిజాలజుట్టు, వెడల్పయిన మదురు, అందమయిన కళ్ళు,

శాలిమైన ఛాతి—నా మనసు క్షైపెక్కింది. నా ఆ దృష్టాన్ని తలచుకుని మురిసిపోయాను.

పెళ్ళి హడావుడి అయిపోయిన తర్వాత నా హృదయంలో తన రూపసౌందర్యాన్ని ముద్రించి ఆయన వెళ్ళిపోయారు! ఊహతో కొన్నిరోజులు గడిచిపోయినై!

ఎన్నో మధుర స్వప్నాలను హృదయంలో దాచుకొని అత్తవారింటికి బయలుదేరాను! 'వారి'తో ఎలా మాట్లాడాలో, ఎలా పరిచర్యలుచేసి తృప్తిపర్చాలో, ఆలోచిస్తూ వుండిపోయాను.

అత్తవారింటిలో కాలుపెట్టాను! ప్రప్రథమంగా అక్కడ నన్నాశ్చర్యపర్చిన విషయం—అత్తగారి స్వభావం! ఎన్నో కథల్లో చదివాను, ప్రాక్టికల్‌గా చూశాను కూడా—'అత్తగార్లు'చేసే రభసను గురించి! కాని మా అత్తగారు వొట్టి అమాయకురాలు! మా నాన్నగారు వెళ్ళిపోయిన తర్వాత ఆవిడ నన్ను పిలిచి బొంగురుపోయిన కంఠంతో, 'నీలా! జంబు చంటిపాపలాంటివాడు! చాలా గారాబంగా పెంచాను. నా ఒక్కగాని ఒక్కకొడుకు! నాన్నగారు చిన్నతనంలోనే పోయారు. లౌకిక వ్యవహారాలేవీ వాడికి తెలియవు! నువ్వే ఆతణ్ణి జాగ్రత్తగా చూసుకోవాలి' అంది.

నేను మౌనం వహించాను. ఆవిడే మళ్ళీ అన్నది: 'నేనూ పెద్దదాన్నైపోయాను. ఆటేకాలం బ్రతకను! దిక్కులేని నా 'జంబు'ని నువ్వే చూస్కోవాలి!' ఆమె ఏడ్చింది.

ఆవిడ కంటతడి చూసి నాకు చిరాకు కలిగింది. 'ఈ పెద్దవాళ్ళంతా యింతే' అనుకున్నాను!

నా మనసులో కోర్కెలు చెలరేగాయి! అత్తగారు లేని సమయంచూసి వారితో మాట్లాడాలన్న ఆరాటం ఎక్కువైంది! అత్తగారి సమక్షంలో మావారితో మాట్లాడటానికి సిగ్గేసింది. వారుకూడా నాకు మల్లె సిగ్గుపడి వూరుకున్నారేమో అనుకున్నాను! నేను వంటగది దాటి బయటకు వచ్చేదాన్నికాను!

మూడురోజుల తర్వాత ఓ సాయంత్రం మా అత్తగారు గుడికి వెళ్ళినపుడు సిగ్గుతో ఆయన గదిలో అడుగుపెట్టాను.

'నీలా!' అన్నారాయన.

ఆయన కంఠాన్ని విన్న నాకు పిడుగు పడినట్లయింది! ఆయన కంఠం ఆడవాళ్ళకుమల్లె 'కీచు' మని ధ్వనించింది. అదీగాక ఆడదానిలా ఆయన నడక కూడా వొయ్యారం వొలకబోసింది!!

మనసును ఏదో వొకటి భారంగా నొక్కినట్లు అనిపించింది.

'నీలా...! అమ్మ గుడికెళ్ళింది! నాకు నీతో మాట్లాడాలని ఎంతో ఆశ! కాని అమ్మ వున్నపుడు సిగ్గేసింది. ఇలా రా' అన్నారాయన.

ఆయన కంఠం నాకు అసహ్యాన్ని కలిగించింది. బాధను అపుకుని ఆయన్ని చూడకుండా, ఆయన గదిని పరిశీలించాను.

ఆ గదిలో ఎన్నో ఫోటోలు వున్నాయి! కాని అన్నింటికన్నా 'ఆయన' పోలికలోవున్న ఒక స్త్రీ ఫోటో నన్నాకర్షించింది. ఓకే



కే ఆ ఫోటో ఆయన తోబుట్టువు కాబోలు అనుకున్నాను. కాని ఆయన తోబుట్టువు ఎవ్వరూ లేరని మా నాన్న గారు ఖచ్చితంగా చెప్పారే!

'ఈ ఫోటో ఎవరిది? మీ చెల్లెలా?' అని అడిగాను!

ఆయన నవ్వారు! ఛీ! ఆ నవ్వు, ఆడ వాళ్ళ నవ్వే ఆ నవ్వును భరించలేక పోయాను!

'ఆ ఫోటో నేనే!' అన్నారాయన.

నాకొక అనుమానం కలిగింది ఆయన మాటలు విని! ఒకవేళ 'వారు' ఒక గొప్ప నటుడు కావచ్చు. స్త్రీ వేషంలో ఆ ఫోటో తీసుకునుండవచ్చు. తను కొత్తగా భార్యతో మాట్లాడుతున్నపుడు ఆమెను 'తమాషా' చెయ్యడానికి యిలా కంఠం మార్చుకుని నటిస్తున్నారేమో ననుకున్నాను.

కుర్చీలో కూర్చున్న ఆయన పిలిచారు: 'నీలా! ఇలా దగ్గరకు రా!'

వెళ్ళాను. కుర్చీ ఎదురుగా బల్లమీద ఒక పెద్ద నిలువుటద్దం వుంది. బల్లమీద రకరకాల సెంటు బాటిల్స్, స్నో డబ్బాలు, హెర్పిన్నులు, వాసనతైలాలు వగైరా వస్తువులు వున్నాయి! ఆడదాని మేకప్ రూంలా వున్నదిఆయన గది!

వారు తల దువ్వుకుంటున్నారు. 'నీలా! ఈ 'హెర్ పిన్ను' సరిగాపెట్టు ,చూద్దాం' అన్నారాయన.

నేను సంతోషంగా ఆయన చెప్పినట్టు చేశాను. ఆయన నాకు ఏదో గొప్ప 'నటన' ప్రదర్శించనున్నారని భావించాను. ఆ కళలో ఆయన నేర్పరితనాన్ని చూడాలని ఉబలాట పడ్డాను.

ఎంతో నాజూకుగా తల దువ్వుకున్నారు. తర్వాత ఉడుకులాం రాసుకున్నారు. తర్వాత గంధం పూసుకున్నారు.

ఆయన స్త్రీ వేషాన్ని చూడాలన్న ఆరాటం ఎక్కువైంది. అంతలో 'నీలా!' అన్న అత్తగారి కంఠం వినిపించగానే నేను వెళ్ళిపోయాను గదినించి.

ఆ రాత్రి బాగా నిద్రపట్టింది. 'ఆయన' కళామేధస్సును చూసేలోగా పెనకంలో పుడక లాగావచ్చిన మా అత్తగార్ని లోలోపల తిట్టుకున్నాను. మరునాటిరోజు నేను లేచినపుడు చాలా ప్రొద్దుపోయింది. కళ్ళుతెరిచేసరికి 'వారి' గదినుంచి ఏవో కేకలు వినిపించాయి!

## సుఖజీవితం

మావారికీ అత్తగారికీ ఏదో ఘర్షణ జరుగుతోంది.

అత్తగారు వుచ్చస్థాయిలో అరుస్తోంది! 'ఓరి పాపాత్ముడా! నన్నెందుకిలా క్షోభ పెడ్తావురా! దేవుడిదయవల్ల కోడలింకా మేలుకోలేదు! ఏమ్! ఏమిట్రా యీ పిచ్చి పనులు? ఆ చీరను యిలా యివ్వరా! ఆ చీరవిప్పేసి ముందువెళ్ళి మొహానికి పూసుకున్న పసుపుని కడుక్కో...!'

చీరా...? పసుపు...!! నాకు అయోమయంగా వుండింది. వారిగది గోడచాటుగా నిల్చుని విన్నాను.

'వీల్లేదమ్మా...! నేను ఇవాళ చీరనే కట్టుకుంటాను. నీలకు నేను చీర కట్టుకోవడమంటే ఎంతో సంతోషం!'

'ఓరి రంకు! నీలకు తెలిసిపోయిందా ఇదంతా?'

'అమ్మా...! నాకు చాలా కోపం వస్తోంది! మర్యాదగా ఆ చీరనూ గాజుల్నీ యిస్తావా లేదా?'

నా బుర్ర వేడెక్కింది. ఏమిటీ నాటకం? తలుపుసందులోనుంచి చూశాను.

అత్తగారి చేతుల్లో గాజులూ, చీరా వున్నాయి! 'వారు' మొహానికి సుమంగళికి మల్లె పసుపును దిట్టంగా పూసుకుని, ఆచీర, గాజుల్ని యివ్వమని హడావడి చేస్తున్నారు. అత్తయ్యే నెగ్గింది. ఆయన్ని పక్కకు నెట్టేసి చీరను, గాజులనూ అల మారిలో పెట్టి తాళంవేసి లోపలికి వెళ్ళిపోయింది.

నాకీ సంఘటన అయోమయంగా తోచింది. నా గదిలోకి వెళ్ళి మళ్ళీ పడుకున్నాను.

ఎవరో దగ్గరకొచ్చిన అలికిడివిని కళ్ళు తెరిచాను. వచ్చిందెవరో కాదు! 'వారే!' మెల్లగా పిల్లిలా నడిచివెళ్ళి నా బీరువాలో నుంచి ఒక 'బ్రేజియరు', రవిక, చీర, మూడింటినీ చుట్టుకుని బయటకు నడిచారు! అదే సమయంలో అత్తగారు గదిలో కొచ్చింది.

'అదుగో! మళ్ళీ అల్లరా? యివ్వరా అవన్నీ యిలా యివ్వు!'

'వీల్లేదు! వీల్లేదంటే వీల్లేదు!' అరిచారు ఆయన.

అప్పుడే మేల్కొంటున్నట్టు లేచి కూర్చున్నాను. నేను లేవడం చూసి ఆయన 'నీలా! ఇటుచూడు, నేను చీర కట్టుకుంటానంటే అమ్మ వారిస్తోంది! నాకు సిగ్గేస్తోంది!' అన్నారు.

అత్తగారి కోపం హద్దులు దాటింది. ఆయన చేతుల్లోని బట్టలను లాగి పార వేసింది. ఆయన్ని చర చర లాక్కువెళ్ళి పక్కగదిలో బంధించేసింది. కొంతసేపు ఆయన అరిచారు. తర్వాత ఆగిపోయారు.

అత్తగారు నా మొహం చూడ్డానికి సిగ్గుపడింది కాబోలు! ఏదో పనిలో వున్నట్టు నటించింది.

నా మనసు ఆందోళన పడసాగింది. నిజాన్ని గ్రహించాలని ఆవిడవద్దకు వెళ్ళాను.

'అత్తయ్యా! ఏమిటిదంతా?' అడిగాను.

ఆవిడ కాస్త తటపటాయించింది. ఏవేవో సాకులు చెప్పడానికి ప్రయత్నించింది. నేను వొదల్లేదు. ఆవిడ అన్నది. 'నీలా! వాడికి యిది ఒక వెర్రి—ఎప్పుడయినా ఇలా ఆడదానివేషం వెయ్యాలని గోలపెడ్తాడు.'

'ఆ ఫోటో! ఆడదాని వేషంలో?'

'వాడిదే!' అంది ముక్తసరిగా!

నాకు నవనాడులూ జారిపోతున్నట్టు అనిపించింది. ఒకవేళ 'ఆయనకు పిచ్చి కాబోలు?' అన్న అనుమానం నన్ను వేధించ సాగింది. 'అదెట్లా సంభవం? పెళ్ళి సందర్భంలో ఎంతో నాజూకుగా నడుచుకున్నారే?' అన్న తలంపు మరో వైపు! ఏమీ తోచక సతమతపడ్డాను.

కాని నా అనుమానం రెండు రోజుల్లో తీరిపోయింది. ఆరోజు ఆలయానికి అత్తగారు వెళ్ళినతర్వాత 'ఆయన్ని' సమీపించాను!

అప్పుడే నాకు నిజం స్ఫురించింది. అయ్యో! 'ఆయన' కాదు—'అతను' కాదు—మగవాడు కాదు—ఆడదీ కాదు—'వారు' అని నేను భావించిందీ, పూజించిందీ అంతా ఒక 'అది'—అంటే అది—పేడి—నపుంసకుడు!!!

పిడుగు పడినట్టయింది. చిరునవ్వులు చిందిన నా జీవితం, పరవళ్ళు తొక్కిన నా యౌవ్వనం ఒక్కసారిగా శకాన్యంలోకి దిగజారిపోయింది. కళ్ళలోనుంచి అశ్రువులు ధారలుగా కారాయి!




ఎక్కడ
లైఫ్‌బాయ్ వున్నదో
అక్కడ ఆరోగ్యము వున్నది

లైఫ్‌బాయ్‌తో స్నానము మీకు అత్యంత ఆరోగ్యమైన హాయి గొలుపుతుంది.
లైఫ్‌బాయ్‌లో ఉత్తమమైన సబ్బులో వుండ వలసిన అన్ని సుగుణములే గాక ఇంకా ఎన్నియో వున్నవని మీరు తెలిసికొందురు.

లైఫ్‌బాయ్ మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది

హిందుస్తాన్ లీవర్ ఉత్పత్తి

# సుఖజీవితం

ఆ యేదుపుతో పాటు అత్తగారిమీద చెప్పలేని కోపం వచ్చింది. పేడిని కన్నది చాలక, కుట్రచేసి నా బ్రతుకును నాశనం చేసింది. అందుకే కాబోలు 'పార్టీ'—కాదు—దానిని మా నాన్నగారిముందు అసలు మాట్లాడనివ్వలేదు. అందుకే కాబోలు పెళ్ళి సమయంలో 'అల్లుడికి ఆటే అడం బరాలు వద్దని' అప్పుడపుడు చెప్పింది!

రోషం, అవమానం నాలో తుఫాన్ని రేపింది.

'రాక్షసీ! నా జీవితాన్ని సర్వనాశనం చేశావేమే!?', అరిచాను ఆవిడ రాగానే!

తృళ్ళిపడింది ఆమె!

'అమ్మాయ్! నెమ్మదిగా మాట్లాడు! అసలు ఏం జరిగింది?'

శాంతంగా వచ్చిన ఆమె మాటలు నాకోపాన్ని యింకా రెచ్చగొట్టాయి.

'ఛండాలీ! 'పేడీ'కి పెళ్ళిచేసి తమాషా చూడాలనుకున్నావా? పేడీని కన్నది చాలక పెళ్ళి కూడా చేసి 'ముచ్చట' చూడాలను కున్నావా? పాపిష్టిదానా, నన్ను సర్వనాశనం చేశావే?'

ఆమె దిగ్భ్రాంతి చెందింది. 'నిజంగానా? ఎప్పుడైనా చీర కట్టుకుంటే... పేడిగా మారిపోతాడా?...లేదు...'

'అవు...అంతటితో ఆపు...'వాడు' అనకు...అది...అది...'

దుఃఖాన్ని ఆపుకోలేక మంచంమీద వాలాను. ఇల్లంతా శ్మశానంలా కనిపించింది. హృదయంలో అగని తుఫాను చెలరేగింది.

నాయీ దుస్థితికి కారకులెవరు? సగర్వంగా నేను నిర్మించుకున్న 'గాలి' మేడలు— అహంకారంతో నిల్పిన పునాది—నిలువునా కూలిపోవడానికి కారణం ఏమిటి?

'అందమైన వరుణ్ణి కోరుకోవడం జరిగితే—దానికి దైవం విధించిన శిక్ష యింత ఘోరంగా ఉండాలా??

ఎవరో నా వీపుమీద తట్టారు. ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను. అత్తయ్య!!

'నీలా' అన్నది నెమ్మదిగా.

నాకిప్పుడు కోపంరాలేదు. భరించలేని హృద్భారంతో వెర్రిగా శూన్యంలోకిచూశాను.

'నీలా...! నేను అనుకోలేదు! నిజంగా వెర్రిబాగులవాడనుకున్నాను! చిన్నతనంలోనే వాళ్ళనాన్నగారు పోయారు, నేను అంచేత వాణ్ణి చాలాచాలా గారాబంగా పెంచాను. ఆరోజుల్లో వాడికి జడవేసి ఒకటమ్మాయిలా అలంకరించి చూడ్డంలో నాకొక తృప్తి కలిగేది. అంచేతే వాడు ఆటే చదువుకో లేదు; గడపదాటి బయటకు వెళ్ళలేదు. వయసొచ్చిన తర్వాతకూడా అప్పుడప్పుడు చీర కట్టుకోవాలని గోల పెట్టేవాడు. నేనూ అడ్డుచెప్పేదాన్నికాను. వాడివద్దవున్న గాజులు, కమ్మలు వగైరాలన్నీ నేనేకొనిచ్చాను. ఇవన్నీ ఒకానొకరోజు రానున్న నాకోడలుకు ఉపయోగిస్తాయనుకున్నాను. నీలా ...! కొడుక్కి పెళ్ళిచేసి మూడాలనుకున్నానుగాని, ఆ ఆశ యిలా పరిణమిస్తుందనుకోలేదు. నీలా...! నేను నిర్దోషిని. అబ్బాయి సంగతి 'ఇది' అని నాకు తెలియదుతల్లీ...తెలియదు.'

ఆవిడ ఒక్క ఊపిరితో చెప్తుతోంది. తెలిసిచేసిన తప్పుకాదది! ఆమె తప్పేముంది? కాని...కాని...నా బ్రతుకు ఏంకావాలి?

ఆమె మళ్ళీ అంది: 'వాణ్ణి సిగ్గు పెద్దల ముందు మాట్లాడనివ్వకపోవడానికి కారణం కూడా ఇదే—అతనిమాటలువింటే ఆకంఠం వింటే—పెళ్ళికి అంగీకరించరేమోనని! కాని నీలా...! నేను ఊహించలేదమ్మా! నీ జీవితాన్ని యిలా చెయ్యటంవల్ల నాకేం లాభం...?'

ముసలావిడ 'లబోదిబో' మని కొట్టుకుంది; ఏడ్చింది! నాకు జాలేసింది.

ఆరాత్రికే ఆమెకు తీవ్రమయిన జ్వరం వచ్చింది. ఏవేవో మాట్లాడుతోంది జ్వర తీవ్రంలో!

తన పొరపాటు క్షమించమన్నది.

ఇనప్పెట్టె తాళాలు నాకిచ్చింది.

రెండురోజుల్లోనే ఆమె శాశ్వతంగా కన్ను మూసింది. ఆచావుని మా నాన్నగార్కి కూడా తెలుపలేదు. అంతిమ్మ క్రియలన్నీ రాత్రికి రాత్రే ముగింపజేశాను. నేనూ 'అది' కలిసి 'భార్యా భర్తలుగా' నిల్చి అన్నీ ముగించాం.

ఇప్పుడింట్లో మేమిద్దరమే! ఆ పెద్ద భవనం నా వశం; ఇనప్పెట్టె తాళాలు నా వశం. డబ్బుతో కులకొచ్చు; కాని డబ్బు భర్తవుతుందా?

కాదన్నవిషయాన్ని ఎవరొప్పుకుంటారు? నాకు 'భర్త'లేడు ; నా పెళ్ళి వొక బొమ్మ లాట! నాకింకా కన్యాత్వం పోలేదంటే—ఎలా ఎలా అనగలను? — వింటే నవ్వుతారు!

మెళ్ళోవున్న తాళి—దీనికి అర్థం?

నాన్నగారివద్దకు వెళ్తే? కాని ఏం లాభం? ఆయనేం చెయ్యగలడు? ధర్మరీత్యా, చట్టరీత్యా నాకింకా 'అసలు' పెళ్ళి కాలేదంటే—ఆయనకీ విషయం చెప్పడమెట్లా?

అయింట్లనీ, బీరువాలనీ, నగలనీ, డబ్బునీ చూశాను. ఒక్క తీర్మానానికి వచ్చాను. ఈ సిగ్గుచేటుని అందరికీ చెప్పి 'డమారం' వాయించేబదులు జీవితాన్నే ఒక 'నటన'గా గడపాలనుకున్నాను. 'దాన్ని' అలాగే దాని యిష్టానికి వదిలేసి నేను వూళ్ళోని అమ్మాయిలతో తిరగడం మొదలెట్టాను.

'ఆధునిక మహిళామండలి'లో చేరాను. లీవిగా ముస్తాబయి ఆ సంఘం తరఫున మహిళల అభ్యుదయానికి పాటుపడసాగాను. పైకి ఎంత నిండుగా కన్పించినా లోలోపల దిగులుగానే వుండేది. నా దాంపత్య జీవిత నిజస్వరూపాన్ని సమాజం పసిగడ్తే, నా సామాజిక విలువలు అడుగంటిపోతున్నట్లు భయం వేసింది. భార్యాభర్తలెవరైనా కంట బడితే నా మనస్సు ఉసూరుమనేది! చిన్న పిల్లల్ని చూస్తే తాపం! అన్నిటికన్నా ఎంతో బెంగతో, నా గర్వానికి కారణమైన నా అందం దిగజారిపోతోంది. ఏరోజుకైనా నాయీ నటన కంపించిపోక తప్పదు.

ఆరోజు రానేవచ్చింది; నా జీవితాన్ని నిరయించే ఆరోజు!

ఆరోజు నా ఫ్రెండ్ సీత వచ్చింది. నా స్నేహితురాళ్ళెవ్వర్ని రానివ్వను. ఒకవేళ ఎవరైనా వస్తే కూడా 'వార్ని'—కాదు—'దాన్ని' బయటకు రాకుండా జాగ్రత్త పడ్తాను. అనుకోకుండా సీత రావడంతో నేనేం చెయ్యలేకపోయాను.

కాసేపు లోకాభిరామాయణం ముచ్చటించినతర్వాత, సీత కొంటెకళ్ళు 'అదీ' నేనూ కలిసి తీసుకున్న పెళ్ళి ఫోటోమీద కేంద్రీకృతమయినై. 'సరైనజోడు! ఏమే నీనా! ఇంత సుందరుడైన భర్తను వదిలి ఒంటరిగా సంఘసేవలో పూనుకోవటానికి నీకెలా మనసొచ్చిందే!' అడిగిందిసీత!

నా మనసు చివుక్కుమన్నది. ఆవిడ వదల్లేదు! 'అది సరేగాని నిన్ను వదిలి ఆయనెలా వుండగలుగుతున్నాడు? ఇంతటి పరిమళాన్ని వెదజల్లేపుష్పాన్ని, మరెవరైనా వాసన చూస్తారేమోనన్న భయం. ఆయనకు

కలుగదా?'

లేని నవ్వును తెచ్చిపెట్టుకుని, 'ఆయన ఒక బుక్‌వర్మ్' అన్నాను.

'సరేలేవోయ్! ఆయన అలా వుంటే యీ 'వర్మ్'ను యింకెవరైనా దోచుకుపోగలరు' అని కొంటెగా నా బుగ్గను తాకింది.

అంతలో ఎవరో వెనుక తలుపు తెరిచిన శబ్దం! సీత తిరిగిచూసి, 'నీకోసంఎవరో...' అన్నది.

నేను తిరిగి చూశాను—'అది'!

చీరతో, మొహానికి స్నో పవుడరు వేసికొని, చేతులకు గాజులు తొడుక్కొని తలమీద పువ్వులతో...అది...!

పట్టరానికోపంతో లేచివెళ్ళి 'దాన్ని' చరచరలాక్కెళ్ళి దానిగదిలోకినెట్టి, కోపంతో 'ఓసీ శనీశ్వరా. నీవు యిపుడెందుకువచ్చావ్? నీ నాటకాన్ని యిప్పుడే ప్రదర్శించాలా?' అని అరిచాను.

'నీలా...' అని ఏదో చెప్పడానికి నోరు తెరిచేలోగా, 'షటప్' అని దాని గదితలుపులు మూసి వచ్చాను.

అయోమయంతో వున్న సీతవద్దకువచ్చి నవ్వుతూ, 'అది ఓపిచ్చిది!' అన్నాను.

'అలాగా! నేనెవరో గొప్పింటి పిల్లను కున్నా...! చాలాబాగా డ్రెస్ చేసుకున్నది కదూ?' అంటూ లేచింది సీత.

వెళ్తూ సీత అంది: 'నీలా...! రేపు మావారితో సినిమాకెళ్తున్నా... నువ్వుకూడా మీవారితో రావాలి...ష్యూర్‌గా వస్తావా?'

నేను తల వూపాను. భర్తతో సినిమాకి? నాకెక్కడ భర్త? భర్తంటూ

# సుఖజీవితం

ఒక్కడుంటేకదా, ఆయన నా అందంమూసి మైమఅచి నన్ను తనలో ఐక్యం చేసుకోవటానికి?! నాకు భర్త లేడుగా?!

నిలువుటద్దంలో, తరగిపోతోన్న నా అందాన్ని చూశాను—నా అందం, యౌవ్వనం హొంపులు—అన్నీ వ్యర్థం కావాలి? ఎందుకీ అబద్ధపు బ్రతుకు బ్రతకాలి?

దీర్ఘంగా ఆలోచించాను. చివరకు క్రూరమైన ఒక్క ఆలోచన తట్టింది. అవును., ఒక్కటే మార్గం...'దాన్ని' తొలగించాలి! కాకపోతే నేను తొలగిపోవాలి! బజారికి వెళ్ళి విషం కొనుక్కొని వచ్చాను.

హత్య! నేను హత్య చెయ్యాలని నిశ్చయించుకున్నాను.

ఈ భయంకర విషంతో 'దాన్ని' హతమార్చాలి! చీకటి పడులోంది. నా మేను వొణకసాగింది!

ఇంకో ఆలోచన తట్టింది. ఈ ఆఖరి క్షణాల్లోనైనా 'దాన్ని' కొంత సంతోషపెడ్తామనిపించింది! దానివద్దకు వెళ్ళి లాలనగా మాట్లాడసాగాను.

'అది ఉప్పొంగిపోయింది. నేను ఆయింటికి వచ్చినప్పట్నుంచి 'దాని'తో అలా ఎప్పుడూ మాట్లాడలేదు. 'దాని'మీద వున్న అసూయతోనే నేను ఎప్పుడూ మాట్లాడలేదు. ఉన్నట్టుండి నా యీ 'ప్రేమ'కు అది ఉక్కిరి బిక్కిరైపోయింది.

అది అంది: 'నీలా...! నువ్వు రుక్మిణి నాట్యం చూడలేదు కదూ? నేను ఆడతాను! నువ్వెప్పుడూ కోపంగా వుంటావ్! కాకపోతే నీకెప్పుడో ఆడి చూపించేవాణ్ణి' అంది.

'ఆడండి! చూస్తాను'

వెంటవెంటనే అది లోపలికెళ్ళి కొంతసేపట్లో భరతనాట్యానికి కావలసిన సకల అలంకారములతో వచ్చింది. ముక్కుపుడకలు, కమ్మలు, వాల్జడ, కాళ్ళకు గజ్జలు—ఎంతో ముచ్చటగా డ్రెస్ చేసుకున్నది.

నాట్యం ప్రారంభించింది.

'కళ్ళు కైపెక్కెనవే—ఓ చిలుక—
కన్నయ్యను చూడంగనే'

పాటకు తగ్గ భావమును బ్రహ్మాండముగా అభినయం చేసింది.

నేను ఆశ్చర్యపోయాను. ఆ పరిస్థితిలో, ఆడదాని దుస్తుల్లో, నాట్యం చేస్తున్న 'దాన్ని' చూసి వాళ్ళెవ్వరూ దాన్ని అందమైన 'పేడి' అనుకోరు! చక్కటి అందచందాలుగల 'సుందరి' అని అపోహపడ్తారు. ఏ మొగాణ్ణైనా ఆకర్షించగల అందం! దేనికీ పనికిరాని 'దీని'కి కూడా ఇంత అందం వుంది. దీన్నెందుకు హతమార్చాలి? లోకంలో ప్రయోజనంలేని 'అందాలు' ఎన్నో వున్నై! 'ఇది'కూడా వుంటేవుండని! దానివల్ల నా బ్రతుకు పాడవుతున్నది—అంటే నేనే జారుకోవచ్చుగా?

అలసిపోయి నాట్యాన్ని ఆపింది. 'విషం' కలిపి టేబులు మీదవుంచిన పాలగ్లాసుని ఆశతో అందుకోబోయింది. నేను తటాలున ఆ గ్లాసుని అందుకుని కిటికీనుంచి బయటకు విసిరిపారేశాను.

'అందులో ఏదో పడ్డది! వేరే పాలు తాగుదాం' అన్నాను.

వేరే పాలు తెచ్చియిచ్చాను. గబగబతాగేసి పడుకుంది.

నా నిశ్చయానికి తిరుగులేదు. కాసేపాగి 'తాళి'ని మెళ్ళోనుంచితీసి బీరువాలో పెట్టి, 'దాన్ని'లేపి అన్ని వస్తువులనూ జాగ్రత్తగా చూసుకోమనిచెప్పి తాళం చెవుల్ని దానికిచ్చి బయలుదేరాను. ఏమైనాసరే! వాన్నదగ్గరకు వెళ్ళిపోవాలి!

ఏరికోరి చేసుకున్న భర్తతో దాంపత్యాను బంధాన్ని చవిచూడాలని వచ్చాను. ఏసుఖానికి నోచుకోకుండా తీరని బాధను అనుభవిస్తూ తిరిగి పుట్టింటికి వెళ్తున్నాను. నా సుఖజీవితాన్నింటే మీకళ్ళు అశ్రుపూరితమైపోతున్నాయి కదూ? ●

# జూనియర్ల ప్రాణాల్తో సీనియర్ విద్యార్థుల చెలగాటం!

పిల్లల్ని ఊరుకాని వూళ్లో వుంచి చదివించడమంటేనే తలిదండ్రులికి ఒక సమస్య.

కాలేజీల్లోను, హాస్టళ్లలోను కొత్తగా చేరిన విద్యార్థులకు ఇప్పుడు జరుగుతున్న అన్యాయాల్ని చూస్తూ ఏ తలిదండ్రులూ తమ పిల్లల్ని దూరప్రాంతాల్లో పై చదువులకోసం ప్రోత్సహించరు!

ఇటీవల్ల కోయంబత్తూరులో జరిగిన దుస్సంఘటన, విద్యార్థిలోకానికి అంతటికీ తలవంపులు తీసుకువచ్చింది. తలిదండ్రుల భయాన్ని రెచ్చగొట్టింది. విద్యాధికారుల్ని విద్యావేత్తల్ని కలచివేసింది. ప్రభుత్వ సానుభూతిని కూడా అందుకుంది.

'ఇంజనీరింగ్ కాలేజి మొదటిసంవత్సరం విద్యార్థి సీనియర్ల తీవ్రమైన హింసను భరించలేక హాస్టలులో ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు.' ఇంతకంటె ఘోరం మరొకటి వుండదు!

విద్యార్థులకు కొత్తవాళ్ళ గురించి తెలుసుకోవాలనే కుతూహలం ఉండడం సహజమే.

సీనియర్లు జూనియర్ల పుట్టుపూర్వోత్తరాలను ప్రశ్నించి అంతటితో ఊరుకుంటే ఏ గొడవా ఉండదు.

'జూనియర్లు వెంటనే సమాధానం ఇచ్చినా చిక్కే. ఇవ్వకపోయినా చిక్కే. మా నుంచి కొంచెం తెలివైన సమాధానం వస్తే మాత్రం సీనియర్లు సహించరు. వెంటనే ఏదో ఒకవిధంగా మమ్మల్ని హింసించడమే పనిగా పెట్టుకుంటారు' అని అటువంటి బాధకు గురిఅయిన ఒక విద్యార్థి చెప్పాడు

ఒకరినొకరు అల్లరి పెట్టుకోవడమనేది మగపిల్లల్లోనేకాదు, ఆడపిల్లల్లో కూడా కనిపిస్తూ వుంది.

'తమ అధిక్యతని చూపించుకోవడం కోసమూ, ఓర్వలేని తనంవల్లనూ మమ్మల్ని హింసిస్తూ వుంటారు'అంది ఒక విద్యార్థిని.

'సీనియర్లు మమ్మల్ని బొత్తిగా 'బేబీ' అని చేసి మాట్లాడ్డం ఎంతో కష్టంగా వుంటుంది' అని మరో కాలేజీ విద్యార్థిని అన్నది.

ఒక మెడికల్ కాలేజీలో కొత్తగా చేరిన బాలికల్ని సీనియర్ విద్యార్థులు నిర్బంధించి కుటుంబనియంత్రణ గురించిన ప్రశ్నలు వేస్తున్నారట!

రాళ్లు విసరడం, రకరకాల పేర్లతో ఉడికించడం, ఆకాశరామన్న ఉత్తరాలు రాయడం మామూలే!

ఈ బాధలు భరించలేక ఎంతోమంది బాలికలు కాలేజీ విడిచిపెట్టి ఏడుస్తూ ఇళ్లకు వెళ్ళిపోయారూ అంటే అర్థం లేక పోలేదు!

అందరికీ ఒకేరకమైన మానసిక వ్యవస్థ ఉండదు. కొందరు ఎంత గట్టిగా వేళాకోళమాడినా తేలిగ్గా తీసుకుని నవ్వేస్తారు. మరికొందరు పరిహాసమాటను కూడా భరించలేరు. ఇటువంటివారు మనోవేదనని భరించుకోలేక ఎంతటి దారుణానికయినా పాల్పడతారు!

కాలేజీల్లోను హాస్టళ్లలోను జరుగుతున్న అక్రమాలు ఈరోజువి కావు. ఎన్నాళ్ల నుంచో పారంపర్యంగా వస్తున్నవి. వీటికొక ఫుల్‌స్టాప్ పెట్టాలి!

విద్యార్థులు మితిమీరి ప్రవర్తించడం, హద్దుదాటి సంచరించడంలాంటి స్వభావాన్ని సున్నితంగా చక్కబెట్టవలసి వుంటుంది. శిక్షకంటె ముందు క్రమశిక్షణ అవసరం!

'సీనియర్లు జూనియర్లతో వేళాకోళమాడడమూ, చెలగాటమాడడమూ సహజమే. అటువంటి సరదాలను జూనియర్లు తేలికగా తీసుకోవాలి' అని ఒక విద్యార్థి కారి సెలవిచ్చాడు!

ఇటువంటి చనువుతో విద్యార్థులు అడ్డూ అదుపూ లేకుండా రెచ్చిపోడానికి అవకాశం వుంది.

సాధకబాధకాలన్నీ ఆలోచించి, 'జూనియర్లను బాధించిన సీనియర్లు శిక్షాపాత్రు'లని మద్రాసుప్రభుత్వం ఒక ఆర్డరు జారీచేసింది.

ప్రభుత్వం హెచ్చరికలు చేసినంత మాత్రాన ఏమీ ప్రయోజనంలేదు. విద్యార్థుల్లో అవినాభావ సంబంధాన్ని పెంపొందింపజేయాలి. ఒకరినొకరు బాగా అర్థం చేసుకోగల కార్యక్రమాలు వారికి కావాలి. విద్యార్థుల మానసిక విధానాన్ననుసరించిన విద్యావిధానం ఇందుకు ఎంతయినా ఉపకరిస్తుంది!

— ఆకాశరాజు.



ఇటీవల సూళ్లూరుపేటలో జరిగిన కళోత్సవాల్లో నటీనటులు విజయనిర్మల, సంధ్యారాణి, శోభన్‌బాబులకు సన్మానం జరిపారు. నేపథ్యగాయకుడు శ్రీ బసవేశ్వర్ ప్రార్థనాగీతాన్ని పాడారు.

# ఈరోజుల ప్రేక్షకుల మోజు జయలలితతో ఇంటర్వ్యూ



'మనుషులు—మమతలు' చిత్రం ద్వారా తెలుగు ప్రేక్షకులందరికీ సుపరిచితురాలైన కుమారి జయలలిత యింతవరకు 30 చిత్రాలలో నటించింది. ప్రస్తుతం 'చిక్కడు—దొరకడు' ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్, శ్రీ విజయభిట్ మూవీస్, ఎం. వి. ఆర్. పిక్చర్స్, హైదరాబాద్‌కు చెందిన రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్ తెలుగు చిత్రాలలో నటిస్తున్నది. ఇవిగాక అనేక తమిళచిత్రాల్లో కూడ ముఖ్యభూమికలు పోషిస్తున్నది.

ఇటీవల ఒక సాయంకాలం పూట నేనామెను వాహినీ స్టూడియోలో కలిసి, ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకోసం ఇంటర్‌వ్యూ చేశాను. ఈ ఇంటర్‌వ్యూలో ఆమె వెల్లడించిన విషయాలు పాఠకులకు ఆసక్తిదాయకం కాగలవనుకుంటున్నాను.

## ఈడేరని కోరిక

'సినిమా తార కావాలని చదువుకునే రోజులనుంచి మీకు కోరిక ఉండేదా!' అని అడిగిన నా ప్రశ్నకు జయలలిత నవ్వి 'లేదు. అప్పట్లో నా ఆశయం వేరుగా ఉండేది. పి. హెచ్. డి. చదివి లిటరేచర్‌లో డాక్టరేట్ డిగ్రీ తీసుకోవాలనుకునేదాన్ని. కాని, అది నెరవేరలేదు. సినిమాతారనయ్యాను. ఆ కోరిక యిప్పటికీ అలాగే మిగిలిపోయింది' అన్నది.

## స్టేట్ ఫస్ట్

'ఎక్కడ చదువుకున్నారు?' 'ఇక్కడే, చర్చిపార్క్ కాన్వెంటులో. మెట్రిక్యులేషన్‌లో మద్రాస్ స్టేట్‌కి ఫస్ట్ వచ్చాను. దేశంలోని ఏ విశ్వవిద్యాలయంలో అయినా నేను చేరి చదువుకోవచ్చునని ఢిల్లీనుంచి స్కాలర్‌షిప్ వచ్చింది. కాని యింతలో 'వెణ్ణిర ఆడయ్' తమిళచిత్రంలో నటించవలసిందిగా ఆహ్వానం అందింది. అక్కడితో చదువుకు స్వస్తి చెప్పవలసి వచ్చింది.'

## నైఫ్ పెయింటింగ్ యిష్టం!

ఈత కొట్టడమన్నా, బొమ్మలు గీయట మన్నా పెయింటింగ్ చేయటమన్నా కుమారి జయలలితకు ఎంతో యిష్టం. వీటిలో ఆమెకు చక్కటి ప్రవేశం వుంది. బొమ్మలు చాలాబాగా వేస్తుంది. 'మీకు డ్రాయింగ్ అంటే యిష్టం కదూ?' అన్న మరో ప్రశ్నకు ఆమె సమాధానం యిస్తూ డ్రాయింగ్‌కన్నా పెయింటింగ్...నైఫ్ (కత్తి) పెయింటింగ్ అంటే నాకు ఎక్కువ యిష్టం. బ్రష్ పెయింటింగ్‌లో 2 డైమెన్షన్ ఎఫెక్ట్ మాత్రమే వస్తుంది. పెద్ద ప్రత్యేకత ఏమీ ఉండదు. నైఫ్ పెయింటింగ్‌తో 3 డైమన్షన్ ఎఫెక్ట్ వచ్చి, ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. అందుకే నాకు నైఫ్ పెయింటింగ్ అంటే అంత యిష్టం!' అన్నది.



తారాపథంలో ఉన్నత శిఖరాలకు

## ముద్దులు వద్దు!

'మన చిత్రాలలో ముద్దులు ఉండడం అవసరమా, అనవసరమా అనే విషయంపై మీ అభిప్రాయం ఏమిటి?' 'నా అభిప్రాయం ప్రకారం — మన జీవనవిధానానికి 'కిస్సింగ్' సరిపడదు. పాశ్చాత్యుల నిత్య జీవితంలో అది సర్వసాధారణం గనుక—వారి చిత్రాలలో ముద్దులున్నా, అవి సహజత్వాన్ని కలిగి సన్నివేశానికి రసపుష్టి నిచేకూరుస్తాయి. మన సంస్కృతికి, సభ్యతకి భిన్నమైన యీ విధానం మన చిత్రాలలో ప్రవేశ పెట్టడం అనవసరం అని నా ఉద్దేశం.'

## పాములంటే భయం

'మీ జీవితంలో జరిగిపోయిన అద్భుత ఘటన ఏదయినా వున్నదా?' 'ఉన్నది. మమ్మీ ఓసారి మహాబలిపురం' పిక్నిక్ వెళదాం రమ్మన్నది. పాములంటే భయం నాకు. అంచేత రానన్నాను. 'ఫరవాలేదు లేమ్మా, అక్కడ పాములుండవు అని చెప్పి తీసుకువెళ్ళింది. అపుడు నాకు చిన్నతనం. మహాబలిపురంలో ఒక గుహలోకి వెళ్ళాం. అక్కడ శివుని శిల్పం ఒకటి గుండెల వరకూ చెక్కబడివున్నది. అది చెక్కిన శిల్పి నేర్పుకు ఆశ్చర్యపడుతూ అలా ముందుకి వెళ్తున్నపుడు— నాదగ్గరికి ఒక

పెద్ద త్రాచుపాము వస్తూండటం గమనించాను. ఒళ్లంతా చెమటపట్టేసింది. అది నాపక్కకంటూ వచ్చేస్తున్నది. భయంతో బిగుసుకుపోయాను. కాని, ఆ పాము నన్నేమీ చేయలేదు. తిన్నగా అది నా దగ్గర్నుంచి వెళ్లి శివుని మెడను చుట్టుకొని (మనం బొమ్మల్లోనూ, సినిమాల్లోనూ చూసేవిధంగా) నిలబడివుంది. ఆ పాము స్వచ్ఛమయిన పసుపు పచ్చరంగులో వుంది. నాకు తెలీకుండానే నా రెండుచేతులూ పరమశివునికి జోడించాయి ... అవి ఎంతటి భయంకర క్షణాలో అంతటి అద్భుతమయిన క్షణాలు. ఆ ఘటన యిప్పటికీ నాకు జ్ఞాపకం వస్తూనే వుంటుంది.'

## మైసూర్‌లో జననం

ఒకప్పుడు చక్కని నటిగా పేరుగాంచిన శ్రీమతి సంధ్య కుమార్తె జయలలిత. 1948 ఫిబ్రవరి 24న మైసూర్‌లో జన్మించిన జయలలితకు—ఆమెకన్న రెండేళ్లు పెద్దవాడైన అన్నగారు ఉన్నారు. ఆయన పేరు జయకుమార్. ఇక్కడే బి. యస్. సి. చదువుతున్నారు. సిరిసంపదలున్న యింటనే జన్మించినా — తల్లి సంధ్య పిల్లలిద్దర్నీ చక్కని క్రమశిక్షణలో పెంచారు. సౌకుమార్యంతో వాళ్లకి కష్టమంటే ఏమిటో కూడా నేర్పారు. ఈ ప్రస్తావన వచ్చినపుడు 'మేము మరీ సుకుమారంగా వుంటే సోమరిపోతులమవుతామని భయపడి మమ్మీ మమ్మల్ని—చిన్నప్పుడు కారువున్నా స్కూలుకి బస్సులోనే పంపించేది' అంటుంది జయలలిత. 'మీ అభిమానులకు ఏమయినా చెబుతారా?' అని అడిగినపుడు 'నాపట్ల విశేష ఆదరాభిమానాలను కనపరుస్తున్న అభిమానులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి అందజేయండి!' అన్నది నవ్వుతూ.

ఈనాడు నటిగా, అంతకుమించిన నర్తకిగా కీర్తి ప్రతిష్ఠలు గడిస్తూ, ధనార్జన చేస్తున్నా కుమారి జయలలితలో వీసమెత్తు అహంభావమయినా లేదంటే—ఆమెను ఎరిగున్నవాళ్లంతా ఒప్పుకుంటారు. సభ్యత, సంస్కారమూ, వినయమూ, చిరిపిగా నవ్వుతూ మాట్లాడడం ఆమె సొత్తు.

సరిగ్గా రెండున్నర ఏళ్లక్రితం మొదటిసారిగా ఆంధ్రసచిత్ర వారపత్రికలో నేను జయలలిత పరిచయం రాస్తూ 'ఈమెకు చలనచిత్ర జగతిలో ఉజ్వలభవిష్యత్తు ఉన్నదని పేర్కొన్నాను. అవాళ నేను రాసిన వాక్యాలు యివాళ సత్యదూరాలు కావనేందుకు యింతకన్న నిదర్శనం ఏమున్నది?

జయలలిత నటజీవితాన్ని తల్లి శ్రీమతి సంధ్య తీర్చిదిద్దుతున్నది. అందువల్లనే నటనలో తన కృషితోపాటు, తల్లి సలహాలను తీసుకొంటూ తారాపథంలో ఉన్నత శిఖరాలను అధిరోహిస్తున్నది, జయలలిత.

—మోహన్‌కుమార్



లలిత కళలపై ఆసక్తి

ఫొటోలు: ప్రభాకర్

## లోకం పోకడ

—కాల్పుల విరమణకోసం వత్తిడిచెయ్యమని సంయుక్త అరబ్ రిపబ్లిక్కే సోవియట్‌యూనియన్‌ని అడిగినట్లు ఇప్పుడు బయట పెట్టటం జరిగింది.

8—7—67 మెయిన్‌స్ట్రీమ్ పత్రికలో శ్రీ మోహిత్‌సేన్.

* * *

— 1939 లో బ్రిటిషు సామ్రాజ్యవాదుల్ని పాలస్తీనా ధర్మకర్తలుగా ఉండటానికి లీగ్‌ఆఫ్ నేషన్స్ నియమించింది, వీరు ఆతనిని (దాయాన్‌ని) జయోనిస్టు రహస్యోద్యమంతో సంబంధాలు పెంచుకున్నందుకు విర్బంధించింది.

23—6—67 తేదీ సోవియట్ పత్రిక 'ట్రూడ్' లో శ్రీ వి. రోగోవ్ (8—7—67 మెయిన్ స్ట్రీమ్‌లో ఈవ్యాసం ప్రచురించారు.)

* * *

—శ్రీ చవన్ శ్రీమతి గాంధీవయిపు ఉండటం మానివేస్తే ఆయన శ్రీ కామరాజాతో చేతులు కలుపుతారా? ఈనాడు శ్రీ కామరాజా విలువ ఎంత అనే విషయం కూడా ఆలోచించాలి.

8—7—67 మెయిన్‌స్ట్రీమ్.

* * *

—అందరికీ లభించే అధిక జీవన పరిమాణం కావాలని లెనిన్ కోరాడు. ఎవరికీ, ఏ కాలంలోనూ ఎక్కువ పరిమాణం కావాలని మావ్ (ట్సెటుంగ్) కోరడు. ఆయనలో గాంధీయ వాలకం ఒకటే వుంది. మనుష్యులు ఎల్లకాలం నిరుపేదలుగా, సుగుణవంతులుగా ఉండాలి—సుగుణం అంటే ప్రజాశ్రేయస్సు కోసం సంపూర్ణంగా జీవితాన్ని అంకితం చెయ్యటం.

15.7.67 స్వరాజ్యలో శ్రీ సి. ప్రాట్.



'దేవునిగెలిచిన మానవుడు'లో కాంతారావు, వాణిశ్రీ

చిత్రసమీక్ష

# దేవుని గెలిచిన మానవుడు

జానపద చిత్రాలు జనాన్ని బాగా ఆకర్షిస్తాయని, జనం వాటిని ఆదరిస్తారనే సత్యాన్ని చాలమంది నిర్మాతలు గ్రహించారు. జనాన్ని దృష్టిలో పెట్టుకుని, వారి అభిలాషమేరకు వినోదాన్నందించే సంస్థలలో ఒకటి 'గౌరీ ప్రొడక్షన్స్'.

వారి తాజాచిత్రం దేవుని గెలిచిన మానవుడు. మానవుడు దేవుడ్ని గెలవడం ఒక తమాషా! తమాషాకోసం ఈ చిత్రాన్ని అందరూ తప్పక చూస్తారు!

దేవుని గెలిచిన మానవుడు మొదట్నుంచి చివరిదాకా ఒకే పట్టులో నడుస్తాడు. నవ్వుతాడు, నవ్విస్తాడు. ఏడుస్తాడు, ఏడిపిస్తాడు. ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొంటూ, ప్రశంసల నందుకుంటూ చిత్రానికి శుభం పల్కుతాడు.

కథకు ఢమరకం ప్రాణం. విజయదత్తుడితో జూదమాడి శివుడు ఓడిపోతాడు. ప్రతిగా ఢమరుకం ఇస్తాడు. దాని ప్రభావంతో విజయదత్తుడికి రంభ భార్య అవుతుంది. విజయదత్తుడు చచ్చి బతికే సమయంలో ఇంద్రపదవి నందుకుంటాడు. రంభ శాప విమోచనం తర్వాత ఆమె శాశ్వతంగా విజయదత్తుడి భార్య అయిపోతుంది! ఇదీ కథ. గురుదత్తు ఉపకథ ఇంపుగా వుంది.

విజయదత్తుగా కాంతారావు పాత్రోచితంగా నటించి, దానికి విశిష్టత తీసుకు వచ్చాడు. వాణిశ్రీ కథానాయికి రంభగా చక్కని నటన ప్రదర్శించింది. గురుదత్తుగా చలం మరువరాని చక్కిలిగింతలు పెడతాడు. మిక్కిలినేని, వేణుమాధవ్, జి. వి. జి, సత్యం, జయకృష్ణ, సాంబశివరావు, ఎన్. వి. రాజ్‌కుమార్, గీతాంజలి, విజయలలిత, మాలతి, ఛాయాదేవి, రమాదేవి, రేణు, సరస్వతి మొదలయినవారు తమ తమ పాత్రలకి జీవం పోశారు.

సంగీతం వీనులవిందుగా వుంది. పాటలన్నీ బాగున్నాయి. ఏకోణంలోనుంచి చూసినా పర్యవేక్షణలో ప్రతిభ ద్యోతకమవుతుంది.

కథ, సినిమా అనుకరణ యస్. భావనారాయణ చేశారు. మాటలు పాలగుమ్మి పద్మరాజు, పాటలు సి. నారాయణరెడ్డి, వీటూరి. సంగీతం: రాజన్, నాగేంద్ర. కెమెరా: పి. చంద్రన్.

కథలో కొత్తదనమూ, చిత్రీకరణలో సొగసూ ఉన్న ఈ చిత్రానికి దర్శకుడు ఉన్నూరి కృష్ణమూర్తి. నిర్మాత: వై. వి. రావ్. నిర్వహణ: యస్. భావనారాయణ.

—సి. కనకాంబరరాజు

# చిత్రలహరి

చిరకాలంగా విడుదలకు నిరీక్షిస్తున్న ఇందిరారవణ పిక్చర్స్‌వారి 'సత్యమే జయం' చిత్రం యీనెల మూడవవారంలో విడుదల అవుతున్నది. రాజశ్రీ, శోభన్‌బాబు, గుమ్మడి, రామకృష్ణ, ప్రసన్నలక్ష్మి, రమణారెడ్డి, జి. వరలక్ష్మి, ముక్కామల, బాలకృష్ణ, రాజ్‌బాబు, వాణిశ్రీ మున్నగువారు నటించారు. రచన: జి. కృష్ణమూర్తి బి. ఏ. సంగీతం: కోదండపాణి, కళ: బి. నాగరాజన్, కూర్పు: మార్తాండ్, కెమేరా: కన్నప్ప, దర్శకుడు: పి. వి. రామారావు, నిర్మాత: టి. సి. సుబ్బన్న.

* * *

'కాలచక్రం' అనువాదచిత్రమైనా యీ చిత్రంలో మాటలు, పాటలు స్వచ్ఛమైన తెలుగుదనాన్ని తోపింపజేస్తున్నవి. 'మాయింట మొలిచిన విరిలతలే, పరులపంచలే గతియౌనా— దిగులెరగిలె నాలోనా...మా చిట్టి తండ్రి కుమిలేవా!' 'భువిని వెలసిన ప్రతి శిల్పంలో—మౌనవీణలే మోగేనా' అని రెండు పాటలు యిటీవల రికార్డుచేశారు. మొదటి పాటను సుశీల, యస్. పి. బాలసుబ్రహ్మణ్యం, ఎల్. ఆర్. ఈశ్వరి పాడారు. రెండవదాన్ని యస్. పి. బాలసుబ్రహ్మణ్యం పాడారు. ఈ యువగాయకుని గొంతు చక్కని మాధుర్యాన్ని కలిగివుండటమేగాక ఆ గొంతులో ఎంతో నిండుదనం తొణికిసలాడుతున్నది.

* *



ఆంధ్ర సోదరీమణులలో ఒకరైన చి. సౌ. మాలతి వివాహం ఈనెల 2 న బందరులో జరిగింది. వరుడు బి. కేశవరావు. హైదరాబాద్‌లో లేబర్ వెల్ఫేర్ ఆఫీసరుగా పనిచేస్తున్నారు.

## మీ కుటుంబ ఆరోగ్యముకోసం విటమినులు మరియు ఖనిజములు ఆవశ్యకం.

### ఇవి చాలినన్ని వారికి లభించుచున్నవా?




## క్రొత్త విమ్‌గ్రాన్® మల్టిపుల్ విటమినులు-ఖనిజముల బిళ్లలు

విటమినులు మరియు ఖనిజముల లోటు మీ కుటుంబ ఆరోగ్యమును పాడుచేయును. అలసట, బరువు, ఆకలి మందం, నీరసము, చర్మ వ్యాధులు మరియు పళ్ల జబ్బులు...ఇవి ముఖ్యావశ్యకమైన విటమినులు మరియు ఖనిజముల లోటు వల్ల సామాన్యంగా సంభవించుచుండును. మహా జాగ్రత్తయైన శ్రద్ధతో యోచించి తయారుచేయబడు ఆహారములందు సహితము ఇంకా ఈ విటమినులు, ఖనిజములను గురించి తరుచు లోపం కలుగును. ఘనమైన, పుష్టికర ఆహారమంతయు సంతులితమైన ఆహారము కానేరదు. అనేక విధాల ఆహారములందు విటమినులు ఖనిజముల లోటు వుండును. అట్టి సందర్భంలో మీ కుటుంబము ముఖ్యావశ్యకమైన విటమినులు, ఖనిజములు. అన్నియు — సరియైన మోతాదులలో పొందుచున్నారని మీరు ఎట్లు నిర్ధారణ చేసుకోగలరు ?

మీ కుటుంబములో ప్రతి ఒక్కరికిన్ని ఈ ముఖ్యావశ్యకమైన పుష్టికర పదార్థములను వారికి కావలసిన మోతాదులలో రూఢిగా లభించుచుండుటకు వారికి విమ్ గ్రాన్-స్క్విబ్ మల్టిపుల్ విటమినులు-ఖనిజముల బిళ్లలను ఇవ్వండి. రోజుకి ఒక్కటి ఈ ఆరోగ్యకరమైన అలవాటును నేటి నుండియే ఎందుకు ప్రారంభించగూడదు ?

విమ్ గ్రాన్‌లో పదకొండు ముఖ్యమైన విటమినులు, ఎనిమిది ఖనిజములు సరియైన మోతాదులలో వున్నవి. ఎఱ్ఱని రక్తకణములను వృద్ధి పరచి, శక్తిని కలిగించుటకు ఐరన్, ఎముకలను, పళ్లను దృఢముగా నుంచుటకు కాల్షియమ్, జబ్బును నిరోధించే శక్తిని బలపరచుటకు విటమిను సి మంచి నేత్ర దృష్టికి మరియు ఆరోగ్యవంతమైన చర్మమునకు విటమిను ఎ, ఆకలిని పుట్టించి అంతర్యశక్తిని పెంపొందించుటకు విటమిను బి12, అంతేగాక మీ కుటుంబ ఆరోగ్యము నిమిత్తం అవసరమైన ఇంకా యితర ముఖ్యమైన పుష్టికర పదార్థములు గలవు.

విమ్ గ్రాన్ ఒక్క బిళ్ల ఖరీదు సుమారు 13 పైసలు మాత్రమే, మీ కుటుంబ ఆరోగ్యము కోసం నిజంగా బహు స్వల్ప ఖర్చు. ఈ దినమే విమ్ గ్రాన్ కొనండి — ప్రతి దినమూ విమ్ గ్రాన్ తీసుకోండి.

# విమ్‌గ్రాన్®

విమ్ గ్రాన్ ఒక్క బిళ్లే
దినమునకు
మీకు పుష్టికరం

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్, ఇన్కార్పొరేటెడ్ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు. ఈ పేర్లను ఉపయోగదారులు కరంచంద్ ప్రేమ్‌చంద్ ప్రయివేట్ లిమిటెడ్.

SQUIBB® SARABHAI CHEMICALS

Shilpi SC 256 TEL

# చిత్రలహరి

చలనచిత్రాల్లో నటించేందుకు కొత్తవారి కోసం దేశస్థాయిలో పోటీకమిటీ నొకదాన్ని ఏర్పరిచారు. చిత్రాల్లో కొత్తదనం, కొత్త రకం కనిపించడంకోసం బొంబాయి నిర్మాతలు తమ చిత్రాలలోకి కొత్తవారిని తీసుకోవాలని ఈ పోటీ కమిటీని ప్రవేశపెట్టారు. స్టార్ సిస్టమ్‌తో చిత్రనిర్మాత వ్యయం నానాటికి పెరిగిపోతున్నది. ప్రతిభగల యువతీయువకులకు అవకాశాలు కల్పించి తద్వారా ఈ స్టార్‌సిస్టమ్‌ను రూపుమాపాలనే ప్రయత్నం బొంబాయి నిర్మాతల్లో కనిపిస్తున్నది. ఈ పోటీకమిటీని యునైటెడ్ ప్రొడ్యూసర్స్ గిల్డ్‌వారు, బొంబాయినుండి వెలువడే రెండు ప్రముఖ సినిమాపత్రికలు—మాధురి, ఫిలిమ్‌ఫేర్ నిర్వహిస్తున్నవి. యునైటెడ్ ప్రొడ్యూసర్స్ గిల్డ్ అనేది కొంతమంది నిర్మాతలు కలసి స్థాపించిన ఒకసంస్థ. ఈ సంస్థలో జి. పి. సిప్పి, బి. ఆర్. చోప్రా, నజీర్ హుసేన్, సుబోధ్ ముఖర్జీ, శక్తిసామంత, హేమంత్‌కుమార్, మోహన్ సైగల్, దేవేంద్ర గోయల్, ఎఫ్. సి. మెహ్రా, జె. ఓంప్రకాష్, హెచ్. ఎస్. రావెల్ సభ్యులు.

పోటీకమిటీ ఛైర్మన్ శ్రీ జి. పి. సిప్పి "దరఖాస్తులు దేశం నలుమూలలనుంచీ కోరబడుతున్నవి. ఆగస్టు నెలాఖరుకు అవి మాకు చేరాలి' అని చెప్పారు. మొదటి ఇంటర్వ్యూలు చండీఘర్, ఢిల్లీ, లక్నో, కలకత్తా, హైదరాబాద్, బొంబాయిలలో జరుపబడుతవి. ఈ సెంటర్సులో ఎన్నికయిన అభ్యర్థులు నిర్వాహకుల ఖర్చులమీద—స్క్రీన్ టెస్ట్‌కీ, వాయిస్ టెస్ట్‌కీ పిలిచినపుడు బొంబాయి రావలసివుంటుంది. చదువుకున్న యువతీయువకులకు వారి స్కూలు, కాలేజీలలో నాటకాలలో పాల్గొని ప్రతిభ గడించినవారికి ప్రాధాన్యత యివ్వబడుతుంది. పూర్తి వివరాలకు: 'ఎడిటర్: మాధురి—టైమ్స్ అఫ్ ఇండియా బిల్డింగ్, బొంబాయి'కి రాసి తెలుసుకోవచ్చును.

* * *

మధు పిక్చర్సు వారి నాలుగవ తెలుగు చిత్రాన్ని జూలై 6వ తేది ఉదయం గం. 11 కి హైదరాబాద్‌లోని శ్రీ సారథీ స్టూడియోలో ప్రారంభించారు. రాష్ట్ర సమాచారమంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ కెమెరా స్విచ్ ఆన్ చేయగా—విజయాప్రొడక్షన్స్ అధినేతలలో ఒకరయిన శ్రీ చక్రపాణి క్లాప్ కొట్టారు. మొదటి షాట్‌లో ప్రధానభూమికలు నిర్వహిస్తున్న నాగేశ్వరరావు, గుమ్మడి నటించారు. ఇంకా నామకరణం చేయని ఈ చిత్రంలో జానకి. కాంచన, కృష్ణ, విజయనిర్మల, చంద్రమోహన్, చలం, అల్లు రామలింగయ్య, గీతాంజలి యితర ముఖ్యపాత్రధారులు. సంభాషణలు: ఆత్రేయ, సంగీతం: కోదండపాణి, కెమెరా: సెల్వరాజ్, దర్శకుడు: వి. మధుసూదనరావు, నిర్మాత: పి. మల్లికార్జునరావు.

* * *

ఈ చిత్ర ప్రారంభానికిముందు మంత్రి శ్రీ లక్ష్మణ్ బాపూజీ మాట్లాడుతూ 'రాష్ట్రంలో ఫిల్ము పరిశ్రమను అభివృద్ధి పరచేందుకు ప్రభుత్వం పలువిధాల యత్నిస్తున్నది...శ్రీయుతులు ఎల్. వి. ప్రసాద్, యన్. టి. రామారావుగార్లకు స్టూడియోల నిర్మాణానికి విజయువాడ రోడ్‌లో హయతానగర్‌వద్ద స్థలాలను కేటాయించేందుకు ప్రభుత్వం తుదినిర్ణయం గైకొన్నదనీ—మరొక వారం, పదిరోజుల్లో వారికాస్థలాలు అప్పగించబడుత'వనీ చెప్పినట్లు తెలుస్తున్నది.




'గొప్పవారి గోత్రాలు'లో శేషగిరిరావు, ఇందిర.

శ్రీ కె. శ్రీనివాసరావు (నవయుగ ఫిలిమ్స్) నిర్వహణక్రింద యిప్పుడు శ్రీసారథీ స్టూడియోస్ ఎంతగానో అభివృద్ధి చెందింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యిచ్చిన నిధితో శ్రీ సారథిలో మరొక కొత్త ఫ్లోర్ కట్టారు. ఇది యీ స్టూడియోలో గల ఫ్లోర్‌లతో నాలుగవది. ఇంతకు ముందున్న మూడుఫ్లోర్‌లకన్న యిది ఎంతో పెద్దది. చారిత్రాత్మకాలు, పౌరాణికాలు నిర్మించుకోవటానికి యీ ఫ్లోర్ చాలా అనువుగా వుంటుంది. ఇపుడీ ఫ్లోర్ తయారవటంవల్ల ఒకేసమయాన రెండు చిత్రాలు షూట్ చేసుకోవచ్చును. ఏకకాలంలో అనేకచిత్రాలు నిర్మించుకోవటానికి వీలుగా వుండేందుకు విశేష యత్నాలు సలుపుతున్నారు.

* * *

ప్రసిద్ధ ఛాయాగ్రాహకుడు శ్రీ పి. నాగేశ్వరరావు యీనెల 11 వ తేదీ ఉదయం పదిగంటలప్రాంతాన మద్రాసులోని జనరల్ హాస్పిటల్‌లో మరణించారు. కొద్దిరోజులుగా ఆయన అస్వస్థులుగా వుంటున్నారు. శ్రీ నాగేశ్వరరావుకి భార్య, అయిదుగురు బిడ్డలు వున్నారు. పిల్లలంతా పసివాళ్ళు. మరణించేనాటికి ఆయన వయస్సు 39 సం. లని తెలుస్తున్నది.

* * *

శ్రీ పి. నాగేశ్వరావు అతి చిన్న వయస్సులోనే ఎంతో ప్రతిభను సంపాందించుకొని కామెరామెన్ అయినారు. మొదటిసారిగా ఆయన 'టింగ్‌రంగా' చిత్రానికి కామెరామన్‌గా పనిచేశారు. నాటినుంచి నేటిదాకా పలుచిత్రాలకు పనిచేస్తూ పరిశ్రమలో ఛాయాగ్రాహకుడుగా ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాయించుకున్నాడు. గుడిగంటలు, అంతస్థులు, భార్యాభర్తలు, ఆస్తిపరులు, డాక్టర్ ఆనంద్, పరమానందయ్య శిష్యులకథ, పాండవవనవాసం చిత్రాలు పి. నాగేశ్వరరావుగారి ఛాయాగ్రహణ ప్రతిభకు నిదర్శనాలు. మరణించేముందు ఆయన 'స్త్రీజన్మ', 'వీరాంజనేయ' మున్నగు చిత్రాలకు కెమెరామన్‌గా పని చేస్తున్నారు. ఈ నాడు స్వతంత్ర ఛాయాగ్రాహకులయి పేరు సంపాయించుకొంటున్న యస్. వెంకటరత్నం, ఎం. జి. సింగ్, చంద్రశేఖర్‌లు పి. నాగేశ్వరరావుగారి శిష్యులు. శ్రీ పి. నాగేశ్వరరావులాంటి అరితేరిన కెమెరామన్‌ని కోల్పోవటం తెలుగు వారి దురదృష్టం. ఆయన మరణం చలన చిత్ర పరిశ్రమకు తీరనిలోటు!

* * *

శ్రీ రాధాకృష్ణ ప్రొడక్షన్స్‌వారు నిర్మిస్తున్న సాహసోపేత సాంఘిక చిత్రానికి 'ప్రతీకారం' అని నామకరణంచేసినట్లు ఆ చిత్రదర్శకుడు శ్రీ ఎం. నాగేశ్వరరావు చెప్పారు. హరనాథ్, చంద్రకళ, శోభన్‌బాబు, సంధ్యారాణి, ధూళిపాళ, రాజ్‌బాబు, ప్రసాద్ ముఖ్యభూమికలు పోషిస్తున్న యీ చిత్రం ఆరురీళ్ళు తయారయింది. మాటలు, పాటలు : ఆంజనేయశాస్త్రి, సంగీతం : సత్యం, కెమెరా: శ్రీకాంత్, కళ: రాజేంద్రకుమార్, నిర్మాత: ఎల్. రమణారెడ్డి.

యీనెల 11వ తేదీన విజయా గార్డెన్స్‌లో రెండుపాటలు రికార్డ్ చేశారు. మొదటి పాట: 'నా చూపే పిలుపురా, ఆ పిలుపే కైపురా—కాదనకా రానరా, నీలో లోదానరా' అనేది. ఎల్. ఆర్. ఈశ్వరి పాడింది. రెండవది: 'స్టాప్ లుక్ అవ్ అండ్ గో, పరువముతో పరుగిడకే — వంపు సొంపుల నడకలలో హాయలున్నవిలే, బయలున్నవిలే' అనేది. ఎస్. జానకి, జేసుదాసు పాడారు. ఆంజనేయశాస్త్రి రాసిన యీ రెండు పాటలకు సంగీత దర్శకుడు సత్యం హృద్యంగమయిన వరుసలు చేసి చక్కని వాయిద్య గోష్టిని అమర్చారు. మొదటి పాటను సంధ్యారాణి, శోభన్‌బాబు మీదా, రెండవదాన్ని హరనాథ్, చంద్రకళల మీదా చిత్రీకరిస్తారు.

* * *

సూర్యచిత్రవారి 'పెళ్లిరోజు' చిత్రానికి



"చిందుమనసులు"లో ఎన్. టి. రామారావు, యల్. విజయలక్ష్మి

## చిత్రలహరి

యీనెల 7, 8, 9, 10 తేదీలలో షూటింగ్ జరిగింది పీసన్‌లో. కామెడీ సెట్‌లో పద్మనాభం, గీతాంజలి, రావికొండలరావు, విద్యశ్రీలపై కొన్ని దృశ్యాలను తీశారు. దీనితో యీ చిత్రం ఆరు రీళ్లు పూర్తి అయింది. జమున, హరనాథ్ ప్రధాన భూమికలు నిర్వహిస్తున్న యీ చిత్రంలో రేలంగి, హేమలత, విజయ్ కుమార్, బేబీ ఇందిర తారాగణంలో యితర ముఖ్యులు. రచన: రాజశ్రీ, సంగీతం: ఎం. ఎస్. శ్రీరామ్, కళ: రాజేంద్ర కుమార్, కెమెరా: ఎం. జి. సింగ్, కూర్పు: హరినారాయణ, దర్శకుడు: మానాపురం అప్పారావు, నిర్మాతలు: ఎం. ఎస్. శ్రీరామ్, నాగేశ్వరరావు.

—మోహన్‌కుమార్

## అవీ - యివీ...

### లెదర్‌లే సేల్స్‌మెన్ అమెరికా పర్యటన

సైనమైడ్ ఫార్మస్యూటికల్ సంస్థకి చెందిన లెడర్‌లే విభాగంలోని తొమ్మిదిమంది సేల్స్‌మెన్ ఇంటర్నేషనల్ సేల్స్ ఎవార్డుల ఉత్సవంలో పాల్గొనటానికి ఇటీవల అమెరికా వెళ్లారు.

ప్రతి సంవత్సరం ఈ ఎవార్డుపోటీలో ప్రపంచంలో ఉన్న 2,000 మంది లెడర్‌లే మెడికల్ రిప్రజెంటేటివ్‌లు, ఫీల్డ్ సేల్స్ మేనేజర్లు పాల్గొంటారు. ఇంతవరకూ భారతదేశంలోనిసంస్థకు మూడు సార్లు ఎవార్డు వచ్చింది. అప్పుడు ఎనిమిదిమంది సేల్స్‌మన్ అమెరికా వెళ్లారు. విజేతల పేర్లు ప్రకటిస్తూ, సైనమైడ్ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ శిశిర్ మిత్రా భారతదేశంలో సేల్స్‌మెన్ వృత్తి దేశంలోని పరిశ్రమలతోపాటు అత్యంతశీఘ్రంగా పురోగమిస్తున్నదని, ఫార్మస్యూటికల్ పరిశ్రమ స్వయం సమృద్ధిని అధిగమించడానికి సత్వరంగా సాగిపోతున్నదని ఇలాంటి సమయంలో సేల్స్‌మెన్ బుద్ధి కుశలత, నైపుణ్యము ఎక్కువ అవశ్యకమని తమ సంస్థ వారి ప్రాముఖ్యతను గుర్తించి తగిన విధంగా ప్రతిఫలాన్ని అందజేస్తున్నదని ఆయన అన్నారు. (ఓ. వి.)



"కాదల్ పరవై" తమిళచిత్రంలో భారతి

### నాట్యాచార్య కోరాడ బృందానికి వీడ్కోలు

ప్రఖ్యాత అంతర్జాతీయ నర్తకులు నాట్యాచార్య కోరాడ నరసింహారావు తన బృందముతో సీఫా, సిక్కిం, నేపాలు, సరిహద్దులలో గల మన జవానుల మనో రంజనకై భారత ప్రభుత్వరక్షణ శాఖవారి అధ్వర్యమున నాట్యప్రదర్శనములిచ్చుటకు బయలుదేరు సందర్భమున ఘనంగావీడ్కోలు యివ్వబడినది.

ఆరోజు సాయంకాలము రాజనాల కళాభవనమందు ఘనమైన వీడ్కోలుసభ ఏర్పాటు గావింపబడినది. ఈసభకు శ్రీ రాజనాల గోపాలరావు నాయుడు జమిందారు అధ్యక్షత వహించిరి. అధ్యక్షులు మాట్లాడుతూ శ్రీకోరాడ కూచిపూడినాట్యమునకు ఎనలేని కీర్తినార్జించిరని కొనియాడిరి. శ్రీ తాడి గురుమూర్తి ఆర్. రామారావుగారు అభినందించిరి. శ్రీ కోరాడను పట్టణములోగల వివిధ సంస్థలు కళావేత్తలు పూలమాలలచే సన్మానించిరి. పిమ్మట కుమారి రాణి, కుమారి రాజనాల నాగమణి, లక్ష్మణరావు గార్లు నాట్యప్రదర్శనలిచ్చారు. (ఓ. వి.)

# జలుబులు, ఫ్లూలా ?



## 2 అనాసిన్ చప్పున తగ్గిస్తుంది

జలుబులు మీకు చాల కష్టంకలిగించవచ్చు. ముక్కునుండి ఒకటే నీరుకారుతుంటుంది. తుమ్ములమీద తుమ్ములు వస్తాయి. మీ శరీరమంతా నొప్పితో నలుగుతుంటుంది. మీరు దేనిమీద ధ్యాసం నిలుపలేకపోవచ్చు. వెంటనే 2 అనాసిన్ తీసుకోండి, ఎంత వేగంగా, 4 విధాలుగ అవి పని చేస్తాయో చూడండి.

1. అనాసిన్ జలుబులు, ఫ్లూలవల్ల కలుగు కష్టము నివారిస్తుంది—చప్పున
2. అనాసిన్ అలసటను తీసివేస్తుంది—చప్పున
3. అనాసిన్ ఉదాసీనతను పారదోలుతుంది—చప్పున
4. అనాసిన్ నరాలబిగువును సడలిస్తుంది—చప్పున

ఇందుకు కారణం, డాక్టరిచ్చిన ప్రిస్క్రిప్షనువలె అనాసిన్‌లో ఔషధాలు కలిసి ఉన్నాయి. భారతదేశంలో ఇతర బాధోపశమనకారులకన్నా అనాసిన్‌నే ప్రజలు ఎక్కువ వాడుతున్నారంటే అందులో ఆశ్చర్యపడవలసింది యేమిలేదు.

ఈసారి జలుబు చేసిన వెంటనే అనాసిన్ తీసుకోండి. అనాసిన్ తలనొప్పి, పంటినొప్పి ఒళ్లునొప్పులనుండి కూడా నివారణనిస్తుంది అనాసిన్ దగ్గర ఉంచుకోండి. అనాసిన్ కావాలని పట్టుపట్టండి.

# అనాసిన్

**చాలా మంచిది ఎందుకంటే**

**అది 4 విధాలుగ పనిచేస్తుంది**




Regd. user: GEOFFREY MANNERS & CO. LTD.

# పుస్తకాలు

## నీడలూ జాడలూ (నవల)

రచన. శ్రీపోరంకి దక్షిణామూర్తి. క్రౌన్ సైజు 207 పేజీలు. వెల: రూ 3—50: మేలు ప్రతి రూ 4—50. ప్రతులకు: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2.

భారతస్వరాజ్య ఉద్యమంతో ప్రారంభమవుతుంది నవల. ప్రధాని శాస్త్రి అస్తమయంతో ముగుస్తుంది. భారత రాజకీయ చరిత్రా, ఆంధ్రరాజకీయ చరిత్రా తోడునీడల్లాగా నడుస్తాయ్— 'నీడలూ—జాడలూ' లో.

నాయకుడు ఆంధ్రుడు. నాయిక తెలంగాణా పడుచు. పల్లెలో పుట్టిన ఈకథ పట్నవాసంలో కంచి కెళుతుంది.

మన శాంతి దూతలు గాంధి, నెహ్రూ, శాస్త్రి వీరి గుణాలను పుణికిపుచ్చుకున్న మరి ముగ్గురు అదృశ్య వ్యక్తులు ఇందులో చిత్రింప బడ్డారు—

నాయకుడు రంగారావుతండ్రి—లక్ష్మినారాయణ. నాయిక అరవిందతండ్రి— పద్మారావు

'ఇత్తెహాద్' సంపాదకుడు—షోయబుల్లాఖాన్.

ఇక—కథానాయకుడికథ: రంగారావు వందేమాతరం సమయానికి బాలుడు. స్వరాజ్యం ప్రాప్తించే నాటికి విద్యార్థి, ఆంధ్ర రాష్ట్రం ఏర్పడకముందు కాలేజి విద్యార్థి, ఏర్పడ్డాక ఉద్యోగి. విశాలాంధ్ర నిర్మాణానికి—ఆంధ్ర తెలంగాణా సమైక్యతకూ ముందుకి దూకిన ధీరుడు.

నాటకానికి చిన్న పాత్ర అయినా సరస్వతి చలాకీతనం, మాటకారితనం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది.

"నయినే, ఉత్తరం రాయకుండానే దిగావుకాదు... ఈ వూళ్ళో మనుషుల్ని ఎత్తుకు పోయేవాళ్ళు తిరుగుతూ వుంటారు."అంటుంది, కన్నులు ఇంతలు అంతలు చేసి. "బావా!—నిన్ను వరించే పిల్ల ఇంత వరకూ పుట్టలేదేమో?—" అని మరదలు సరస్వతి ప్రశ్న.

"ఇంకా పుట్టవలసిందయితే ఈజన్మకి నాకు పెళ్లియోగం ఉండదు"—అంటాడు రంగారావు.

ఇందులో పిసరంత వేదాంతం కూడా—

"ఆనందంలోని విషాదం, విషాదంలోంచి ఆనందం ఏమిటి ఈ నిగూఢ రహస్యం?—"అంటూ రంగారావు వాపోతాడు.

"ఇదంత కలిస్తేనేకద జీవితం!"అంటుంది, అరవింద.

స్థలానుగుణమయిన తెలంగాణా మాండలికాలతో ఇంపుగా సొంపుగా నడిచింది రచన—

"అప్పుడే మామను గురుతుపట్టినవా కోడల"

"మా పాపనే మగన్నెత్తుకొని ఆడిస్తది."

విశాలాంధ్ర దృక్పథంతో ధారావాహికంగా సాగిన ఈ నవల—మబ్బు దొంతర్లోంచి 'కారవిల్'విమానం వేగంగా ముందుకు దూసుకు పోయినట్లు — మనల్ని లాక్కుపోతుంది.

—శివకుమారి

## సాహిత్యము-ఉద్దేశము

ఇది సాహిత్యం మీద ఒకచర్చ. లోతయిన విమర్శ. సాహిత్యము అంటే ఏమిటో ఈపుస్తకం నిర్వచించింది. అభ్యుదయ దృషి తో ప్రేమచంద్ ప్రయోజనాత్మకంగా రచించారు. సాహిత్యాభిలాషు లందరూ చదవ వలసిన పుస్తకం. గెటప్‌బాగుంది. 162 పేజీలూ అనువాదంలా ఎక్కడా కనిపించవు. వెల రు. 2—50 విశాలాంధ్ర పబ్లిషింగ్ హవ్స్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

## సంగమం

కథలు. రచయిత ఎ. సర్వేశ్వరరావు కలాన్నుంచి వెలువడ్డ ఆరు కథలు. ఆరూ ఆరు తరహాలు. వరహాల్లాంటివి. 240 పేజీల సాదాప్రతి రు 3, మేలు ప్రతి రు 4. ప్రతులకు దేశీబుక్ డిస్ట్రిబ్యూటర్స్, శరత్ బిల్డింగ్సు, విజయవాడ— 2.

## నటశ్రీ

నాటిక. నేనింకా వెనకటి దశలోనే ఉన్నాను. పాలకుల్లో యింత అవినీతి, అక్రమాలు పెరిగిపోతాయని నేననుకోలేదు'.—ఇది వెంకటప్పయ్య అంతంలో తెలుసుకున్న నిజం. కథ ఊహాతీతంకాదు. ప్రదర్శనకు కూలమైన నాటిక. రచన:కొడాలి గోపాల రావు. చక్కని కవర్ పేజ్, 76 పేజీలుకల పుస్తకం వెల రెండు రూపాయలు. ప్రతులకు బృందావన్ పబ్లిషింగ్ హవుస్, వారిస్‌పేట, తెనాలి.

—సీతరాజు ●

# వెండడుకి వేత

(21 వ పేజీ తరువాయి)

'నీ కుక్క చాలా బాగుందోయ్!'

'ఐదేళ్లకిందట దీన్ని తీసుకొచ్చాం. అప్పుడు నేడు మా అక్కని ఉడికించేవాడిని ఈ కుక్క కన్న నువ్వు ఐదురెట్లు పెద్దదానివని. తమాషా చూశారో లేదో ఇప్పుడు మా అక్క దీనికన్న మూడురెట్లే పెద్దది మరి కొన్నేళ్ళు పోతే ఇద్దరి వయస్సూ సమానం అయిపోదుకదా అని నా భయం.' అన్నాడు మేరీ తమ్ముడు పకపకా నవ్వుతూ.

ఆ కుక్కకి ఎంత వయస్సో తెలిస్తే బాగుండును అనుకున్నాడు జాన్. కాని, అడగడం మర్యాదకాదుకదా! అది తెలుసుకున్నాకనే పెళ్లిసంగతి ఎత్తవచ్చునని ఆ రోజుకి వాయిదా వేసేశాడు.

ఇంతకీ పెళ్లికూతురికి ఎంత వయస్సో మీకు తెలిసిందా?

### జవాబులు

(క) బొమ్మలో ఎడమవైపుని, కుడివైపుని చిట్టచివర ఉన్న రెండు వజ్రాలనూ కాజేసి, అన్నింటికన్న కింద ఉన్న వజ్రాన్ని తీసి, అన్నింటికన్న పైన అతికించాడు. అంతే!

* * *

(చ) అరటిపళ్లకోసం కేటాయించిన డబ్బు రూ 50. 40పైసలు. దీనితో 35డజన్ల ఎర్రపళ్ళూ, 35డజన్ల పసుపుపళ్ళూ (మొత్తం 70 డజన్లపళ్ళు) కొనవచ్చు కాని, డబ్బును రెండు సమాన భాగాలు చేస్తే రూ 25.20పై.కు 42 డజన్ల పచ్చని పళ్ళు. మరో రూ 25.20 పై.కు 30 డజన్ల ఎర్రనిపళ్ళ (మొత్తం 72డజన్ల పళ్ళు కొనవచ్చు.

* * *

(ట) పెళ్లికూతురి వయస్సు 30 సంవత్సరాలు. ●

# విగ్రహారాధన

(16 వ పేజీ తరువాయి)

అవమానించినట్లు భావిస్తున్నారు. మీ ప్రభువు దేశాంతరంలో ఉన్నా ప్రతికృతినే మహారాజుగా భావించి మీరు గౌరవిస్తున్నారు కదూ !'

'చిత్తం...మీరన్నట్లే'అన్నాడు మంత్రి.

'అదేవిధంగా సర్వవ్యాపి అయిన భగవంతుడు విగ్రహంలో లేకపోయినా, అతని ప్రతికృతిగా భావించి మనం ఆయనను ఆరాధిస్తున్నాం. ఆయనను ఆరాధించడానికి సామాన్య ప్రజకు మరొక మార్గంలేదు. మహాజ్ఞానులకుమాత్రం భగవత్తత్వం అర్థమవుతుంది. మహాయోగులకుగాని సమాధి నిష్టసాధ్యంకాదు. సామాన్యప్రజ భగవత్సాన్నిధ్యాన్ని పొందడానికి విగ్రహారాధన అవసరమే కదా! విగ్రహారాధన మనకు ముఖ్యంకాదని ఎలా అనగలము?' అని స్వామి వివరించాడు.

మహారాజు కు సంతృప్తి కలిగింది. సందేహం పటాపంచలైపోయింది. ఆయన ఆనంద బాష్పాలు విడుస్తూ స్వామికి నమోవాకాలు సమర్పించారు. ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# నిమిషాలే పరమావధి యైనప్పుడు















## సైంటిస్టులు కనుగొన్నారు
### నొప్పిని అతి శీఘ్రంగా తొలగించునట్టి విధానమును

బాధ మా సమస్య: "ఆస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో బాధ యొక్క సమస్య మీద పనిచేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'ను కనుగొన్నారు — ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము.

మైక్రోఫైన్డ్ అంటే ఏమిటి? మైక్రోఫైన్డ్ అంటే "ఆస్ప్రో"లోని నొప్పిని పోగొట్టే పదార్థము ముప్పది రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు, ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పనిచేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

అతి శీఘ్రంగా పని చేస్తుంది - చాలా సేపు ఉంటుంది: క్రొత్త మైక్రోఫైన్డ్ "ఆస్ప్రో"లోని ముఖ్యమైన పదార్థము సునాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 5 నుండి 7 గంటలదాకా వుంటుంది. ఇందువల్లనే, మైక్రోఫైన్డ్ "ఆస్ప్రో" అతి శీఘ్రముగా నొప్పిని తొలగిస్తుంది. మరియు చాలా సేపు వుంటుంది.

వీటికోసం క్రొత్త మైక్రోఫైన్డ్ "ఆస్ప్రో"ను వాడండి: నొప్పి • తల నొప్పి • ఒళ్ళు నొప్పి • పంటిపోటు • కీళ్ళ నొప్పి • జ్వరముతో కూడిన జలుబు • ఫ్లూ • కీళ్ళ • నొప్పులతో కూడిన వ్యాధం గొంతుక నొప్పి.

మోతాదు: పెద్దవారికి, రెండు బిళ్లలు, అవసరమైతే మళ్ళీ వేసుకోండి. పిల్లలకు, ఒక బిళ్ళ లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకో వలెను.

క్రొత్త మైక్రోఫైన్డ్ "ఆస్ప్రో", నొప్పిని నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి ఆధునిక మైన సాధనము.

NEW
for headache, pain, colds & flu
'ASPRO'
microfined for quicker absorption

క్రొత్త
మైక్రోఫైన్డ్
'ఆస్ప్రో'
అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును

AG 14-67 TE.